Title of the last Edition.

శ్రీరస్తు.

కృతి

# శ్రీభాగవతసార ముక్తావళి

కృతికర్త:

చిత్పురము కటుమంచి పురనివాసులగు

నార్తార్కాడు డిస్ట్రిక్టుకోర్టుప్లీడరును

శ్రీ భారతసార రత్నావళి కృతికర్తయును నగు

## సుబ్రహ్మణ్యరెడ్డిచే

సర్వజనంబులకు చతుర్విధపురుషార్థప్రదంబుగ

శ్రీమహాభాగవతంబునం గల సారతరపద్యంబుల నేర్చి

కూర్పఁబడి

చిత్తూరు గవర్నమెంటు హైస్కూల్ ఆంధ్రభాషా పండితులగు

శ్రేష్ఠులూరు కుప్పనయ్యంగార్ల వలన

సవరింపఁబడి

చెన్నపురి:

తిన్ననూరు రామానుజయ్యగారి

"ఎక్సెల్సియర్" ముద్రాక్షరశాలయందు ముద్రింపించి

ప్రచురింపఁబడియె.

శకము 1811.

సర్వధార్యబ్దము.

1888.

FIRST EDITION.

శ్రీ ర స్తు.

శ్రీ భా గ వ త సా ర ము క్తా వ ళి.

# అవతారిక



శ్రీమచ్చెన్నపురిరాజధానికిఁ జేరిన నార్తార్కాడు డిస్ట్రిక్టు చిత్తూరముచేరువనుండు కట్టమంచియను గ్రామమందలి పుడమిఱేఁడులయిన పాకనాటివంశోద్భవులగు శ్రీమాన్ రామలింగారెడ్డిగారి పౌత్రుండును వీరరాఘవరెడ్డిగారి పుత్రుండును నగు సుబ్రహ్మణ్యరెడ్డియను నేను శ్రీమదాంధ్రభాగవతమునందుఁ గల సారతరపద్యంబుల నేర్పరించి ఈక్రింద వివరించు హేతువులంబట్టి ప్రాచుర్యముఁ జేయ నిశ్చయించినాఁడ.

చతుర్వేదసారంబగు శ్రీభారతాష్టాదశపర్వంబులం దుండెడు ప్రవృత్తి నివృత్తిమార్గములు మొదలగువానిని స్పష్టముగాఁ దెలియఁ జేయఁదగిన పద్యంబుల నెల్లను గూర్చి శ్రీభారతసారరత్నావళియను గ్రంథమును 1885 పార్థివ సంవత్సరమునఁ బ్రచురపరచియున్నాఁడ.

అఖిలాండకోటిబ్రహ్మాండనాయకుఁడును సచ్చిదానంద స్వరూపుఁడునునగు భగవంతునియొక్క సగుణ నిర్గుణ మార్గములను దత్సంబంధ ధ్యానానుష్ఠానముల తెఱంగును నెఱింగించుటకొఱకు శ్రీభారతమునకు వెంబడి శ్రీ భాగవత మేర్పడి యున్నయది

ఈగ్రంథము వేదాంతసారమయంబుగా నుండినను శ్రీకృష్ణచారిత్రము మొదలగు అనేకోపాఖ్యానేతిహాసములతోఁ గూడియుండుటవలన భగవంతుని సగుణ నిర్గుణముల తెఱంగెఱుంగవలయునను శ్రద్ధగలవారలు ఓపికతో విశేషకాలమును బుద్ధియును వినిమయింపక తాని సాధారణముగ గ్రహించుట దురవగాహంబై యుంటున్నయది. అటులఁ జేయఁ గాల దేశ వర్తమానముల ననుసరించి యనేకులకలవిగా నుండనేరదు.

ఇందువలన శ్రీభాగవత ద్వాదశ స్కంధంబులం దచ్చటచ్చట వెదఁజల్లఁబడి ఇహపరసౌఖ్యంబులకును మోక్షంబునకును సాధకంబులుగానుండు ముఖ్యాంశంబు లన్నియుఁ దేటపరచెడు తద్గ్రంథస్థపద్యములను జేర్చి ప్రచురపరచుట లోకులకు విశేషానుకూలముగా నుండునని నాబుద్ధికి గోచరించినది.

ఏతన్నిమిత్తమేను కూడినంత శ్రద్ధ పుచ్చుకొని భగవంతుఁడు సగుణుఁడనియు నిర్గుణుఁడనియు సగుణ ధ్యానానుష్ఠానములు సాత్విక రాజస తామసంబులనియెడు త్రివిధంబులై యున్నవనియు అందు రాజస తామస ధ్యానానుష్ఠానములు రాజస తామసాత్ములకును సాత్విక ధ్యానానుష్ఠానములు సత్వగుణ గరిష్ఠులకును కర్తవ్యమనియు జితేంద్రియులై త్రిగుణరహితులైనవారలు నిర్గుణధ్యానమున కర్హులనియు తామస ధ్యానానుష్ఠానములు వ్యర్థములనియు రాజస ధ్యానానుష్ఠానములు మానుష వైభవములకును సాత్విక ధ్యానానుష్ఠానములు జ్ఞానోదయంబునకును ఊర్ధ్వలోకవాసంబునకును నిర్గుణ ధ్యానానుష్ఠానములు మోక్షప్రాప్తికిని మూలంబులనియు లోకులకు ననాయాసంబుగ గ్రాహ్యమగు తెఱంగున సదరు పద్యంబులను పంచప్రకరణములుగా విభాగించి యం దొక్కొక భాగంబున నడంగఁదగిన పద్యములను వానిక్రిందఁ జేర్చి యాపద్యముల కన్నిటికి 1874 సంవత్సరము మేనెల 14 తేదిన భువనగిరి రంగయ్యశెట్టిగారి జ్ఞానసూర్యోదయమను ముద్రాక్షరశాలయందు చెన్నపురమున ముద్రింపఁబడియుండు శ్రీమదాంధ్రభాగవతమునం దుండఁగల పుటలను సయితము నిర్దేశించి యున్నాఁడ.

ఈ తెఱంగున నేర్పరుపఁబడియుండు శ్రీ భాగవతసార ముక్తావళియను నీగ్రంథము లోకులు సగుణ నిర్గుణ ధ్యానానుష్ఠాన మార్గమును తెలుసుకొని వివేకవంతులై జ్ఞానోదయమును జెంద ముఖ్యాధారంబుగ నుండునని నేను నమ్ముచున్నాఁడను.

# పీఠిక



రసికులారా !

భగవానుఁడగు వ్యాసమహర్షి భగవంతునిదివ్యావతారములను, భక్తుల జీవితమును అభివర్ణించి చేతనులఁ దరింపఁజేయుటకు శ్రీమద్భాగవతమును రచించెను. ఇందు భగవంతుని దివ్యావతారములు, మనువులచరిత్రములు, భక్తుల పవిత్రచర్యలు, భరతఖండమునంగల భక్తులగు రాజులచరిత్రములు చెప్పఁబడినవి. మొత్తముమీఁదఁ జూచిన నిందు శ్రీకృష్ణావతారకథకే యెక్కుడవకాశ మీయఁబడెను. ఈ పవిత్రగ్రంథమును సహజపాండిత్య బిరుదాభిరాముఁడగు బమ్మెర పోతరాజు మనోహరముగఁ దెనిఁగించి యాంధ్రసారస్వతమున కద్వితీయాలంకారముగఁ జేసెను.

పోతనకాలనిర్ణయము భాగవతపీఠికయం దీక్రిందివిధముగ వ్రాసియున్నారము. "ఉత్తరహరివంశ కవితాచ్ఛాయలు మూలమున లేని సత్యభామాసంగ్రామము భాగవతమందుంటచే నాచనసోమనాథుని కాలమగు క్రీ. శ ౧౩౭౦ కీవల పోతరాజు ఉండియుండును. పోతరాజు ననుకరించియు విభ్రష్టమగు భాగవత దశమస్కంధమును బూర్తి చేసియుఁ బేరొందిన క్రీ. శ. ౧౪౨౦ లో నున్న మడికిసింగనకుఁ బోతరాజు పూర్వుఁడు. ఈయిరువురుకవులకు మధ్యకాల మగు క్రీ. శ. ౧౪౦౦ ప్రాంతమున పోతరాజు ప్రౌఢవయస్సునం దుండియుండును. ఈనిర్ణయముచేతఁ బొన్నుపల్లి శాసనముప్రకారము క్రీ. శ. ౧౪౦౭ సం. ప్రాంతమందే వేమభూపాలునివద్ద ఆస్థానకవిగానున్న శ్రీనాథునకు భేతాళనాయకున కేడవపురుషుఁడును అనపోతనాయకుని కుమారుఁడునగు సర్వజ్ఞసింగమనాయకునకు సమకాలికుఁడగుటయు సమన్వయమగుచున్నది. పోతరాజు ఈనిర్ణయముచే ౧౩౭౦ ప్రాంతమున జనించి ౧౪౨౦ ప్రాంతమున కీర్తిశేషుఁడై యుండుననుట విశ్వసనీయము."
పోతరాజు రచించినగ్రంథములు ఆంధ్రభాగవతము, భోగినీదండకము, వీరభద్రవిజయము, నారాయణశతకము. చివర మూఁడుపొత్తములీయన వ్రాసినవికావని కొందఱు, శతకముమాత్రము ఈయన వ్రాసినది

కాదని కొందఱు చెప్పుచున్నారు. కవినివాసము కడపజిల్లా ఒంటిమిట్ట యను ప్రవాదము గలదుగాని నూతన పరిశోధనమువలన నిజాము రాష్ట్రమునందలి ఓరుగల్లునకే యేకశిలానగరపదము రూఢ మగుట చేతను ఇతరకారణములవలనను ఓరుగల్లుప్రాంతమె నివాసమని చరిత్రకారులు నిశ్చయించిరి.

పోతన రచించిన భాగవతమునుండి యమూల్యపద్యరత్నములను సేకరించి శ్రీ కట్టమంచి సుబ్రహ్మణ్యారెడ్డిగారీభాగవతసారముక్తావళిని సమకూర్చిరి. సుబ్రహ్మణ్యారెడ్డిగారు తొలుత భారతసారరత్నావళి వ్రాసి, పిమ్మట నీపొత్తమును వ్రాసిరి. ఈసంగ్రంథనమున శ్రీ ష్ఠులూరు కుప్పనయ్యంగార్లు పరిష్కర్తలుగానుంటచే సంగ్రంథనమునకు మంచి వన్నె వచ్చినది. శ్రీ కుప్పనయ్యంగారి ప్రతిభాపాండిత్యాదికములు తదగ్రిచిత సర్వలక్షణసారసంగ్రహమువలనను దానికి వ్రాసిన శ్రీ శ్రీ శ్రీ క. రామలింగారెడ్డిగారి పీఠికవలనను దెలిసికొనవచ్చును.

భాగవతమునుండి యుత్తమపద్యముల నేరి శ్రీ సుబ్రహ్మణ్యారెడ్డిగారు ఐదుగా విభజించి యొక్కొక్క విభాగమునకు వరుసగా జగదుత్పత్తిప్రకరణము, సంసార ప్రకరణము, సగుణ ప్రకరణము, నిర్గుణ ప్రకరణము, స్తుతిప్రకరణము అని నామకరణ మొనరించి తదనుకూలముగా నంతర్విభజనము గావించియున్నారు. భాగవతమునందుఁగల భక్తి జ్ఞాన వైరాగ్యాదులకు సంబంధించిన మేలుపద్యములన్నియు నీపొత్తమునం దిమిడియుంటచే భాగవతమువలె నీచిన్నిపొత్తము పఠనీయ మనుటకు సంశయముండదు. విపులమగు భాగవతము పఠించి యందలి యుత్తమవిషయికపద్యము లేరి సేకరించునంతటివిశ్రాంతి యందఱకు నుంట యరిదిగాన భాగవతధర్మము లెఱుంగుట కీచిన్నిపొత్తము సిద్ధాంజనమువంటిది. ఇట్టి సంగ్రథితగ్రంథములు వాఙ్మయమున కవసరమై యున్నవి. పూర్వకవులు కొందఱిట్టిపొత్తముల సమకూర్చియున్నారు. అందుఁ బ్రబంధమణిభూషణము, సకలనీతిసమ్మతము, ప్రబంధరత్నావళి, కృష్ణలీలావిలాసము, రత్నాకరము లోనగు స్వల్పసంఖ్యగ్రంథములు మాత్ర మిపుడు లభించుచున్నవి. భవిష్యజ్జనోపయోగముగ నీ సంగ్రథితగ్రంథమును ప్రచురించిన శ్రీ కట్టమంచి సుబ్రహ్మణ్యారెడ్డిగారి కృషి ప్రశంసాపాత్రమైనది. ఆంధ్రదేశమునందు ఆంధ్రభాగ

వతమునై నెంతయో సమాదరభావముగలదు. వామనచరిత్రము, దశమస్కంధము, సప్తమస్కంధము, గజేంద్రమోక్షము, రుక్మిణీకల్యాణము లోనగు భాగములు ప్రజాప్రీతిని జూరఁగొని ఆంధ్రమహాజనుల రసనాంచలములఁ జిరవాస మొనర్చుచున్నవి. ఇంక నందం దెన్నియో యమూల్య భావములుగల పద్యములు గలవు. అన్నిటిని సమకూర్చి యవ్యవస్థతోఁ గాలము గడుపు భాషాభిమానులకొఱ కీగ్రంథము సమకూర్చిన గ్రంథకర్తగారి యుద్యమము శ్లాఘాపాత్ర మనుటకు సంశయములేదు.

ఈసంగ్రథిత గ్రంథరచయితయగు సుబ్రహ్మణ్యారెడ్డిగారు సారస్వతమున మంచి యభినివేశముగలవారై మిగులఁ బ్రసిద్ధి వహించిరి. వీరి కాంధ్ర సంస్కృత భాషలయందుఁగల యభినివేశాభిమానములు సాటుటకుఁ దద్రచితములగు నీసంగ్రథితగ్రంథములు రెండే సాక్ష్యము కాఁగలవు. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు ఆంధ్రసారస్వతమున సుప్రసిద్ధగ్రంథకర్తలు, సద్విమర్శకులు నగుటకు జనకులగు శ్రీ సుబ్రహ్మణ్యారెడ్డిగారి మాతృభాషాభిమానమే ప్రధానహేతువనియు, సుబ్రహ్మణ్యారెడ్డిగారి సంగ్రంథితగ్రంథములు రెండును సర్వజనసమాదరణీయములనియు విశ్వసించుచున్నారము.

1874 సం॥ లో భువనగిరి రంగయ్యసెట్టిగారి జ్ఞానసూర్యోదయముద్రాక్షరశాలయందు ముద్రితమైన భాగవతప్రతి ననుసరించి యిందలి పద్యము లుద్ధృతమయ్యెను. ఆకాలపుఁబ్రతులు చాలఁ బెద్దవిగ నుండి వరుససంఖ్య లేకుండుటచేఁ బద్యప్రదేశము తెలియుట కీసంగ్రథితగ్రంథమునఁ బుటసంఖ్యమాత్రమె యొసంగఁబడి 1888 సం॥ ఈ పొత్తము ముద్రింపఁబడెను. తదాది యుపయుక్తమగు నీగ్రంథరత్నమునకు ద్వితీయముద్రణావకాశము తటస్థింపలేదు. ఇప్పటి ముద్రితప్రతులలో నన్నివిధములఁ బ్రశస్తతరములుగానున్న వావిళ్ళవారియు ఆనందముద్రణాలయమువారియు భాగవతప్రతుల ననుసరించి యిందలి పద్యము లన్నిటిని సంస్కరించి ముఖ్యలోపములను సంస్కరించి పాఠాంతరముల నొసంగియున్నారము. దశమస్కంధములోని పద్యములకు భాగవిభాగము లేకుంటచే సంఖ్యతోఁబాటు భాగవిభాగము

గూడ సూచించితిమి. ఆనందముద్రణాలయము వారి ప్రతినే యీ గ్రంథసంస్కరణమునకుఁ బద్యసంఖ్యానిర్ణయమునకు సాధారణముగాఁ దీసికొంటిమి. సందిగ్ధములగు తావులలో నొకటిరెండుచోటుల వావిళ్ళ వారి ప్రతినిగూడఁ గైకొంటిమి. భారతభాగవతములు సుప్రసిద్ధ సంస్కరణముచే మనోజ్ఞముగా ముద్రితములై యుంటచే నీపొత్తము సులభముగాఁ ద్వరలో సంస్కరింప నవకాశముచిక్కెనుగానఁ బ్రకాశకులకుఁ గృతజ్ఞతచెప్పుటయు మావిధి.

ఆంధ్రవిశ్వవిద్యాలయ సహాయ ధర్మాధికారులు, ఆంధ్రభాషాభిమానులు,విద్వాంసులు నగు శ్రీ|శ్రీ|శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు చిరకాలమునాటి ప్రతులగు భారతసారరత్నావళి, భాగవతసారముక్తావళి మాకుఁబంపి సంఖ్యానిర్ణయము శుద్ధపాఠనిర్ణయము గావించుటకుఁ బాఠాంతరములు సూచించుటకు దయాభావముతో నాజ్ఞాపించిరి. ఈయుత్తమగ్రంథములకు సేవజేయుట మాతృభాషాసేవ గావించుటయెగాన స్వల్పవిశ్రాంతిలో నిప్పటి కీ రెండు గ్రంథములు సంస్కరించి ప్రచురణమున కొసంగఁ గలిగితిమి.

ఆంధ్రజనసమాదరణమున కీరెండుపొత్తములు పాత్రములై విజ్ఞానదాయకములై వెలయఁగలవనుట కెట్టిసంశయములేదు. ఈకృతి సంస్కరించుటకుఁ బీఠికవ్రాయుటకు మాకవకాశముగలిగించి మాసేవ శాశ్వతస్థాయి గావించిన శ్రీరామలింగారెడ్డిగారియెడఁ గృతజ్ఞులము.

నందిగామ,
26—9—26.

ఇట్లు భాషాసేవకులు,
శేషాద్రి రమణకవులు,
శతావధానులు.

# విషయసూచిక


పుట

కట్టమంచి సుబ్రహ్మణ్యరెడ్డియొక్క సంక్షేపచరిత్రము ... i-xxiii

౧. జగదుత్పత్తి ప్రకరణము :

౧. మాయ ... 5

౨. కాలము ... 15

౩. కర్మము ... 18

౨. సంసార ప్రకరణము :

౧. సాంసారిక ధర్మాధర్మములు ... 27

౨. సంసార విముక్తమార్గము ... 39

౩. సగుణ ప్రకరణము :

౧. సగుణతత్త్వము ... 53

౪. నిర్గుణ ప్రకరణము :

౧. జ్ఞానబోధ ... 77

౨. విరక్తి ... 94

౩. భక్తి ... 102

౪. నిర్గుణతత్త్వము ... 120

౫. స్తుతి ప్రకరణము :

౧. నారాయణస్తుతి ... 153

౨. శివస్తుతి ... 171

౩. విష్ణుస్తుతి ... 175

## ఈ గ్రంథమునందుఁ బ్రయోగింపఁబడియుండు సంగ్రహనామములు.



ప్ర. ప్రథమస్కంధము
ద్వి. ద్వితీయస్కంధము
తృ. తృతీయస్కంధము
చ. చతుర్థస్కంధము
పం. పంచమస్కంధము
ష. షష్ఠస్కంధము
స. సప్తమస్కంధము
అ. అష్టమస్కంధము
న. నవమస్కంధము
ద. దశమస్కంధము
ఏ. ఏకాదశస్కంధము
ద్వా. ద్వాదశస్కంధము

ప్ర. 1 అనగా ప్రథమస్కంధము పద్యము 1 అని గ్రహింపవలెను.

క. కందపద్యము
తే. గీ. తేటగీత
ఆ. వె. ఆటవెలది
సీ. సీసపద్యము
వ. వచనము
చ. చమ్పకమాల
ఉ. ఉత్పలమాల
శా. శార్దూలము
మ. మత్తేభము
మత్త. మత్తకోకిల
శ్లో. శ్లోకము.



కట్టమంచి సుబ్రహ్మణ్యారెడ్డియొక్క సంక్షేప

# చరిత్రము

ఈ భాగవతసారముక్తావళిని సంపుటీకరించినయతఁడు నాతండ్రియైన కట్టమంచి సుబ్రహ్మణ్యారెడ్డి. వీరు చనిపోయి యిప్పటికి 32 సంవత్సరములైనప్పటికిని వీరిపేరు ఇంకను మాజిల్లాలోను ఇతరస్థలములయందును పచ్చగానే యున్నది. 1923 వ సంవత్సరములో జరిగిన జనరల్ ఎలెక్షనునందు మద్రాసు శాసన సభికత్వమునకు అర్థులుగా నిలిచి పోటీసల్పినవారిలో నేనును ఒకఁడను. ఆవిషయమున గ్రామ గ్రామ సంచారము చేయవలసినవాఁడనైతిని. ఎక్కడకు వెళ్ళినను "కట్టమంచి సుబ్బారెడ్డికొడుకు వచ్చినాఁడు. అతనికి మనము వోట్లియ్య వలసియున్న"దని చెప్పి మాతండ్రిగారిపుత్రుఁడ నను సన్మానమే కాని, నాకు వేఱు నాపరమైన సన్మానము తఱుచు లభించినదికాదు. ఒకానొకప్పుడు కాళహస్తినుండి నామిత్రుఁడు కోటిగారి రంగయ్యసెట్టియు నేనును మోటారుబండిలో తిరుపతికి వచ్చుచుండఁగా, మార్గమధ్యమున మేళాలు తాళాలు వాయిద్యములతో కృష్ణాపాళ్యం జమీందారుగారు వేచియుండిరి. వారికి నాకు పరిచయము లేదు. ఉత్తర ప్రత్యుత్తరములును లేవు. పిమ్మట విచారింపఁగా ఈ సన్మానమునకు హేతువు పూర్వము మాతండ్రిగారు ఆజమీందారుగారికి కొనర్చిన మహోపకారమని తెలిసినది. వీరివలె బ్రిటిష్ ప్రభుత్వము వెనుక చిత్తూరుజిల్లాలో విమలమైనయశస్సు నార్జించినవారు ఇంకెవ్వరును లేరు.

మాయింటిలో ఆంధ్రభాషాభిమానముసు, కొంతవఱకుఁ బ్రౌఢతయు పారంపర్యముగ వచ్చుచున్నవి. ఈ సందర్భమునఁ దొలుతఁ బేర్కొనఁదగినవాఁడు భాస్కరశతకాది కృతికర్తయగు పెద్దరామ లింగారెడ్డి. వారికృతుల నిప్పుడే ముద్రింపించి ప్రచురించుచున్నాఁడను. అవి కవిత్వధోరణిగాఁగాని లాక్షణికసాంప్రదాయముగాఁగాని పరిశీలించినయెడల మిక్కిలి ప్రశస్తములు గావు. అయినను కుగ్రామమయిన కట్టమంచిలో నూఱేండ్లప్పుడు ఇట్టి చిల్లరకవియు గొప్పకాళిదాసుగాఁ బరిగణింపఁబడెనేమో. వీరివంశావళి నిటఁ బ్రదర్శించిన బాగు.

**కట్టమంచి కొళందరెడ్డి = చిన్నమ్మ.**

పెద్దరామలింగారెడ్డి = చెంగమ్మ
1780–1850 వ సంవత్సరమువఱకు
(సుమారు)

చిన్నరామలింగారెడ్డి
వీరికి 6 గురు కొడుకులు పుట్టినను వీరివంశము ఇంచుమించు నిశ్శేషమయినది. ఒక్క స్త్రీమాత్రము నిలిచియున్నది.

(పెద్దరామలింగారెడ్డి సంతానము:)

వీరరాఘవరెడ్డి = జ్ఞానమ్మ

కొళందరెడ్డి, మొదలగు ఆరుమందిపుత్రులు
మనుమడు, రావుసాహెబు కొళందరెడ్డి

(వీరరాఘవరెడ్డి సంతానము:)

సుబ్రహ్మణ్యారెడ్డి = నారాయణమ్మ
1846–1896 Died 1907

రామస్వామిరెడ్డి = పాపమ్మ
Died 1892 = బంగారమ్మ
రామలింగారెడ్డి (దత్తపుత్రుడు)

రంగారెడ్డి = లక్ష్మమ్మ
వీరరాఘవరెడ్డి = చిన్నమ్మ

(సుబ్రహ్మణ్యారెడ్డి సంతానము:)

నరసింహారెడ్డి = అక్కలమ్మ
1870–1910
సుబ్బారెడ్డి ప్రభృతులు ముగ్గురు కొడుకులు
సంజంతమ్మ యను ఒక్క కూతురు

రామలింగారెడ్డి
(రామస్వామిరెడ్డికి దత్తుడు)

కృష్ణారెడ్డి M. B. C. M.
=తిరుమలమ్మ

వీరరాఘవరెడ్డి = లక్ష్మమ్మ

భాస్కరరెడ్డి = నాగరత్నమ్మ

పెద్దరామలింగారెడ్డి ఒక్క కవిమాత్రము కాదు. సంస్కృతము, జ్యోతిషము, మంత్రశాస్త్రము, షట్ప్రయోగములు మొదలైనవానిని అంగొండ కృష్ణమాచార్యుల యొద్ద నేర్చికొనినవారు. మా ముత్తాతయయిన ఆరామలింగారెడ్డి శిష్యుడు కుప్పనయ్యంగారు. వీరు చిత్తూరు హైస్కూలులో తెలుగుపండితులుగా నుండి అఖండమైన పేరును సంపాదించిరి. వారిశిష్యమండలికిఁ జేరినవారిలో నొక్కఁడను నేను. *

మా తాత వీరరాఘవరెడ్డికాలమునకు మాయిల్లు కడుబీదస్థితికి వచ్చినది. ఇది హిందూసహకుటుంబ దాయభాగాచారప్రకారము. కోళంద రెడ్డికి ఇరువురు కొడుకులు - పెద్దరామలింగారెడ్డి, చిన్నరామలింగారెడ్డి. వీరికి ఒక్కొక్కరికి ఆరుగురు పుత్రులు. కోళందరెడ్డియొక్క ఆస్తి పండ్రెండుభాగములు కావలసివచ్చెను. ప్రతిజ్ఞాతికి లభించినది కొంచెము నేలయు నెక్కువ యహంభావమును! చిన్నరామలింగారెడ్డి యొక్కవంశము నేటికి ఇంచుమించుగ నిరవశేషము. పెద్దరామలింగా రెడ్డి సంతతిలో నాలుఁగు శాఖలు నిలిచియున్నవి.

బీదతనము కారణముగ వీరరాఘవరెడ్డి గుమాస్తాపనిలో దిగుటయకాక నాతండ్రులకు విద్యకూడ నేర్పింపఁ జొచ్చెను. అందులో మేధాశాలియైన సుబ్బారెడ్డి ఇంగ్లీషు విద్య సయితము నేర్చుకొనవారంభింపఁగా, ఇంతసాహసమా వీనికి, ఇంతగర్వమా, మించిపోవుటకు ప్రయత్నించుచున్నాఁడా? యని పాలివారు ప్రతికూలించి తండ్రికి కొడుకునకు నానావిధములైన కష్టములను బెట్టిరఁట. సహకుటుంబముల యొక్క అనివార్యమైన విలక్షణము ఈర్ష్య. తండ్రి ఉద్యోగి; కొడుకు చదువరి· ఈదోషములకుఁ జేయవలసిన పరిహారము లన్నియుఁ బ్రయత్నించి చూచిరి. కాని సుబ్బయ్యయొక్క పట్టుదల చలితమైనది కాదు. ఉదయమున చల్దిఁ దిని పుస్తకము లెత్తుకొని ఒక్కమైలు దూరములో నుండు చిత్తూరునకువెళ్ళి వారిని వీరిని ఆశ్రయించి ఇంగ్లీషు, తెనుఁగు అవకాశము కొలఁది అభ్యసించెను. నాతండ్రికి నాకువలె క్రమమైన శిక్ష లభింపలేదు. పాపము! ఒక్కనా డిక్కడ ఇంకొకనా డక్కడఁగా

---

* కుప్పనయ్యంగారి సర్వలక్షణసారసంగ్రహము యొక్క పీఠికను జూడనగు.

ముక్కలు ముక్కలుగా గ్రహింపవలసిన విధి వారిది. అయినను స్వయంకృషి ప్రధానమయిన విద్యగావున అది చక్కఁగానాటి ప్రతిదిన ప్రవర్థమానమై నిత్యవసంతోత్సవముగ నెగడినది. వీరు ఇంగ్లీషులో ప్యాసుచేసినది ప్రొఫిషెన్సీ టెస్టు. ఈ టెస్టు నేను పుట్టక పూర్వమే యెత్తివేయఁబడినది కాఁబోలు. వారు చదివిన ఇంగ్లీషువ్యాకరణము మరేగ్రిగారి కృతి. నాకాలమునాటికి అది మృగ్యము. నేను 5 వ ఫారములోఁ జదువుచున్నపుడు "రామలింగం! ఏవ్యాకరణము పనికిరాదు నీకు. Murray's Grammar చదువు. అదిచాలా మంచి పుస్తకము." అని కృతయుగబోధ చేసిరిగాని చెన్నపురి నంతయు గాలించి చూచినను ఆ యాదిమవ్యాకరణము దొరకలేదు. చిత్తూరు హైస్కూలు హెడ్‌మాస్టరుల కందటికిని మిన్న యనఁదగు తిరువేంగడసామి నాయఁడుగారియెడ మాతండ్రికి భక్తి యెక్కువ. భయము అంతకన్న రెండింతలు. ఆ నాయఁడుగారు సర్వంకషప్రతిభులు; ఇంగ్లీషునందు సంపూర్ణపాండిత్యము; గణిత శాస్త్రములో నసమానప్రజ్ఞ; తెనుఁగు, సంస్కృతము, సంగీతము, వీణ, బెత్తముపెట్టు ఏదైననుసరే, వారుపెట్టిన దేబిచ్చము, వారిదెబ్బే దెబ్బ! "చిత్తూరుపులి" (Tiger of Chittoor) అను భీకరమైన పేరు వహించినవారు. కాలేజి లెక్చరరుపనిని పుచ్చుకొమ్మన్నప్పటికిని చిత్తూరును విడనాడనని నిగ్రహించిరి. భూస్వాములు. వారియొద్ద చదువునేర్చుకొనుటకు విక్రమార్కుని సాహస ముండవలయును. సాహసము శ్రద్ధయు నుండినయెడల 6 నెలలలో 6 ఏండ్ల విద్యాభివృద్ధి సిద్ధము ఇట్లు ఖండవృష్టిగ విద్యాకృషిసల్పినవారయ్యును నాతండ్రి ఆంధ్రాంగ్లేయములయందు గొప్ప పాండిత్యమును బడయఁజాలిరి.

"పరమక్లేశమునఁ జేసి పడసిన విద్యల్ । స్ఫురియించుఁగాక..."

వీరి యింగ్లీషు లాలైబ్రరీ (Law Library) యంత భండారమును చిత్తూరు B. A. B. L. లు ఎవ్వరు సేకరించలేదు. తెనుఁగున వీరు చేసిన కృతులే వీరి రసికత్వమునకును వివేచనకును సాక్ష్యములు.

తొలుత మాతండ్రిగారు పితాచారమునుబట్టి గుమాస్తా పనిలో దిగిరి. కొన్నియేండ్లకు జిల్లాకోర్టులో రికార్డుకీపరైరి. త్వరలో ఆపనికి రాజీనామా యిచ్చి కార్వేటి నగరసంస్థానములో మేనేజరుగాఁ జేరిరి.

అక్కడిరాజుల విపరీతరాజసము తనకు సరిపడనందున దానిని వదలి ఫస్టుగ్రేడు ప్లీడరు సన్నదును సంపాదించుకొని వక్కీలువృత్తి నాశ్రయించి దానికిని తనకును అసాధారణమైన కీర్తిని దెచ్చిరి.

తాను కోర్టులో గుమాస్తాగా నున్నపుడు జడ్జీలుగా నుండిన కాలేటుగారును, రాబర్టుగారును తనయెడ చాల అభిమానము వహించి అన్నివిధముల పోషకత్వమును జూపిరి. చాల క్లిష్టములైన వ్యవహారములలో రహస్యముగఁ బిలిచి తన యభిప్రాయములను అడిగెడివారు. వారి యందలి కృతజ్ఞతను చూపుటకై తాను నూతనముగ సృష్టికిఁ దెచ్చిన రెండు మామిడిరకములకు కాలేటుపసందు, రాబర్టు పసందు అని నామకరణముల నిడిరి. ఈ జాతులు మాతోఁటలలో నున్నవి.

సుబ్రహ్మణ్యరెడ్డిగారి వక్కీలువృత్తి అనన్యసదృశము. ఆదినొక క్రిమినల్ కేసులోని తన కక్షిదారునికి ఉరిశిక్ష ప్రాప్తమైనది. ఆనాడు మొదలు క్రిమినల్ కేసులను గైకొనుటను విడిచిపెట్టిరి. నాతో నొక్కనాఁడీవిషయమై మాటలాడుచు "నాక్లయంటునకు మరణదండన యను మాట విన్నదే నాకంఠమునకే ఉరిత్రాడు బిగింపబడినట్లు స్తబ్ధుడనైతిని. నాడు మొదలు మనఃక్లేశము నేమాత్రమైన కలిగింపఁజాలు కేసులను స్పృశింపనని వ్రతముఁ దాల్చితిని." అని నుడివిరి. ఇది నిజముగా భీష్మవ్రతము. వీరి సత్యసంధతయొక్క ప్రభావ మెట్టిదనగా తాను ఏపక్కను వక్కీలుగా నుండిన నదియే సత్యమయిన పక్షమని జడ్జీలు భావించువారు సత్య మేదికొ్క ఆదికే్క సుబ్బారెడ్డి, కావఁబట్టి వారి పక్షమునకు అనుకూలించునట్లు తీర్పు. ఈ భావధోరణి చిత్తూరుజిల్లా జడ్జీల నావేశించియున్నందున, ఒకానొకమహాంతుపై గొప్ప క్రిమినల్ చార్జి తేఁబడినప్పుడు, నేను మాతండ్రిగారి ఆఫీసుగదిలో నుండఁగా ఆ మహాంతుగారే వచ్చి నాతండ్రిని ఆశ్రయించి "మీరు మాపరము వక్కీలుగా నుండేటట్లు పేరును అర్పణచేసినఁజాలును. మీరు కోర్టునకు రాఁబనిలేదు, వాదింపనక్కరలేదు. నాపక్షపువక్కీలు అను మాట మాత్రముండినజాలును. ఇదిగో మూఁడువేల రూపాయలఫీజు, చాలదంటే ఇంకా యిచ్చుటకు సంసిద్ధుఁడను, కోరినంత యిచ్చెదను" అని చిన్నిబాలుఁడనుగానున్న నాకుసయితము దుఃఖమువచ్చునట్లు దీనతతో

ప్రార్థించినను సుబ్రహ్మణ్యారెడ్డి వ్రతభంగమున కోర్వనని అంగీకరింప లేదు. వీరికి ధనాశ మొదలగు యేదురాశలు పట్టినవికావు.

అయినను మాతండ్రియొక్క కక్షిదారులలో నొకఁడును, స్నేహితులలో ముఖ్యుఁడును అయిన నెమ్మిలి వీరాసామిరెడ్డిగారి యొక్క మనుమఁడు కుప్పుసామిరెడ్డి, ఆ వీరాసామిరెడ్డిగారు తొందర పెట్టుటచే, ఒకానొక పెద్దమనుష్యుని, అన్యాయముగా ఆరోపింపఁ బడిన క్రిమినల్ దావానుండి రక్షించుటకునై, మానాయన సబ్ మేజ స్ట్రేటు కోర్టునకు ఒక్కపర్యాయము పోయిరనియు, వీరిని చూచుట తోడనే మేజస్ట్రేటు ఆశ్చర్యపడి, అరగంటలో విడుదలతీర్పు చెప్పినా రనియు, తనతాత తనతోఁ జెప్పినట్లు అనేకవివరములతో నాతో రెం డేండ్లక్రిందటఁ జెప్పెను. వ్రతధారణానంతరము ఈ యొక్కభంగమేనఁట. ఫీజు పుచ్చుకొనక స్నేహితకైంకర్యముగా ఈ కార్యమునకు నిర్బంధము మై పూనిరఁట.

సివిల్ కేసుల విషయములో మాతండ్రిగారి సమయస్ఫూర్తులు రెండు: ఒక్కటి, చిల్లర కేసుల గ్రహించుట లేదు; మునిసీఫుల కోర్టు లలోఁ గాలుపెట్టి యెఱుఁగడు. రెండవది, గొప్ప కేసులైనను, క్లిష్టము లుగా సందిగ్ధములుగా నుండఁగూడదు; విస్పష్టమైనసత్యములుగా నుండ వలయును. కాఁబట్టి మాతండ్రిగారు స్వీకరించెడు కేసులసంఖ్య ఎప్పు డును స్వల్పమే. ఆర్జనలో అందఱికన్న నెక్కువ. నెలకు రెండువారముల కన్న నెక్కువగా కోర్టునకుఁ బోరు. ఇట్లు మిగిలింపఁబడినకాలమంతయు గ్రంథపఠనమందును, మామిడితోఁటలకృషియందును వినియోగించిరి.

తన సమయములకు విరుద్ధములైన కేసులు వచ్చినయెడల చిత్తూ రులో నుండు గోపాలాచార్యులు, అరుణాచల మొదలి, శ్రీనివాసా చార్యులు మొదలగు వకీళ్ళయొద్దకు పొమ్మని కక్షిదారుల పంపి వేయుచుండిరి.

తనవలెనే వకీలువృత్తిలో ప్రథమగణ్యుఁడుగా నుండిన వాఁడు నరసింగరావు. కక్షికొకరైన ప్రతికక్షికొకరుగా నిలిచి వాదము జేయుచుందురు. తన పార్టీలనందరిని కట్టమంచికిఁ బోయి రాజీచేసి కొనుఁడని నరసింగరావు విపరీతభాషలతో తలకెక్కునట్లు బోధచేయుట

చేతను, సుబ్రహ్మణ్య రెడ్డిగారి సద్ధర్మప్రవర్తనము లోకప్రసిద్ధిగ నుండుటచేతను, నాతండ్రిగారు పట్టిన కేసులలో నూటికి తొంబది వంతు వారిచేతనే రాజీకాఁబడి ఉపసంహృతము లౌను.

జిల్లాలో గొప్పగొప్ప ఆస్తుల విభాగములకు కోర్టువారు కక్షిదార్లు కలిసి నాతండ్రిగారినే పంచాయితీదారు(Arbitrator) గా కోరుకొనుచుండిరి. వీరిమరణపర్యంతము ఇంక నెవ్వరికి ఈ గౌరవము లభించినదికాదు. తాను చావుపడకలో నున్నప్పుడు సైతము, పాళైగారు చెంగమనాయఁడుగారి 5 లక్షల ఆస్తిని కొడుకులకు నిర్వివాదమగు రీతిని పంచిపెట్టుటయగాక వారిసమ్మతిమై మిడిల్ స్కూలు నొక్కదానిని నగరిలో స్థాపించి తగినమాన్యముల నేర్పఱచిరి.

తనకక్షిదార్లపట్ల తాను చూపువర్తనమును అనన్యసదృశము. పైనఁ జూపఁబడిన విశేషములనుబట్టి వీరియొద్దికి వచ్చువారు చాల మంచివారుగా నుండువారేగాని అల్పులు గారనుట స్పష్టము. మా యింటిలో భోజనముచేయఁగలవా రెల్లరు మాయతిథులుగానే యెన్నాళ్లైనను సరే, యెన్నిపర్యాయములైనను సరే ఉండవలయును. కాళహస్తి, కార్వేటినగరము రాజులు, లార్డ్ కృష్ణదాసుగారు, బ్రాహ్మణులు మొదలగువారికి ఊరిసత్రములో అన్నిసౌకర్యముల నడిపి సిబ్బందితో అతిథులుగా సన్మానింతురు. ఇది చాల పెద్ద ధర్మశాల. ఇప్పుడీసత్రము వాడువారు లేక శిథిలమైపోయినది.

రెండవది క్రమమైన ఫీజును మాత్రము గ్రహించుట. చిత్తూరులో పూర్వముఅగ్రగణ్యులుగా నుండినవారు కోటావారు; వైశ్యులు. వారింటివారు మాతండ్రియొక్క ధర్మగుణములఁగూర్చి నాతో ప్రసంగించెడివారు. ఒకానొకప్పుడు నాతండ్రిగారు కష్టపడి వారికి 15,000 రూపాయలు చెల్లునట్లు చేసిరి. వారు సంతోషపడి అధికమగు ఫీజు ఈయరాఁగా, "శ్రమ వేతనమునకన్న నెక్కువగాఁగై కొన్నచో అది భిక్షముతో సమానము. నిజమైనవక్కీలు బిచ్చగాడు కాడు. ఆర్జితమునకన్న నెక్కువ పుచ్చుకొనను." అని నిరాకరించిరి.

మూఁడవది బలాఢ్యులచేత హింసింపఁబడు బీదలకు ఉచితముగా సహాయముచేయుట. ఈ తరగతికి చేరినవాఁడే పూర్వము

పేర్కొనఁబడిన కృష్ణాపాళ్యం జమీందారు. పాలివారు అన్యాయము చేసి ఇల్లు వెడలఁగొట్టఁగా అయిదేండ్లు అన్నికర్చులు భరించి కేసు జయించి వారిభాగము వారి కిప్పించుటయగాక ఫీజు పుచ్చుకొనలేదు. 1923 వ సంవత్సరపు ఎలెక్షనులో నన్నుఁ జూచునప్పటికి ఆజమీందారు చాల వయస్సు చెల్లిన ముసలాయన. అట్లుండియు ఊరేగింపుగా నన్నును కోటిగారి రంగయ్యసెట్టిని ఇంటికి పిలుచుకొనిపోయి, తానే స్వహస్తములతో వడ్డించి, "మీతండ్రిపెట్టిన భిక్ష నాయనా! నీకుండెడు సొంతము ఈయింట్లో నాకు లే" దని చెప్పి, "నీకెవరైనా వోట్లియ్యకుంటే తల పగులకొట్టిస్తాను, భయపడవద్దులే, సుబ్బారెడ్డికొడుకునకు లేని వోట్లు ఇంకెవ్వరికి" అని పరమానందభరితునిఁ జేసి నన్ను సాఁగనంపిరి.

ఇంక కక్షిదార్లుగ వచ్చినవారెల్ల స్నేహితులుగ నిలిచిరని వేఱుగఁ జెప్పవలయునా? మాతండ్రికి లభించినంత స్నేహిత సంపత్తు ఎవ్వరికి నుండదు.

లాడ్ కృష్ణదాసు, ఆనరెబిల్ పాలవాయి రంగయ్యనాయఁడు మున్నగు ఘనులను పేర్కొనఁ బూనిన ఆత్మ ప్రశంసగ నుండునేమో! ఆత్మప్రశంస ఆత్మహత్య తుల్యము. కావున సామాన్యులను కొందఱిని నిదర్శన ప్రాయముగ పేర్కొనెదను. (1) అరికెలపూడి మునిసామిరెడ్డి. వీరి అభ్యంజనస్నానము పిల్లవాండ్ర మయిన మాకు ఆశ్చర్యము కలిగించునది. వ్రేలుపెట్టిన ఖతుక్కని తునుగఁ జేయునంతటి వేఁడినూనెను ఉద్ధరణితో నెత్తి తలమీఁదఁ బోసికొనుచు ఒక్కగంట సేపు తలను దేహమును పట్టించుకొనుచుండెడివారు. స్నానమైన తోడనే రెండుగంటల నిద్ర. (2) నెమ్మిలి వీరాసామిరెడ్డి. వీ రింకను సజీవులై యున్నారు. చాల మంచివారు. వీరికి భాస్కరుని నన్నును చూడవలయునను భ్రమ పెద్దది. మనుమఁడైన కుప్పుసామిరెడ్డిద్వారా పదింబదిగ తండ్రివలె మమ్ము విచారించుచున్నారు. (3) కోటిగారి మునిసామిసెట్టిగారు. కాపురస్థలము తిరుపతి. మొట్టమొదట కక్షిదారుగా వీరు మాగృహప్రవేశము చేయుట నే నెఱుంగుదును. కొంత కాలమునకు నా తల్లిదండ్రుల మిత్రమండలిలో ప్రథములైరి. మా యక్కయొక్కయు, అన్నయొక్కయు వివాహములు విచారణకర్తలుగ

దగ్గఱనుండి నడిపిరి. నన్ను అప్పుడప్పుడు తిరుపతికిఁ బిలుచుకొని పోవుచుండెడివారు. స్నేహ మిట్లు బంధుత్వమునకన్న నెక్కుడుగ ముదిరియున్నను మాతండ్రియందలి భక్తి లేతకాలేదు. వీరు పేకాట యందు చాల ప్రియులు. మాతండ్రిచే నది అష్టమవ్యసనముగ నిరసింపఁ బడుచున్నందున వారికి తెలియకయ ఆయాట నాడెడివారు (4) చిత్తూరు కాకర్ల రామయ్యసెట్టి. ఈయన మాతల్లిగారికి మంత్రియట్లు పని యున్నను లేకున్నను ప్రతిదినము మాయింటికి వచ్చి గృహవిచారణచేసి కావలసిన సరకులఁ దీసి పంపెడువారు. వీరును కోటిగారి రంగయ్యసెట్టియు ఇంటిపెత్తనగాండ్రు. నాతండ్రి సాంసారికచింతల పెట్టుకొనరుగావున, ఇట్టిమిత్రుల సాహాయ్యముతో తల్లిగారే గృహభారము నిర్వహించుచు వచ్చిరి. (5) వీరందఱికిని స్నేహభావమున మిన్నయైన వారు మణియం సుబ్బయ్య యను బ్రాహ్మణులు; అరవవారు. మాయూరు చేరి కొన్ని సంవత్సరములు నాజ్ఞాతులలో నొక్కనికి ప్రతిగ మణియముచేసిరి. పిమ్మట ప్రైవేటువక్కీలుగా కుదిరి తనకు కావలసినంత మితశ్రమతో నార్జించుకొనుచు సుఖజీవన కళాకోవిదులై యుండిరి. వీరును వీరిభార్యయు నాతల్లిదండ్రులకు ప్రాణస్నేహితులు. మాయింటినుండి ప్రతిదినమును కూరగాయలు మొదలగు సరకులు వారింటికి యెగుమతి; వారియింటినుండి మంచివంటలు మా యింట దిగుమతి. సుబ్బయ్యగారు ఆకారమున ఏనుఁగుతలలేని విఘ్నేశ్వరులు. పొట్ట ఉల్లాసముతో ఉబికి దూఁకు లాడునది. చాల పెద్దది. భోజన ప్రియులు. పాపము! ఇంకేచింత లేనివారు. భక్తి, భుక్తి యివి రెండే వారి జన్మప్రపంచపు ధ్రువనక్షత్రములు. ఒకనాఁడు మాతండ్రితో ముచ్చటించుచు "ఆకలెక్టరు రెండువేల రూపాయలు తీస్తాడు. లాభమేమి? సుఖ మేమి ? నేను తినునంత వాఁడు తినఁగలఁడా? చెఱకుగడను కఱకఱమని నమలి తినఁగలను నేను. ఈవయస్సున ! డబ్బుంటే యేమి ఫలము? సుఖమును అనుభవించే శక్తి యథాక్రమముగ నుంటేగద" అని తమ జీవితకళాసూత్రమును వెల్లడించిరి. ఆ సుబ్బయ్యవంటి నిష్కల్మషచిత్తుఁడు, విశాలహృదయుఁడు యింకొకఁ డుండఁడు. తన సంపాదన యెక్కువగాదు అందులో అమ్మవారు ఎంత వితరణగా వాడినను తమకై మిగులునది తక్కువ. ఆకొంచెమును ధారాళముగ

దానముచేసి "శివశివ"యని భగవన్నామస్మరణసదాచేయుచు, తెల్లని జుబ్బా, తెల్లతలగుడ్డ, ఎఱ్ఱనిరుమాలు, తెల్లధోవతి ధరించి, మార్గములోనుండు విఘ్నేశ్వరునికి నమస్కరించి ఏద్దైన నేఁడు దేవునిదయ వలన కోర్టులో దొరకునా యని చిత్తూరునకు పోవుచుందురు. పిల్లల కందఱకు వారిని చూచినఁ బరమానందము.

వీరియొక్కయు, మాతండ్రియొక్కయు దైనందిన చర్యలు ద్వంద్వసమాసములు. ఉదయము 5 గంటలకు లేచి, కల్యకృత్యములఁ దీర్చి మణియము సుబ్బయ్యగారు వేదపారాయణము బిగ్గరగాఁ జేయుచు (వేదపారాయణమో కాదో నాకు తెలియదు. ఏదో సంస్కృతభాషాఘోష) మాయింటి అరుగుమీఁద వచ్చి కూర్చుందురు. ఆయరుగు నాతండ్రియొక్క పడకగదికిసమీపస్థము. ఆదీర్ఘారావములు చెవినిబడఁగానే సుబ్రహ్మణ్యరెడ్డి లేచి ఎఱ్ఱనిచిన్న దస్తుగుడ్డను(duster cloth కాఁబోలు) తలకు చుట్టుకొని, జుబ్బాను ధరించి వారితోఁ గలసికొని, లౌకికసంభాషణలు సేయుచు తోఁటకుఁ బోదురు. మాకు తోఁట లనేకములు. దూరపుతోఁటలకు బండిలో ప్రయాణము. దగ్గఱవానికి నడిచి సుమారు 7 గంటలవఱకు తోఁటలోతిరిగి 7½గంటలకు ఇంటికి వత్తురు. పిమ్మట అయ్యగారు ఇల్లు చేరుదురు. రెడ్డిగారు కచ్చేరీపనికి దిగుదురు. పదిగంటలకు భోజనము. కోర్టుకు పోకుండినచో ఆమీఁద విశ్రాంతి కొంతసేపు. పిమ్మట భారత భాగవత పఠనము. సాయంకాలము మరల కచ్చేరి. రాత్రి 7 గంటలకు భోజనము. తదుపరి యే వ్యవహారచింతయుఁ గూడదు. భారత భాగవత పారాయణము. ఆపారాయణకు మణియము సుబ్బయ్యగారు, కోళంద రెడ్డిగారి తండ్రి రామయ్యగారు, అతిథులుగానుండు కక్షిదార్లు, అందఱు సభగా సమావేశ మగుదురు. కొంతవయస్సు వచ్చినవెనుక పాఠకత్వము తరచు నాపనిగా నుండెడిది. 12 సంవత్సరముల వయస్సునకే భారత భాగవతముల ఎక్కువ గజిబిజిలేకచదువఁగలట్లు నాతండ్రి నన్ను తేర్చిరి. తన యితరకొడుకులకన్న నేను అర్థజ్ఞానముతో చదువువాఁడ ననియు, పదాదివిభాగములను అన్వయ సౌలభ్యము గలుగునట్లు చేయుదుననియు వారి వాత్సల్యజనితభ్రమ. చదువు పద్యములసంఖ్య కొంచెమే. వానిపైన నడచు వ్యాఖ్యానములు, వాగ్వాదములు మెండు.

ముఖ్యముగా కొళందరెడ్డిగారి పెద్దనాయన, వేంకటసామిరెడ్డి, మాతండ్రి వేదాంతములు భారతములో లేవనియు, ఆకాలమువారును బాగుగ తిని కండక్రొవ్వెక్కి భోగపరాయణులుగా నుండిరే కాని, శుష్కసన్న్యాసులు గారనియు, పెద్ద కేకల వేయునపుడు మాకందఱికి ఆపరాని నవ్వుగా నుండెడిది. తక్కినవారు మాతండ్రి చెప్పినదే వేద మని ఊకొట్టువారు. మణియము సుబ్బయ్యగారు 'అమితాహార మనేది లేదు. కడుపుపట్టేదానికంటె నెక్కువ నెవఁడు తినలేఁడుగదా! కాఁబట్టి అది తామసక్రియలలో చేరదు.' అని తమకుకావలసిన వికల్పసూత్రమును మాత్రము సమర్థింతురు. రామయ్యరెడ్డిగారు మాంసాహారప్రియులు. వారివాద మేమనఁగా "ఒక్కభీముఁడేగాదు, ధర్మరాజుగూడ మాంసము తినేవాఁడు. ఆకాలమున అందఱు తింటూవచ్చిరి. అది తింటేనేగాని నిజంగా హిందూధర్మం చెల్లదు. ఈ యొక్కవిషయంతప్ప తక్కిన దంతా సుబ్రహ్మణ్యరెడ్డి బోధించునట్లే;" అని మాంసాహారనిషేధము సరిగా దందురు. రాత్రి 9, 9½ గంటలకు సభ ముగియును. వారివారి పడకలకు వారు పోదురు.

మామిడిపండ్లకాలములో ఈధర్మవిచారణలతో ననుపానముగ మంచి మామిడిపండ్లను కోసి తినుచు వాని తారతమ్యచర్యలను నడుపుదురు. "ఒరే! ముట్టెలలో నుండేరుచి చెంపలలో లేవురా! చూడండి! ముట్టెను ఎట్లా తింటానో!" అని మా మణియము సుబ్బయ్యగారు ముట్టెను చవులూరునట్టు చప్పరించుటయే గాదు, ఖటుక్కని కొఱుకుటయు చూచి హర్షధ్యానములు చేయుచుంటిమి. మామిడి విత్తులను నాటితిమేని మొలకెత్తి, చెట్టయి 5, 6 ఏండ్లకు కాయలు కాయును. ఈకాయలు విత్తుయొక్క మాతృవృక్షపుకాయల ట్లుండవు. అందునకే విత్తు వేయక అంటుగట్టవలసినవిధి. విత్తులనుండి యేవేవో నూతనరకములు కలుగును. ఇందులో 100కి 99 నిష్ప్రయోజనములు. పరిపూర్ణమయిన మామిడిపండుయొక్క సాముద్రికలక్షణాము లివ్వి: మంచిరంగు; పలుచని నున్ననితోలు; నార లేకుండుట; చిన్నముట్టె; ఘనమును బిగువును నైనకండ; మంచివాసన; మంచిరుచి; ఆలస్యముగా కాయ పక్వమునకు వచ్చుట (అప్పుడే దానికి మంచివెల.) నాతండ్రికి డార్విన్ గారిచే ప్రసిద్ధిపఱుపఁబడిన "సహజవికృతి" న్యాయము

(Spontaneous variation) తెలియదు. వినికూడ నెఱుఁగరు. అయి నను సహజమైన వివేకమును ప్రయోగించి ఆ న్యాయముయొక్క ప్రయోగమును గ్రహించి, విత్తునుండి మొలిచెడు చెట్టులో ఏమయిన నూతనఫలము వచ్చునుగదా! అదృష్టముండిన మంచి క్రొత్తజాతి యేల ఉద్భవింపరాదు? అని వితర్కించి, పరీక్షార్థము విత్తులను నాటి ఆ చెట్లు ఫలించువఱకు వేచియుండి, ఆపండ్లను మాయూరి సభలో కోసి, తిని, చర్చించి,—ఈకార్యమునకు ప్రధానమంత్రి రామారెడ్డిగారు. వారుతప్ప నింకెవ్వరు ఈనూతనసృష్టులను కోసి నివేదింపఁగా నేఁ జూచి యుండలేదు.—మంచిదని నిర్ణయింపఁబడినయెడల దానికి నామకరణము చేసి, ఆచెట్టునుండి అంటు కట్టి ఆజాతిని నిలుపుదురు; వ్యాప్తికిఁ దెత్తురు. తక్కినవానిని నిర్మూలము చేయుదురు. ఇట్లు అనేకసంవత్సరములుగా ఓపికతో పరీక్షలు సలిపి సలిపి నాకుఁ దెలిసినమట్టునకు అయిదు నూతనజాతులను సృష్టింపఁగలిగిరి. (1) రాజాపసందు; కాయ గుండ్రము, మల్గోవాకన్న రెండింతలు పెద్దది. మంచిరుచి. కాయ పెద్దది. కాడ సన్నము. కాన కాయుట తక్కువ. గాలికినిలుచుట కష్టము. నిలిచినకొన్నియు ప్రశస్తములు. (2) రెడ్డి పసందు; కాయ పెద్దది. చర్మము ఘనమును, గడుసును. రంగు వికారము. అనాగరకము చూచుటకు. రుచి మంచిది. (3 & 4) రాబర్ట్సుపసందు, కాలేటు పసందు. గుండ్రములైన మేలిమిరకములు. (5) భోగం పసందు; చూచుటకు మంచిరంగుతో నాణ్యముగా నుండును. రుచి మంచిది కాదు. వినోదార్థము కొన్నిచెట్లుమాత్రమే వేసిరి.

కోర్టునకు పోక మిగిల్చిన కాలమునంతను భారత భాగవతములకు మామిడితోఁటలకు వినియోగించిరి. రెంటను బ్రసిద్ధిఁ జెందిరి.

మఱియును సుబ్బయ్యగారు పార్శ్వవాయు వ్యాధిచే పీడితులై తమ దేశమునకు పోవుట నాతండ్రికి శాశ్వతదుఃఖకారణ మాయెను. వారు బ్రాహ్మణులు; మేము శూద్రులము. ఏభేదములేక సహ కుటుంబమ ట్లుంటిమి.

చిత్తూరులో నారాయణయ్యంగార్లు అను వైష్ణవ బ్రాహ్మణులు పూర్వము డిస్ట్రిక్టుమునిసీఫుగా నుండిరి. వారికి మాతండ్రికి సంపూర్ణమయినమైత్రి యుండెను. వారు చనిపోవునపుడు భార్య

కనకమ్మ, కూతురు కమలమ్మ. వీరికి మాతండ్రిగారిని గార్డియన్‌గా నియమించిరి. భార్యను కూఁతురిని చెన్నపట్నము ఎళుంబూరిలోనుంచి తనమరణపర్యంతము వారి కెట్టికొదవయు లేకుండునట్లు తల్లిదండ్రుల కన్న నెక్కువగా రక్షించిరి. వారికై సంవత్సరమునకు రెండుమార్లు పట్నము పోవుచుండిరి. వారు పోవునపుడెల్ల నన్నును పిలుచుకొని పోవుచుండిరి. ఒక్కొకప్పుడు మాయక్కయు వచ్చును. ఒకానొకప్పుడు కమలమ్మయు మాయక్క సుందరమ్మయు తాముండుగది లోనికి నన్ను రావల దనఁగా బాల్యవిపరీతకోపినై కొరడాతో వారిద్దరిని కొట్టితిని. మాతండ్రితో చెప్పుకొనిరి గాని వారు నన్నేమియు ననలేదు. నేనెప్పుడు తండ్రితో నుండువాఁడను. వారికిని నాయందు ప్రీతి యెక్కువ. ఘటికుఁడ నను నభిమానముకూడ. కాఁబట్టి కనకమ్మ గారు నన్ను "మంత్రి" యని కించిద్ధేళనముగ పిలిచెడివారు. సుబ్రహ్మణ్యరెడ్డి చనిపోయినపిమ్మట వారి వ్యవహారములలోఁ జాల చిక్కులు వచ్చినవి. నేను 1902 వ సంవత్సరములో కేంబ్రిడ్జికి పోక ముందు పెంపుడుసహోదరియైన కమలమ్మను చూచి సీమనుండివచ్చిన తోడనే నాసమీపముననే ఆమెకు గృహమేర్పరచి శక్తికొలఁది చూచుకొందు నని నమ్మికచెప్పి ఓదార్చిపోయితిని. నాదురదృష్టము ఆప్రీతి కార్యమును చేయనిచ్చినది కాదు. నేను వచ్చుటకు ఒక్కయేడు ముందు కమలమ్మగారు మరణించిరి. ఆపెకుపూర్వమే తల్లి కనకమ్మయు తరలి పోయెను. ఈబ్రాహ్మణ కుటుంబమునెడ ప్రీతియు గౌరవముఁ దాల్చి మేమెంతయో చేసితిమి గాని, మనసు కోరినంత సుఖము సంపాదింపఁ జాలమైతిమి. మాయింటిలోని ప్రతి శుభకార్యమునకు వారు రానిది జరుపనెంచము. వారి కష్టసుఖము లన్నియు మాయవిగా నెంచి మైత్రి నెరవేర్చితిమి. చావుతో మాకు వియోగము సంభవించెనుగాని మాయెవరివలనను ఆమైత్రికి ఒక్కక్షణమాత్రభంగమైన రాలేదు.

కట్టమంచి సుబ్రహ్మణ్యరెడ్డికి దైవభక్తి యెక్కువ. దానితోఁ బాటు ఛాందసములును.

ఫొటోగ్రాఫు తీయించుకొనిన ఆయుఃక్షయకరమని తనపటమును తీయనీయలేదు. వీరివలెనే మాచిన్నాయన రంగారెడ్డియు ఆకృతిపటమును తీయించుకొనకయె చనిపోయెను. ప్రతిబింబము

తీయించిన బింబమునకు హానియఁట! మానాయనకు గుఱ్ఱముల నుంచుటయు ఆక్షేపణీయము. ఆయోగము రాజులకేగాని యింకెవ్వరికిఁ దగదు. తన గ్రంథములో రెడ్లను పుడమితేడు లని సంభావించి యున్నాఁడు. గుఱ్ఱములు కూడదనియు ప్రకటనే! తాను ఒంటెద్దు బండిలో నెన్నఁడుఁ గూర్చుండఁడు. అది పాపము. మతేవాహనత్వము చెల్లు ననఁగా తెల్లని రెండెడ్లబండి, తనకు అనుకూలించురీతిని పెద్దవిల్లు బండిని కట్టించి దానికి పెద్ద తెల్లనియెడ్ల రెంటిని బూన్పించి అందులో రాకపోకలు చేయుట వారిపద్ధతి. నాదత్తుతండ్రి రామస్వామిరెడ్డికి గుఱ్ఱములమీఁద వ్యామోహము ఎక్కువ. నాకుఁ దెలిపి ఒకదాని వెనుక నొకటిగా మూఁడుగుఱ్ఱములఁ గొనెను. కొనినప్పుడెల్ల అన్నగారియొద్ద క్షమార్పణార్థము కల్లసమాధానములు చెప్పుచుండును. మూఁడవగుఱ్ఱమును కొనినప్పుడు వేలూరిలో (వారు వేలూరిలో వక్కీలుగానుండిరి.) ఇంజనీయరు తనకుఇనాముగా బలవంతపఱచి ఇచ్చినాఁడని సమ్మోహనాస్త్రము వేసినాఁడుగాని, దానివలన పెద్దాయనకు కోపము రెండింతలై నాయెదురుగనే మాచిన్ననాయనను, అప్పటికి 38 ఏండ్లవానిని, చెడదిట్టినాఁడు. ఈమంగళాశాసనము లైనవెనుక మాచిన్ననాయనయు నేనును మేడమిద్దెమీఁదికిఁ బోవుచుండఁగా నేనూరకయుండక చనువుచేతకలిగినచాపల్యముమై "చిన్నాయనా! చిన్నాయనా! నిన్ను మానాయన బాగా తిట్టినాఁడే" అని యంటిని. మాచిన్ననాయన నవ్వుచు "అవి తిట్లుకాదుర్రా, తమాషామాటలు" అని త్రోసిపుచ్చెను. ఆకాలపు అన్నదమ్ముల సౌహార్దము నేఁడు కలదా!

రామస్వామిరెడ్డి రాజసగుణుఁడు. సుబ్రహ్మణ్యరెడ్డికి సత్త్వగుణ మెట్లు ప్రధానమో తమ్మునికి రజోగుణ మట్లు. వారికి నాయందు ప్రాణసమానమైనప్రీతి గావున అప్పుడప్పుడు నాచదువు ఎట్లున్నను విచారణలేకయు వేలూరునకుఁ బిలిచికొనిపోయి మాసముల కొలఁది ఉంచుకొనువాఁడు. అక్కడ నాకు మితాయిపొట్లములేమి, భోగమువాండ్రు వచ్చి స్నానముచేయించి నయముగా నొప్పిలేనివిధమున తలదువ్వుటలేమి, చాల బాగుగ నుండునది కాలము! విరించిపురముకోవెలకు మాచిన్ననాయన ముఖ్యధర్మకర్త. అక్కడకు వెళ్ళినప్పుడెల్ల బ్రాహ్మణ ఫలాహారములు పసిబిడ్డగదాయని దేవదాసినులు చేయు

పరిచర్యలు ఇవన్నియు దట్టముగా పడుచుండెను. మాతండ్రి కీవిపరీత ములు తెలియుటతో వేలూరునకు పంపుట మానివేసిరి. తొమ్మిదవ సంవత్సరప్రాయానంతరము ఈ రాజభోగము లన్నియు నిలిచిపోయి సత్త్వగుణముల నభ్యసింపవలసిన కర్మముఁ జెందినవాఁడ నైతిని.

కవిత్వము మహాసాహసకార్యమని నాతండ్రికి భయము. ఒక విధముగఁ జూచిన నిజమే కాని వారికారణము వేఱు. విమగణములు పడి యెవరి కే చేటు వాటిల్లునోయను వెఱపు పెద్ద. తెనుఁగులో నాకుండు పాటవమును జూచి వీఁడెప్పుడు కవిత్వరచనకు ప్రారంభించి నాశన మగునో యని దిగులుచెందుచుండును. సాక్షాత్తు తనయొక్క కంఠస్వర ముతోనే తానుచదివెడుమాడ్కనే భారతమును నేను జదువునప్పుడు పరమానందమును, ఈ తుంటరి కవిత్వమును మొదలుపెట్టి ఇల్లు గూల్చునోయను సంశయమును చనిపోవువఱకుఁ దాల్చియుండెను. కవిత్వమనఁగా మరణయోగములలో నొకటి!!

ఇంక శకునములు మొదలగు పారంపర్య ఛాందసముల సంగతి చెప్పవలయునా? పిల్లి, కుక్క మొదలగు అన్నిజంతువులును, జ్యోతి శ్శాస్త్రములోని గ్రహములట్లు మనుష్యజీవితమును ఆదేశించుచు శాసించుచు నిర్మాణమునకుఁ దెచ్చినవి. బ్రాహ్మణులు వారికి భూదే వతలు. ఎన్నితప్పులు ఎన్నిపాపములుచేసినను పూజనీయులే. పంచాం గము అయ్యవారు జీవితయాత్రకు మార్గదర్శి. అనఁగా త్రోవ చూపువాఁడు. "లగ్నాలు నిజమైతే ముండమోపు లెట్లయిరి?" అని వేమనయొక్క ప్రశ్న. అట్టి లగ్నములు నిజములు గావని నాతండ్రి యొక్క సమాధానము!

దైవభక్తి, సత్త్వగుణము, ఇవి వీరికి వెన్నతో వచ్చిన వరములు. చిన్నవయస్సుననే మాంసాహారము మానిన జీవహింస మానునని

ఉ॥ మ్రానను రాతనుం గలదె మాంసము ప్రాణులమేనఁగాక య
మ్మేనుల నొంచునట్లు తమమేనులసోఁకినమాత్రి నెట్లగుక్
దానిఁ దలంపఁగావలదె తా నది మానిన హింసలన్నియుక్
మానవెయంచు నుత్తముఁడు మాంసముమాను దయార్ద్రచిత్తుఁడై.

భారతమున విని మాంసాహారమును విసర్జించెను. వీరికిముందే మాతల్లి నారాయణమ్మ వదలిపెట్టెను. వీరిని జూచి మాపిన్నతండ్రులు పిన్నమ్మలు అందఱు శాకాహారవ్రతమును బూనిరి. మా వేలూరు చిన్ననాయనమాత్రము మఱుగుగా కోడిగుడ్లు సకృత్తుగా ఔషధముగా తినెడువాఁడు. ఔషధముగా మాంసము పుచ్చుకోవచ్చునని మాతండ్రియు నొప్పుకొనుచుండెను గాన అది వ్రతభంగము కాదు. సూర్యగ్రహణము, చంద్రగ్రహణము, ఇత్యాది పర్వదినములలో అనేకపర్యాయములు స్నానములుచేసి పితృతర్పణము విడిచి, భారత పారాయణము చేయుదురు. అందును ముఖ్యముగా అరణ్యపర్వములోని తీర్థప్రశంసాఘట్టమును. తాను అలసినప్పుడు నేను, నాగొంతు కీచైనప్పుడు వారు, ఇట్లు మార్చి మార్చి పుణ్యమును పోగుచేసితిమి. తల్లియైన జానమ్మ (అనఁగా మాఅవ్వ) చనిపోయినప్పుడు గోదానాదుల విశేషముగాఁజేసి బ్రాహ్మణులకును తనకును మనస్తృప్తి కల్పించుకొనిరి. ఈ తృప్తి కృత్రిమమో యథార్థమో ఎవరు నిర్ణయింపఁగలరు? కట్టమంచి చిన్నయూరు. దేవాలయములుమాత్రము మెండు. చోళులచే ప్రతిష్ఠింపఁబడినశివాలయ మొక్కటి యున్నది. అది మిక్కిలియు పెద్దది. అందలి విగ్రహాదులు మనోహరములు. మఱియము సుబ్బయ్యయు వీరును తఱుచు సాయంకాలముల నచ్చట గడుపుచుందురు. ఆదేవళము శిథిలతకు వచ్చుచుండుటఁజూచి, మాతండ్రులు మువ్వురు ఆస్తిలోనుండి పదివేలరూపాయలు కర్చుపెట్టి గాలిగోపురముతక్క తక్కిన యావత్తుభాగములను సంపూర్ణముగ బాగుచేయించిరి. కొళందీశ్వర కామాక్షమ్మ విగ్రహములను ధాన్యములో పాతిపెట్టి, కట్టడపుకార్యము ముగింపునకు వచ్చినపిమ్మట కంచినుండి వేదవేత్తలైన బ్రాహ్మణశ్రేష్ఠులను రప్పించి యజ్ఞములు చేయించి పిమ్మట దైవతములను అష్టబంధనాది కృత్యములతో పునః ప్రతిష్ఠింపించిరి. ఈ కార్యము నిర్విఘ్నముగ కట్టమంచిలో యథార్థబ్రాహ్మణుఁడని పేరువడసిన గురుకులము కుప్పయ్యగారి విచారణక్రింద, 1905 వ సంవత్సరములో జరిగెను. ఆయజ్ఞశాలలోనే ఒకానొక బ్రాహ్మణ మిత్రుఁడు నన్ను చూచి "మీనాయనయొక్క పుణ్యము పరిపూర్ణమైనది. ఇంక వారు త్వరలో కైలాసపదవి నందుదురు." అని గౌరవ

భావముతో గుఱిచెప్పెను. మఱుచటి సంవత్సరము డిశంబరు నెల 6 వ తేదిని నాతండ్రిగారు స్వర్గస్థులైరి.

కంచి వరదరాజస్వామి నామాంకితమైన విష్ణ్వాలయము ఒకటి యున్నది. మాయింటివారు శివమతము అనుపేరు గలవారుగాని వీరు కొలువని దేవతలు లేరు. మాకు దేవతలందఱు సమానాదరణ పాత్రులే. ఈ విష్ణుగుడిని బాగుచేయ నారంభించిరిగాని కార్యము ఎక్కువగ కొనసాగకముందే విగతజీవులైనందున, దానిని, చిన్నానాయన రంగారెడ్డిగారు నిర్వహించి ముక్కాలుమువ్వీసము పూర్తి చేసిరి. ఆకొదవను తీర్చవలసిన భారము మాది.

1892వ సంవత్సరమునందే వేలూరుచిన్నానాయన, రామస్వామి రెడ్డిగారు 42 సంవత్సరముల వయస్సున చనిపోయిరి. వారు ధన సాహాయ్యముతప్ప ఈ దైవకైంకర్యములలో నింకేదియు చేయఁజాల రైరి. 1896వ సంవత్సరములో నాతండ్రి మరణించిరి. అప్పుడు వారి వయస్సు ఏఁబది. కడగొట్టుచిన్నానాయన రంగారెడ్డి షష్టిపూర్తి ననుభ వించి 1913వ సంవత్సరములో దివంగతులైరి.

మాతండ్రిగారు శ్రీరామ భజనమందిరమును స్థాపించిరి. శాస్త్రోక్తముగా లిఖింపఁబడిన పటమొకటి కార్వేటినగరము రాజు గారు తనకిచ్చి సంభావించిరి. కొన్నినెలలకు నాయన్నయైన నరసింహా రెడ్డి జ్వరగ్రస్తుఁడయ్యెనఁట. ఆపటమునకుఁ బూజయు నైవేద్యము లేనందున ఈవ్యాధి వచ్చెనని కుప్పనయ్యంగార్లు గుఱిపలుకఁగా, తత్క్షణమే భజనకు ఏర్పాటు చేయునట్లు మ్రొక్కుకొని కొంతకాలమునకే గొప్పమందిరమునుకట్టించి శ్రీ సీతారాములపట్టాభిషేకపటమునుఅందు స్థాపించిరి. మాయూరిలోని పాఠశాలయు అందే నడుపఁబడుచున్నది. నేను పరీక్షలలో జయమునందినపుడెల్ల విశేష నైవేద్యములతో పూజ చేయుటకునై నాఁడు రెండు రూపాయ లిచ్చుచుందురు. ఊరిపిల్లల నందఱినిఁ జేర్చి వారి కా తినువస్తువుల నిచ్చి కృతకృత్యుఁడ నాచు నుంటిని.

తమ్ముఁడైన రామస్వామిరెడ్డి ద్వారమున నాగప్రతిష్ఠఁ జేయించెను. మఱియు విఘ్నేశ్వరుని గుడి యొకటి కట్టించెను. దేవపూజ

లన్నియు క్రమముగా నడచునట్లు విచారించుకొనుచు మా గ్రామములో ఋజువర్తనము నుద్ధరించుచుండెను.

వీరు ప్రచురించిన గ్రంథములు రెండు. భారతసార రత్నావళి, భాగవతసార ముక్తావళి. సొంతకవనముపొంతఁ బోఁగూడదను నియమము దాల్చినవారగుటవలన, నీసంపుటీకరణములతోఁ దృప్తిఁజెందిరి. ఈగ్రంథముల ప్రాశస్త్యమునుగుఱించి నేను జెప్పఁబూనుట సమంజసముగా నుండదు. ఆపనిని పండితులకు సమర్పించుచున్నాను. సాంప్రదాయానుసారముగా ప్రధాననీతు లని తోఁచినవానిని ప్రోగుచేసి, వర్గీకరించి భారతసారమును తొలుత 1885 వ సంవత్సరములో ప్రచురించిరి. పిమ్మట మూఁడేండ్లకు భాగవతసార ప్రకటన. భారతముయొక్క నిజమైన సార మేది యను నంశము నానామహాగాధ విమర్శనలకు ప్రకృతము లక్ష్యమైయున్నది. అయినను జనబాహుళ్య మెయ్యది దానియొక్క నిజతత్త్వమని యెంచుచున్నదో దానిని సుబ్రహ్మణ్యారెడ్డిగారు సంపూర్ణముగను, విశదముగను వర్గీకరించి ప్రదర్శించినారు. భాగవతముయొక్క నిజమయిన భావమునుగుఱించిన అభిప్రాయభేదము లంతగా లేవు. కొందఱు అద్వైతపరముగను, మఱికొందఱు ఇతరదర్శనములపరముగను సమర్థించి యున్నారు; కాని యిదియే యాభేదముల పరిమితి.

నాతండ్రికి అద్వైతమే పరమసిద్ధాంతము. అయినను ద్వైత విశిష్టాద్వైతములుగూడ సత్యమును వహించినవగుటయేకాక ఆవశ్యకములనియు వారినమ్మిక. ప్రకృతియొక్కనియు ఆత్మయొక్క పరిణామస్థితిని అనుసరించి అన్నియుఁ గావలసినవే! కేవలత్వమునకు సంసిద్ధుఁడై యున్నవానికి అద్వైతమే అనుకూలించుమతము. దానికన్నఁ దక్కువదశలలో నుండువారికి తక్కినమతములు అనుకూలించును. త్రిమతములకు నీరీతిఅన్వయము కలిగించుట న్యాయమని నేను చెప్పఁజాలను. భక్తి, జ్ఞానము, కర్మ, ఈ త్రికాండములకుఁగల సంబంధములను గ్రహించుట యనఁగా తత్త్వశాస్త్రమథనము పరిపూర్ణముగఁజేసి అమృతమును వడయుట. న్యాయవాదిగానున్నను వివాదములన్న జడిసి వెనుకదీయు నాతండ్రి నిరాఘాట విమర్శనావ్రతమును అవలంబింపలేదు. ఏదోయొకరీతి అన్నింటిలో నీశ్వరుఁ డున్నట్లే అన్నింటిలో

సత్య మున్నదని సంధిమార్గమునుబూని ఒకరినినొప్పింపక తా నొవ్వక తన జీవయాత్రఁ గడ తేర్చుకొనెను. ఎట్లు విచారించిచూచినను అతఁడు అజాతశత్రువు.

కుప్పనయ్యంగారు ఈగ్రంథములను సవరించినారని ముఖపత్రమున నున్నది. స్నేహభావముచేత వారిపేరున కా ప్రాముఖ్యత నొసంగిరేకాని వారెక్కువ యేమియు చేయలేదు. అయినను మాయూరిలోని ప్రసిద్ధాంధ్రపండితులును, మాముత్తాత రామలింగారెడ్డి శిష్యులును అగుటచే సహకర్మగా గ్రహింపఁబడుట సహజమేకదా!

నాముత్తాతయైన రామలింగారెడ్డియొక్క కృతులను ముద్రింపఁ గోరి 1889 వ సంవత్సరములో నెత్తివ్రాయించ నాతండ్రి ఆరంభించెను. వారికృతులలో ముఖ్యమైనది భాస్కరశతకము. అప్పుడుపుట్టిన పుణ్యావశముచేత నాచిన్నతమ్ముఁడు, ఇప్పుడు డిస్ట్రిక్టు మునిసిఫుగా నుండువాడు, భాస్కర నామధేయాంకితుఁ డయ్యెను. ఏకారణముచేతనో ఆముద్రణకార్యము నెఱవేఱినదికాదు. ఈసంవత్సరమున ఆభాస్కరుని సాహాయ్యముచే రామలింగారెడ్డికృతులను మదనపల్లెలో నే నచ్చువేయింపఁగలిగితిని.

ఈ సంగ్రహజీవితమును, నేను కుప్పనయ్యంగారి సర్వలక్షణ సారసంగ్రహమునకును, రామలింగారెడ్డి కృతులకును వ్రాసిన పీఠికలను చదివినయెడల మావంశచరిత్రమేగాక పూర్వమున మాగ్రామవృత్త మేరీతినుండెననుటయు కలఁగన్నమాడ్కి నైన గోచరింపకపోదు.

1895 వ సంవత్సరము డిసెంబరునెల 6 వ తేదీని నాతండ్రి కాలధర్మముఁజెందెను. నే నప్పుడు చెన్నపురిలో నుంటిని. ఆనరబిల్ రంగయ్యనాయఁడుగారికి తంతి రాఁగా కమలమ్మను నన్నును బిలుచుకొని బయలువెడలిరి. నాదుఃఖమునకన్న కమలమ్మయొక్క దుఃఖమే యెక్కువ. పాపము! ఆఁడుది, రక్షకులులేనిది. పుట్టిననాటఁగోలె ఏచింతయు సోకకుండునట్లు కాపాడిన పెంపుడుతండ్రి చనిపోయెఁగదా! నా కింక గతియేమని పనివి పనివి యేడ్చుచు వచ్చెను. నా డనఁగా రైలుబండి ఒకగంట ఆలస్యముగా చిత్తూరుచేరినది. మేము

వచ్చునరికి చిత్తూరునుండి కట్టమంచివఱకు జనులు గుంపులు గుంపులుగ చీమలబారుల ట్లుండిరి. నరసింగరావు, సుందరయ్య, వెంకయ్య, అరుణాచలమొదలి, దొరసామిమొదలి మొదలయిన వకీళ్ళు, వర్తకులు, బంధువులు, బీదసాదలు, కోటిగారి రంగయ్య మొదలయిన స్నేహితులు అందఱు ఆ మహాసీయుని అంత్యదర్శనార్థము తండోపతండములుగ పరివేష్టించి కన్నుల నీరుఁ గార్చుచుండిరి. దహనసంస్కారానంతరము డిస్ట్రిక్టుజడ్జియైన రాబర్టు సివెల్ వచ్చి విచారించెను. ఒకనెల వఱకు మాయిల్లు సత్రముగా నుండెను మాజిల్లావారి గొప్పతనమునకు సూచకమయిన ఒక్కవిషయ మిట అల్పమయినను చెప్పకతీరదు. కక్షిదారులెల్లరు మేము అడుగకయె తామియ్యవలసిన పైకమును తామే తెచ్చి మాతల్లికి దేవునిముడుపులట్లు చెల్లించిరి. దాదాపు ముప్పదియేండ్లు దాటినవెనుక నేను ఎలక్షన్ దండయాత్ర వెడలఁగా కట్టమంచి సుబ్బారెడ్డికొడుకు అను ధ్వజమే అనాయాసవిజయావహమైనది. "తమ్ముం కపిధ్వజపభల యంధీభూతులం జేయవే" అను మాడ్కి, నాకు తెనుఁగుననుండు విద్య వారిడిన భిక్షయేకాని వేఱు కాదు. భారత భాగవతములను మనసులో నాఁటికాలక్రమమున వికసనకువచ్చునట్లు చేసిరి. రామాయణమునందు వారికి రక్తి లేశమాత్రము. ఏలనఁగా-అది కథ; కావ్యము; వేదాంతవిచారణలు, ధర్మాధర్మ ప్రసంగములు అంతగాలేని దని. వారెంతచెప్పినను భాగవతము యొక్క శైలి నా కంత రుచింపలేదు. వారి చావుపడకలో నారాయణకవచమును పదింబదిగఁ జదివితిని. కాని ఆచిన్న వయస్సునఁగూడ కవితాళళ అందు న్యూనమని కాఁబోలు మనసు భారతముమీఁదనే తఱచు ప్రసరించుచుండెడిది. భారతమును పునః పునః పారాయణము చేయించి నాయందు వారు సాహిత్యరసజ్ఞతను పుట్టించిరి. అందు చేతనే నాకవిత్వతత్త్వవిచారమును నాతండ్రికి అంకితముచేయుచు నిట్లు వ్రాసితిని:—

క॥ నాతండ్రి సుగుణమణిఖని
శ్రోత్రియుఁ డురువైభవుండు సుబ్రహ్మణ్యుం
డాతతగతి నాటిన వి
ద్యాలతల ఫలంబు మీకు నభివేదింతున్.

నేను తొలుదొల్త రచించిన ముసలమ్మమరణములో:—

క॥ భారతభాగవతోజ్జ్వల
వారిధిగతసారపద్య వరమణిచయముల్
హారాలు గట్టె నెవఁ డా
సూరిని మజ్జనకుఁ దలఁచి చూడుఁడు నన్నున్.

అని వారి యాశ్రియమ నాప్రధానాశయ మంటిని. ఈ పద్యము కూచిమంచి సోమసుందరకవిగారి ప్రశంసకు అనుకరణము. ఈ కవి సర్వేడిపార్టుమెంటులో గుమస్తాగా నుండి మాజిల్లాకు వచ్చి మాయూరిలో మాయింట నొకదాన నుండి తండ్రిగారి అత్యంత మిత్త్రుఁ డాయెను. వారికిని సర్వేసూపరెంటెండెంటునకును భేదములు తటస్థించినప్పుడు మాతండ్రి మాధ్యస్థ్యము వహించి కుదిర్చెనఁట. ఆయన భారతసారరత్నావళిని అనుగ్రహించుచు నిట్లువ్రాసెను:—

మ॥ తతబోధాఖిలదీపితాఖిలమహా ధర్మోర్మికోపేతభా
రతవార్ధింగల సారపద్యమణులన్ రత్నావళింగూర్చె నీ
శ్రితతత్త్వజ్ఞుఁడు సూతుఁడో శుకుఁడో వ్యాసుండోగదే యంచు ధీ
రత మిమ్మెందురు కట్టమంచికుల సుబ్రహ్మణ్య పుణ్యాహ్వయా!

ఒకానొకప్పుడు భారతవ్యాఖ్యానరచనా చింతాబంధుర హృద యుండనై ఈ క్రింది పీఠికాపద్యములఁ దలపోసితిని:—

క॥ ఘనమగు బ్రీతిం బెంచిన
తనయును నే ధారవోసి ధన్యుఁడనయ్యున్
మునిఁగితి శోకార్ణవమున
మనసునకున్ సుఖములేని మందిర మయ్యెన్.

క॥ కానన్ భాషాకన్యం
బూని పునఃప్రీతి నింట ముద్దుగ నే ని
త్యానందతకై నిలిపెద
నేనాడును జేయిఁ విడిచి యేగద నన్నున్.

క॥ అని చింతాక్రాంతంబగు
మనసున ననుకొన్నమాడ్కి మహితగ్రంథం
బును జేయంబూని భారత
మనూనశాంతప్రధాన మగుటను మఱియుః.

క॥ శైలిని వృత్తంబున గా
థాలోచనలః మహాద్భుతాఖిలవిధపా
త్రాళిప్రదర్శనంబున
భూలోకమునందు మొదటిపుస్తక మగుటః.

క॥ నాతండ్రి కనారతమును
జేతోముద మిచ్చినట్టి శిష్టచరిత్రం
బై తనరారుట మొదలగు
హేతువులంజేసి మనసు నీడ్చిన దగుటః.

క॥ దానికి నానేర్చిన వి
ద్యానిపుణతకొలందిఁ జేతు నాంధ్రంబున వ్యా
ఖ్యానము యథార్థసంవి
జ్ఞానవిధానముల నవ్యకళ లేర్పడఁగః.

అని ప్రతిసమయమునను నాతండ్రిని ధ్యానించుచుండుట నాసాహిత్యమునకు నాతండ్రియ యధిదేవత.

ఈవ్యాసమును బెజవాడలో నుపక్రమించితినిగాని నానాకారణ సంజనితమైన చిత్తవైకల్యముకతన తుదముట్టింపనేరనైతిని. ఈనెల 23 వ తేదిన బెజవాడ వదలి నాయల్లుఁడైన ఎగ్జిక్యూటివ్ ఇంజనీయర్ రామలింగముగారి ధవళేశ్వరములో గోదావరీతీరమున నుండు నింటికి వచ్చి చేరినతోడనే మనసు కొంతకుకొంత కుదిరి యెట్లో యిటు వ్రాసి ముగించితిని. దోషములు లోపములు మెండుగా నున్నట్లు నామనస్సు నన్ను బాధించెడిని. పాఠకుల యౌదార్యమే నాకు శరణ్యము.

ఈ గ్రంథముల నెత్తివ్రాసి, మూలములతో పోల్చిచూచి, చేయవలసిన దిద్దుబాటులు చేసి, సర్వవిధముల నిర్దుష్టములుగా నొనర్చి ముద్రణ కార్యభారమును జయప్రదముగా నిర్వహించి, అనతికాల

ములోన ప్రచురణస్థితికిఁ దెచ్చిన సుప్రసిద్ధపండితులును కవులును అయిన శ్రీ శేషాద్రిరమణకవులయొక్క. సాహాయ్య గౌరవమును శక్తికొలఁది బొగడఁగలనకాని అర్హతకొలఁది జేయఁజాలను. అట్టి విద్యావిశారదులు ఈకార్యమును సమర్థించుట నాతండ్రియొక్క సుకృత విశేషము కాబోలు! సంచితపుణ్యములు సఫలములు గాకపోనేర్చునా?

శ్రీ శేషాద్రిరమణకవులకు నాయొక్క ధన్యవాదములతోకృతజ్ఞతాభివందనములను నిండుమనస్సుతో సమర్పించుచున్నాను.

ధవళేశ్వరము,
26—4—27.

కట్టమంచి రామలింగారెడ్డి.

శ్రీ రా మ జ య ము.



శ్రీ

# భాగవతసారముక్తావళి

1 శా॥ శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై ♦ చింతించెదన్ లోక[1]ర
క్షైకారంభకు భక్తపాలనకళా♦సంరంభకున్ దానవో
ద్రేకస్తంభకుఁ గేళి[2]లోల విలస♦ద్దృగ్జాలసంభూత నా
నాకంజాతభవాండకుంభకు మహా♦నందాంగనాడింభకున్॥
ప్ర. 1

2 మ॥ హరికిం బట్టపురాణి పున్నెములపో♦ వర్థంపుఁ బెన్నిక్క చం
దురుతోఁబుట్టువు భారతీగిరిసుత ♦ ల్తోనాడు పూఁబోడి తా
మరలం దుండెడు ముద్దరాలు జగము ♦ ల్మన్నించునిల్లాలు భా
సురతన్ లేములువాపుతల్లి సిరి యి♦చ్చున్ నిత్యకల్యాణముల్॥
ప్ర. 11

3 ఉ॥ వాలినభక్తి మ్రొక్కెద న♦వారితతాండవకేళికిన్ దయా
శాలికి శూలికిన్ శిఖరి♦జాముఖపద్మమయూఖమాలికిన్
బాలశశాంకమౌళికిఁ గ♦పాలికి మన్మథగర్వపర్వతో
న్మూలికి నారదాదిముని♦ముఖ్యమనస్సరసీరుహాళికిన్॥ ప్ర. 2

4 ఉ॥ అమ్మలగన్న యమ్మ ముగు♦రమ్మలమూలపుటమ్మ చాల పె
ద్దమ్మ సురారులమ్మ కడు♦పాఱడిపుచ్చినయమ్మ తన్ను లో

1 రక్షాకారంభకు 2 కేళి లాలస

నమ్మిన వేల్పు[1]టమ్మలమ♦నంబుల నుండెడియమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యీవుత మ♦హత్త్వ కవిత్వ పటుత్వసంపదల్॥
ప్ర. 10

5 ఉ॥ ఆతతసేవఁ జేసెద స♦మస్త చరాచర భూతసృష్టివి
జ్ఞాతకు భారతీహృదయ♦సౌఖ్యవిధాతకు వేదరాశిని
ర్ణేతకు దేవతానికర♦నేతకుఁ గల్మషజేతకు న్నత
త్రాతకు ధాతకు న్నిఖిల♦తాపసలోక శుభప్రదాతకున్॥ ప్ర.3
6 ఉ॥ క్షోణి[2]తలంబు నెన్నుదురు ♦ సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీకచయ♦సుందరవేణికి రక్షితామర
శ్రేణికిఁ దోయజాతభవ♦చిత్తవశీకరణైకవాణికిన్
వాణికి నక్షదామ శుక♦వారిజ పుస్తక రమ్యపాణికిన్॥ ప్ర. 6
7 ఉ॥ ఆదర మొప్ప మ్రొక్కిడుదు ♦ నద్రిసుతాహృదయానురాగసం
పాదికి దోషభేదికిఁ బ్ర♦పన్నవినోదికి విఘ్నవల్లికా
చ్ఛేదికి మంజువాదికి న♦శేషజగజ్జననందవేదికిన్
మోదకఖాదికిన్ సమద♦మూషకసాదికి సుప్రసాదికిన్॥ ప్ర 5
8 క॥ వ్యాసుని భగవత్ప్రదసం
వాసుని నాగమపురాణ♦వరవిష్ణుకథా
వాసుని నిర్మలకవితా
భ్యాసుని పదపద్మయుగము ♦ భావింతు మదిన్॥ ష. 10
9 మ॥ సముఁడై యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై ♦ సన్న్యాసియైయొంటిబో
వ[3]మహాప్రీతి నోహోకుమారయనుచున్ ♦ వ్యాసుండుసీరంగవృ
క్షములుం దన్మయతం బ్రతిధ్వనులు స♦క్కంజేసె మున్నట్టి భూ
తమయుం గొల్చెద బాదరాయణిఁ దపో♦ధన్యాగ్రణిన్ ధీమణిన్
ప్ర. 55

10 క॥ నారాయణునకు నరునకు
భారతికిని మ్రొక్కి వ్యాసు ♦ పదములకు నమ
స్కారము సేసి వచింతు ను
దారగ్రంథంబు దళిత♦తనుబంధంబున్॥ ప్ర. 57

1 టన్నుల 2 తలంబునన్ నుదురు 3 మహాభీతి.

11 మ॥ లలితస్కంధము కృష్ణమూలము శుకా♦లాపాభిరామంబు మం
జులతాశోభితము న్సువర్ణ సుమన♦స్సుజ్ఞేయము న్సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమల♦వ్యాసాలవాలంబు నై
వెలయు న్భాగవతాఖ్యకల్పతరు వు♦ర్విన్సద్ద్విజశ్రేయమై. ప్ర. 22

12 ఆ॥ వె॥ వేదకల్పవృక్ష♦విగళితమై శుక
ముఖసుధాద్రవమున ♦ మొనసియున్న
భాగవతపురాణ♦ఫలరసాస్వాదన
పదవిఁ గనుఁడు రసిక♦భావవిదులు. ప్ర. 37

13 ఉ॥ ఎయ్యది కర్మబంధముల♦నెల్ల హరించు, విభూతికారణం
బెయ్యది, సన్మునీంద్రులకు ♦ నెల్లఁ బవిత్ర సమాశ్రయంబు, ము
న్నెయ్యది సర్వమంత్రముల ♦ నేలినదెయ్యది, మోక్షలక్ష్మికిం
పెయ్యది, దానిఁ బల్కెదసు♦హృద్యము భాగవతార్థమంత్రముల్.
ప. 14

14 సీ॥ శ్రీమంతమై ముని♦శ్రేష్ఠకృతంబైన
భాగవతంబు స♦ద్భక్తితోడ
వినఁగోరువారల ♦ విమలచిత్తంబులఁ
జెచ్చెర నీశుండు ♦ సిక్కుఁగాక
యితరశాస్త్రంబుల ♦ నీశుండు సిక్కునే
మంచివారలకు ని♦ర్మత్సరులకుఁ
గపటనిర్ముక్తులై ♦ కాంక్ష సేయక[1]యును
దగిలియుండుట మహా♦తత్త్వబుద్ధిఁ
తే॥ గీ॥ బరఁగ నధ్యాత్మికాదితా♦పత్రయంబు
నడఁచి పరమార్థభూతమై ♦ యధికసుఖద
మై సమస్తంబు గాకయు ♦ [2]నగుచు నుండు
వస్తు వెఱుఁగంగఁ దగు భాగ♦వతమునందు. ప్ర. 36

15 క॥ ఏకథలయందుఁ బుణ్య
శ్లోకుఁడు హరి సెప్పఁబడును ♦ సూరిజనముచే

---

1 యుండు 2 నయ్యు నుండు.

నాకథలు పుణ్యకథ లని
యాకర్ణింపుదురు పెద్ద♦ లతిహర్షమునన్. అ. 21

16 మ॥ హరినామస్తుతి సేయుకావ్యము సు♦వర్ణాంభోజహంసావళీ
సురుచిభ్రాజిత మైన మానససర♦స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరినామస్తుతి లేనికావ్యము విచి♦త్రార్థాన్వితంబయ్యు శ్రీ
కరమై యుండదయోగ్యదుర్మలినవ♦ త్కాకోలగర్తాకృతిన్. ప్ర.96

17 మ॥ అపశబ్దంబులఁగూడియున్ హరిచరి♦త్రాలాపముల్ సర్వపా
పపరిత్యాగము సేయుఁగావున హరిన్ ♦ భావించుచున్ బాడుచున్
జపముల్ సేయుచు వీనులన్ వినుచు న♦శ్రాంతంబుఁగీర్తించుచున్
దపసుల్ సాధులుధన్యులౌదురుగదా♦తత్త్వజ్ఞచింతింపుమా.ప్ర.97

18 తరల॥ సతతము న్సరసీరుహోదర♦సత్కథామృతపూరమున్
శ్రుతిపుటాంజలిచేత నిమ్మల ♦ జుర్రియుం దనివోదు భా
రతకథామిష మూని విష్ణుఁ బ♦రాశరప్రియసూతి స
న్మతినుతించినచోట సన్ముని♦నాథ!నామది నుబ్బుదున్.తృ. 186

19 ఉ॥ అన్యకథానులాపము ల♦హర్నిశము న్వినునట్టి సత్క్రియా
శూన్యములైన కర్ణముల ♦ సూరిజనస్తుత సర్వలోక స
మ్మాన్యములై తనర్చు హరి♦మంగళదివ్యకథామృతంబు సౌ
జన్యతఁ గ్రోలుమయ్య బుధ♦సత్తమ యే వివరించి చెప్పెదన్.
ద్వా. 115

20 చ॥ క్రమమున మింటికై యెగయుఁ♦గాక విహంగము మింటిదైన పా
రము గననేర్చునే హరిప♦రాక్రమ మోపినయంతగాక స
ర్వము వివరింప నెవ్వఁడు [1]ప్ర♦వర్తకుఁ డర్యములార? నాదుచి
త్తమునకు నెంతఁగానఁబడెఁ ♦ దప్పక చెప్పెద మీకునంతయున్.
ప్ర. 452

---

(1) ప్రవర్తకుఁడౌ మునులార బుద్ధి.

# జగదుత్పత్తి ప్రకరణము.

## ౧. మా య .



1 సీ॥ ఒక్కఁడై నిత్యుఁడై ♦ యెక్కడఁ గడలేక
సాదిది జన్మాదుల ♦ శూన్యుఁ డగుచు
సర్వంబునం దుండి ♦ సర్వంబుఁ దనయందు
నుండంగ సర్వాశ్ర♦యుం డనంగ
సూక్ష్మమై స్థూలమై ♦ సూక్ష్మాధికములకు
సామ్యమై స్వప్రకా♦శమున వెలిఁగి
యఖిలంబుఁ జూచుచు ♦ నఖిలప్రభావుఁడై
యఖిలంబుఁ దనయందు ♦ నడఁచికొనుచు
తే॥ గీ॥ నాత్మమాయాగుణంబుల ♦ నాత్మమయము
గాఁగ విశ్వంబుఁ దనసృష్టి ♦ [1]ఘనతఁ జెందఁ
జేయుచుండును సర్వసం♦జీవనుండు
రమణ విశ్వాత్ముఁడయిన నా♦రాయణుండు. ష. 465

2 క॥ వనజాక్ష యోగమాయా
జనితం బగు విశ్వజనన♦సంస్థానవినా
శనముల తెఱఁ [2]గెఱిఁగింపుదు
ననఘా విష్ణునిమహత్త్వ ♦ మభివర్ణింతున్. త్రి. 198

3 క॥ అగుణుం డగుపరమేశుఁడు
జగములఁ గల్పించుకొఱకుఁ ♦ జతురత మాయా
సగుణుం డగుఁ గావున హరి
భగవంతుం డనఁగఁ బరఁగె ♦ భవ్యచరిత్రా!. ద్వి. 101

4 సీ॥ అరయంగ నేమిటి♦యందు నీవిశ్వంబు
విదితమైయుండు నీ♦విశ్వమందు
నేది ప్రకాశించు ♦ నెప్పుడు నిట్టి స్వ
యంజ్యోతి నిత్యంబు ♦ నవ్యయంబు

---

1 ఘటనలొంద 2 గెఱిఁగించుచు.

నాకాశమునుఁ బోలి ♦ యవిరళవ్యాపక
మగు నాత్మతత్త్వంబు ♦ నధికమహిమఁ
దనరు పరబ్రహ్మ♦మగు ననిపల్కి యి
ట్లనియె నవిక్రియుం♦డైనవాఁడు
తే॥ గీ॥ నెవ్వఁ డాతఁడు దనయందు ♦ నెపుడు నాత్మ
కార్యకరణసమర్థంబు ♦ గాని భేద
బుద్ధిజనకంబు నాదగు ♦ భూరిమాయఁ
జేసి విశ్వంబు సత్యంబు♦గా సృజించె. చ. 720

5 సీ॥ అమ్మాయచేత నీ♦యఖిలంబు [1]సృజియించి
పాలించి పొలియించి ♦ పరమపురుషుఁ
డనఘాత్మ! దేశకా♦లావస్థలందును
నితరులయందు న♦హీనమైన
జ్ఞానస్వభావంబుఁ ♦ బూని యాప్రకృతితో
నెబ్బంగిఁ గలసెఁ దా ♦ నేకమయ్యుఁ
గోరి సమస్తశ♦రీరంబు లందును
జీవరూపమున వ♦సించియున్న
తే॥ గీ॥ [2]జీవునకు దుర్భరక్లేశ ♦ సిద్ధి యెట్టి
కర్మమున సంభవించెను ♦ గడఁగి నాదు
చిత్త మజ్ఞానదుర్గమ♦స్థితిఁ గలంగి
యధికఖేదంబు నొందెడు ♦ ననఘచరిత. తృ. 234

6 సీ॥ సకల జీవులకెల్లఁ ♦ బ్రకటదేహము నాత్మ
నాథుండు పరుఁడు నా♦నావిధైక
మత్యుపలక్షణ♦మహితుండు నగు భగ
వంతుండు సృష్టిపూ♦ర్వంబునందు
నాత్మీయమాయ ల♦యంబునొందిన విశ్వ
గర్భుఁడై తాన యొ♦క్కటి వెలుంగు

---

1 ద్రుంచిన శశ్వత్ప్రకాశుఁ డీశ్వరుఁడు పరుఁడు, ననఘాత్మ (2) జీవుని దగు విభూతిప్రసిద్ధి యేమి.

పరమాత్ముఁ డభవుం డు♦పదిష్ట యయ్యు వ
స్వాంతరపరిశూన్యుఁ ♦ డగుటఁజేసి
తే॥ గీ॥ దిష్ట గాకుండు మాయాప్ర♦ధానశక్తి
నతులచిచ్ఛక్తిగలవాఁడు ♦ నగుచుఁ దన్ను
లేనివానిఁగఁ జిత్తంబు♦లోనఁ దలఁచి
దిష్టయగు తనభువన ని♦ర్మాణవాంఛ. తృ. 199
7 తే॥గీ॥ బుద్ధిఁదోఁచిన నమ్మహా♦పురుషవరుఁడు
గార్యకారణరూపమై ♦ ఘనత కెక్కి
భూరిమాయాభిధానవి♦స్ఫురితశక్తి
వినుత కెక్కినయట్టి య♦విద్యయందు. తృ. 200
8 క॥ పురుషాకృతి నాత్మాంశ
స్ఫురణముగలశక్తి నిలిపి ♦ పురుషోత్తముఁ డీ
శ్వరుఁ డభవుం డజుఁడు నిజో
దరసంస్థితవిశ్వ మపుడు ♦ దగఁ బుట్టించెన్. తృ. 201
9 సీ॥ ధృతిఁబూని కాలచో♦దితము నవ్యక్తంబు
ప్రకృతియు ననుపేళ్ళ ♦ బరఁగు మాయ
వలన మహత్తత్త్వ ♦ మెలమిఁ బుట్టించె మా
యాంశకాలాదిగు♦ణాత్మకంబు
నైన మహత్తత్త్వ ♦ మచ్యుత దృగ్గోచ
రమగుచు విశ్వని ♦ ర్మాణవాంఛ
నందుటఁజేసి రూ♦పాంతరంబునఁ బొంది
నట్టి మహత్తత్త్వ ♦ మందు నోలిఁ
తే॥ గీ॥ గార్యకారణకర్త్రాత్మ♦కత్వమైన
మహితభూతేంద్రియక మనో♦మయ మనంగఁ
దగు నహంకారతత్త్వ ము♦త్పన్నమయ్యెఁ
గోరి సత్వరజస్తమో♦గుణక మగుచు. తృ. 202
10 సీ॥ చతురాత్మ సత్వర♦జస్తమోగుణములు
వరుస జనించెను ♦ వానివలన
మహదహంకారత♦న్మాత్రి నభోమరు
దనలజ్వాలావని ♦ మునిసుపర్వ

భూతగణాత్మక ♦ స్ఫురణ నీవిశ్వంబు
భిన్నరూపమున ను♦త్పన్నమయ్యె
దేవ! యీగతి భవ♦దీయమాయను జేసి
రూఢిఁ జతుర్విధ♦రూపమైన
తే॥ గీ॥ పురము నాత్మాంశమునఁ జెందు ♦ పురుషుఁ డింద్రి
యములచే విషయసుఖము♦లనుభవించు
మహిని మధుమక్షికాకృత♦మధువుఁబోలి
యతనిఁ బరవర్తియగు జీవుఁ ♦ డంద్రు మఱియు. చ. 723

11 సీ॥ జననుత సత్త్వర♦జస్తమో గుణమయ
మైన ప్రాకృతకార్య ♦ మగు శరీర
గతుఁడయ్యుఁ బురుషుండు ♦ గడఁగి ప్రాకృతములు
నగు సుఖదుఃఖమో♦హములవలనఁ
గర మనురక్తుండు ♦ గాఁడు వికారవి
హీనుఁడు త్రిగుణర♦హితుఁడు నగుచు
బలసి నిర్మలజల♦ప్రతిబింబితుండైన
దినకరుభంగి వ♦ర్తించు నట్టి
తే॥ గీ॥ యాత్మప్రకృతిగుణంబుల♦యందుఁ దగులు
వడి యహంకారమూఢుఁడై ♦ తొడరి యేనుఁ
గడఁగి నిఖిలంబునకు నెల్ల ♦ గర్తనని ప్ర
సంగవశతనుఁ బ్రకృతి దో♦షములఁ బొంది. తృ. 904

12 క॥ సురతిర్యఙ్మనుజస్థా
వరరూపములగుచుఁ గర్మ♦వాసనచేత
స్ఫురమైన మిశ్రయోనులఁ
దిరముగ జనియించి సంసృ♦తిం గైకొని తాన్. తృ. 905

13 క॥ పూని చరింపుచు విషయ
ధ్యానంబునఁజేసి స్వాప్ని♦కార్థాగమసం
ధానమురీతి నసత్పథ
మానసుఁడగుచున్ భ్రమించు ♦ మతిలోలుండై. తృ. 906

14 చ॥ పురుషుఁడు నిద్రవోఁ గలలఁ♦బొందుసమస్తసుఖంబు లాత్మసం
హారణశిరోవిఖండనము♦లాదిగ జీవునికిం బ్రబోధమం
దరయఁగఁ దోఁచుచున్నగతి ♦ నాదిఁ బరేశుఁడు బంధనాదుల
న్బొరయక తక్కుఁబెట్లనుచు ♦ బుద్ధిని సంశయ మందె దేనియున్.
తృ. 239

15 చ॥ లలితవిలోలనిర్మలజ♦లప్రతిబింబితపూర్ణచంద్రమం
డలము దదంబుచాలనవి♦డంబన హేతువు నొందియు న్వియ
త్తలమునఁ గంప మొందనివి♦ధంబున సర్వశరీరధర్మము
ల్గలిగి రమించు నీశునకుఁ♦గల్గఁగనేరవు కర్మబంధముల్. తృ. 241

16 వ॥ కావున జీవునకు నవిద్యామహిమంజేసి కర్మబంధనాదికంబు సం
ప్రాప్తం బగుంగాని సర్వభూతాంతర్యామి యైన ఈశ్వరునకుం
బ్రాప్తంబు గానేరదని వెండియు. తృ 242

17 చ॥ వినుము వితర్క[1]వాదములు ♦ విష్ణుని ఫుల్లసరోజపత్రనే
త్రుని ఘనమాయ నెప్పుడు వి♦రోధము సేయుఁ బరేశు నిత్యశో
భనయుతు బంధనాదికవి♦పద్దశలన్ గృపణత్వ[2]మెప్పుడే
ననయముఁబొందలేవువిభుఁ♦డాద్యుఁ డనంతుఁడునిత్యుఁడౌటచేన్
తృ. 237

18 మ॥ భువనశ్రేణి నమోఘలీలుఁడగుచున్ ♦ బుట్టించు రక్షించు సం
తవిధింజేయు మునుంగఁ డందు బహుభూ♦తవ్రాతమం దాత్మతం
త్రవిహారస్థితుఁడై షడింద్రియసమ♦స్త ప్రీతియున్ దవ్వులన్
దివిభంగింగొనుఁజిక్కఁడింద్రియములన్ ♦ద్రిప్పున్నిబంధించుచున్
ప్ర. 69

19 క॥ తెఱఁ గొప్ప నఖిలవిశ్వము
పురుషోత్తము[3] దేహమందుఁ ♦ బుట్టుం బెరుగున్
విరతిం బొందుచునుండుం
గర మర్థిన్ భూతభావి♦కాలములందున్. తృ. 344

20 తే॥ గీ॥ మెఱయ యంత్రమయంబైన ♦ మృగము భంగి
దారునిర్మితమైనట్టి ♦ తరణిపోల్కి

1 వాక్యములు 2 భావము న్ననయ 3 మాయచేత

శక్ర! [1]యెఱుఁగుము నిల భూత♦జాల మెల్ల
[2]దళితపంకేరుహాక్షుతం♦త్రంబుగాఁగ. ష. 416

21 క॥ ధరణిఁ జరాచరభూతము
లరయఁగ జనియించి యందె ♦ యడఁగినపగిదిన్
హరిచేఁ బుట్టినవిశ్వము
హరియందె లయంబు నొందు ♦ నది యెట్లన్నన్. చ. 957

22 క॥ పెనుపగు వర్షాకాలం
బున దిననాయకుని వలనఁ ♦ బొడమిన సలిలం
బనయముఁ గ్రమ్మఱ గ్రీష్మం
బున సూర్యునియందు [3]డిందు♦పోలికె మఱియున్. చ. 956

23 క॥ భూతగణంబులచేతనె
భూతగణంబులను మేఘ♦పుంజంబుల ని
ర్ధూతముగఁ జేయు ననిలుని
భాతినిఁ జరియింపఁజేసి ♦ పౌరుష మొప్పన్. చ. 725

24 తే॥ గీ॥ రూఢిఁ దత్తత్క్రియాలబ్ధ♦రూపుఁడవును
సుమహితస్ఫురదమిత తే♦జుఁడవు చండ
వేగుఁడవు నయి ఘనభుజా♦విపులమహిమ
విశ్వసంహార మర్థిఁ గా♦వింతు వీశ. చ. 76

25 మ॥ అనఘా! యొక్కఁడవయ్యు నాత్మకృతమా♦యాజాతసత్త్వాదిశ
క్తినికాయస్థితి నీజగజ్జననవృ♦ద్ధిక్షోభ హేతుప్రభా
వనిరూఢిం దగు దూర్ణనాభిగతి వి♦శ్వస్తుత్య! సర్వేశ! నీ
ఘనలీలామహిమార్ణవంబుఁ గడువం♦గా వచ్చునే యేరికిన్.
తృ. 756

26 క॥ తనమాయ లేక పరునకు
ఘనునకు నీశ్వరున కాత్మ♦కర్తకు హరికిన్
జనమూలకుఁ గర్మములకును
మనుజేశ్వర! కారణంబు ♦ మఱియును గలదే? న. 728

---

1 యెఱుఁగము యీభూత 2 ధవళ 3 జెందు.

27 సీ॥ హరియందు నాకాశ ♦ మాకాశమున వాయు
వనిలంబువలన హు♦తాశనుండు
హవ్యవాహనునందు ♦ నంబువు లుదకంబు
వలన వసుంధర ♦ గలిగె ధాత్రి 
వలన బహుప్రజా♦వళి యుద్భవం బయ్యె
నింతకు మూలమై ♦ యెసఁగునట్టి
నారాయణుఁడు చిదా♦నందస్వరూపకుం 
డవ్యయుఁ డజుఁడు న♦నంతుఁ డాద్యుఁ 
తే॥ గీ॥ డాదిమధ్యాంతశూన్యుం డ♦నాదినిధనుఁ
డతనివలనను సంభూత ♦ మైనయట్టి
సృష్టిహేతుప్రకార మీ♦క్షించి తెలియఁ
జాల రెంతటి మునులైన ♦ జనవరేణ్య! ద్వి.280

28 మ॥ ధరణీశోత్తమ! భూతసృష్టి నిటు సం♦స్థాపించి రక్షించు నా
హరికర్తృత్వము [1]నొల్లఁ డాత్మగత మా♦యారోపితం జేసి తా
నిరవద్యుండు నిరంజనుండు పరుఁడున్ ♦ నిష్కించనుం డాద్యుఁడున్
నిరపేక్షుండును నిష్కళంకుఁ డగుచున్ ♦ నిత్యత్వముం బొందెడిన్.
ద్వి. 282

29 తే॥ గీ॥ మహిమ దీపింపఁ గాలక♦ర్మస్వభావ
శక్తిసంయుక్తుఁడగు పరే♦శ్వరుని భూరి
యోగమాయావిజృంభణో♦ద్యోగ మెవ్వఁ
డెఱిఁగి నుతియింపఁగానోపు ♦ నిద్ధచరిత! తృ. 222

30 ఆ॥ వె॥ ఈశ్వరుండు విష్ణుఁ ♦ డెవ్వేళ నెవ్వని
నేమి సేయుఁ బురుషుఁ ♦ డేమి యెఱుఁగు
నతనిమాయలకు మ♦హాత్ములు విద్వాంసు
లడఁగియుండుచుందు ♦ రంధు లగుచు. ప్ర. 212

31 క॥ నీమాయఁ దెలియువారలె
తామరసాసన సురేంద్ర ♦ తాపసులైనన్

1 నొల్ల కాత్మ.

ధీమంతులు నిజభక్తి సు
ధామాధుర్యమునఁ బొదలు • ధన్యులుదక్కన్. ద. 631

32 మ॥ బలభిన్ముఖ్యదిశాధినాథవరులున్ • ఫాలాక్షుబ్రహ్మాదులున్
జలజాతాక్షపురందరాదిసురలున్ • జర్చించి నీమాయలన్
దెలియన్ లేరఁట నావశంబె తెలియన్ • [1]దీనార్తినిర్మూలయు
జ్జ్వలతేజోవిభవాతిసన్నుత గదా•చక్రాంబుజాద్యంకితా! ద్వా. 36

33 తే॥ గీ॥ జగము రక్షింప జీవులఁ•జంప మనుపఁ
కర్తవై సర్వమయుఁడవై • కానుపింతు
వెచట నీమాయఁ దెలియంగ • నెవ్వఁడోపు
విశ్వసన్నుత! విశ్వేశ! • వేదరూప! ద్వా. 35

34 సీ. అదిగాన నిజరూప • మనరాదు కలవంటి
దై బహువిధదుఃఖ•మై విహీన
సంజ్ఞానమై యున్న•జగము సత్సుఖబోధ
తనుఁడవై తుదిలేక • [2]తనరు దీవు
మాయచేఁ బుట్టుచు • మనుచు లేకుండుచు
నున్నచందంబున • నుండుచుండు
వొకఁడ వాత్మఁడ వితరోపాధిశూన్యుండ
వాద్యుండ వమృతుండ • వక్షరుండ
ఆ॥ వె॥ వద్వయుండవును స్వ•యంజ్యోతి వాపూర్ణుఁ
డవు పురాణపురుషుఁ•డవు నితాంత
సౌఖ్యనిధివి నిత్య•సత్యమూర్తివి నిరం
జనుఁడ వీవు తలఁపఁ•జనునె నిన్ను. ద. 568

35 సీ॥ తలకొని పంచభూ•తపరివర్తకమైన
భూరిమాయాగుణ•స్ఫురణఁ జిక్కు
వడక లోకంబులు • భవదీయజఠరంబు
లో నిల్పి ఘనసమా•లోల చటుల

---

1 దీనార్తిమందార యుజ్జ్వలపరకేరుహాలోచనానుతిలసచ్చక్రాసిశంఖాంకితా.
2 తనరునీదు.

సర్వంకషోర్మిభీ♦షణ వార్ధి నడుమను
ఫణిరాజభోగత♦ల్పంబునందు
యోగనిద్రారతి♦నుండంగ నొకకొంత
కాలంబు చనఁగ మే♦ల్కనినవేళ
తే॥ గీ॥ నలఘుభవదీయనాభితో♦యజమువలనఁ
గడఁగి ముల్లోకముల సోప♦కరణములుగఁ
బుట్టఁజేసితి వతులవి♦భూతి మెఱసి
పుండరీకాక్ష! సంతత♦భువనరక్ష! త్రి. 310

36 సీ॥ పంకజోదర! నీ వ♦పారకర్ముండవు
భవదీయ[1]కర్మాబ్ధి♦పార మరయ
నెఱఁగెద నని మది♦నిశ్చయించినవాఁడు
పరికింపఁగా మతి♦భ్రష్టుగాక
విజ్ఞానియే చూడ ♦ విశ్వంబు నీయోగ
మాయాపయోనిధి♦మగ్న మౌటఁ
దెలిసియుఁ దమబుద్ధిఁ ♦ దెలియని మూఢుల
నేమన నఖిలలో♦కేశ్వరేశ!
తే॥ గీ॥ దాసజనకోటి కతిసౌఖ్య♦దాయకములు
వితతకరుణాసుధాతరం♦గితము లైన
నీకటాక్షేక్షణములచే ♦ నెఱయ మమ్ముఁ
జూచి సుఖులను జేయవే ♦ సుభగచరిత! త్రి. 438

37 మ॥ మది నూహింపఁగ యోగివర్యులు భవ♦న్మాయాలతాబద్ధులై
యిదమిత్థం బనలేరు [2]తామసధృతి ♦ న్నేపారు మాబోఁటిదు
ర్మదు లేరీతి నెఱుంగఁ బోలుదురు న♦మ్యగ్ధ్యానధీయుక్తి నీ
పదముల్చేరెడితో్రవఁజూపి భవకూ♦పం బుద్ధరింపంప వే!ద 1148

38 మ॥ అరవిందోదర తావకీనఘనమా♦యా మోహితస్వాంతులై
పరమంబైన భవన్మహామహిమము ♦ న్బాటించి కానంగ నో
పరు బ్రహ్మాదిశరీరు లజ్ఞులయి యో♦పద్మాక్ష! భక్తారిసం
హారణాలోకన! నన్నుఁగావఁదగు నిత్యానందసంధాయివై ॰చ॰ 177

---

1 కర్మముల్ పార మెయిద 2 తామసులమై యేపారు 3 శరీరధారులును నో,

39 చ॥ హరి భవదీయమాయ నన • యంబును జెందిన నేము నిచ్చలుం
గర మనురక్తి[1]నేది తుద • గా భవకర్ములమై ధరిత్రిపైఁ
దిరుగుదు మంతదాఁక భవ • దీయజనంబులతోడి సంగతి
స్థిరమతిజన్మజన్మములకున్నమకూరఁగఁ జేయుమాధవా! చ. 928

40 క॥ హరిదాసుల మిత్రత్వము
మురరిపుకథ లెన్ని గొనుచు • మోదముతోడన్
భరితాశ్రుపులకితుండై
పురుషుఁడు హరిమాయఁ గెల్చు • భూపవరేణ్యా! ఏ. 55

41 క॥ వనజాక్షుమహిమ నిత్యము
వినుతించుచు నోరులువొగడ • వినుచు న్మదిలో
ననుమోదించుచు నుండెడు
జనములు [2]దన్మాయవశతఁ • జనరు నరేంద్రా! ద్వి. 217

42 మ॥ అనఘా వీరల నెన్న నేమిటికిఁ ది • ర్యగ్జంతుసంతానప
క్షినిశాటాటవికాఘజీవనివహ • స్త్రీశూద్రహూణాదులై
నను నారాయణ భక్తియోగమహితా • నందాత్ములై రేని వా
రనయంబుం దరియింతు రవ్విభునిమా • యావై భవవాంభోనిధిన్
ద్వి. 207

43 చ॥ ఇతరముమాని తన్ను మది • నెంతయు నమ్మి భజించువారి నా
శ్రితజనసేవితాంఘ్రిసర • సీరుహుఁడైన సరోజనాభుఁ డం
చితదయతోడ నిష్కపట • చిత్తమునం గరుణించు నట్టివా
రతులదురంతమైన తనరు • నవ్విభుమాయఁ దరింతు రెప్పుడున్.
ద్వి. 204

44 ఉ॥ ఇంచుకమాయలేక మది • నెప్పుడుఁ బాయనిభక్తితోడ వ
ర్తించుచు నెవ్వఁడేని హరి • దివ్యపదాంబుజగంధరాశి సే
వించు నతం డెఱుంగు నర • విందభవాదులకైన దుర్లభో
దంచితమైనయాహరియు • దారమహాద్భుతకర్మమార్గముల్. ప్ర. 71

45 తే॥గీ॥ ఘోరసంసారసాగరో • త్తారణంబు
ధీయుతజ్ఞానయోగహృ • ద్ధ్యేయవస్తు

1 సేఁటి 2 దన్మోహ

వగుచుఁ జెలువొందు నీచరణాంబుజాత
యుగళములు మామనంబులఁ దగులనీవె. ద. 1074

46 క॥ జననస్థితివిలయంబుల
కనయంబును హేతుభూతమగు మాయాలీ
లను జెంది నటన [1]సలిపెడు
ఘనఘనాత్మక! నీకొనర్తు నభివందనముల్. తృ. 304

47 ఉ॥ ఏపరమేశ్వరుం డగము లిన్నిటిఁ గప్పినమాయఁ గప్పఁగా
నోపక పారతంత్ర్యమున నుండు మహాత్మక ! యిట్టి నీకు ను
ద్దీపితభద్రమూర్తికి సుధీజనరక్షణవర్తికిం దనూ
తాపమువాయ మ్రొక్కెద నుదారతపోధనచక్రవర్తికిన్. ద.959

48 మ॥ పరుఁడై యీశ్వరుఁడై మహామహిముఁడై ప్రాదుర్భవస్థానసం
హారణక్రీడనుఁడై త్రిశక్తియుతుఁడై యంతర్గతజ్యోతియై
పరమేష్ఠిప్రముఖామరాధిపులకున్ బ్రాపింపరాకుండు దు
స్తరమార్గంబునఁ దేజరిల్లుహరికిం దత్త్వార్థినై మ్రొక్కెదన్. ద్వి.58

49 ఉ॥ భూరిమదీయమోహతమముం బెడఁబాప సమర్థు లన్యు లె
వ్వారలు నీవకాక నిరవద్య నిరంజన నిర్వికార సం
సారలతాలవిత్ర బుధసత్తమ సర్వశరణ్య ధర్మవి
స్తారక సర్వలోకశుభదాయక నిత్యవిభూతినాయకా! తృ.870

---

౨ కాలము.

1 సీ॥ ఆద్యంత శూన్యంబు [2]నవ్యయంబై తగు
తత్త్వమింతకు నుపాదానమగుట
గుణవిషయములు గై కొని కాలమును మహా
దాదిభూతములు దన్నాశ్రయింపఁ

---

1 సలిపితి ఘనఘా. 2 నవ్యయంబై.

గాలానురూపంబుఁ ♦ గైకొని యీశుండు
దనలీలకై తనుఁ ♦ దా సృజించెఁ
గర మొప్ప నఖిలలో♦కములందుఁ దానుండు
దనలోన నఖిలంబుఁ ♦ దనరుచుండుఁ
తే॥ గీ॥ గాన విశ్వమ్మునకుఁ గార్య♦కారణములు
దాన యమ్మహాపురుషుని ♦ తనువువలనఁ
బాసి విశ్వంబు వెలియై ప్ర♦భాస మొందె
మానితాచార! యీవర్త♦మానసృష్టి. తృ. 343

2 సీ॥ దీపింపఁ గాలస్వ♦రూపుఁడై నట్టి ప
ద్మాక్షుఁ డనంతుఁ డ♦నాదిపురుషుఁ
డఖిలవిశ్వాత్మకుఁ ♦ డగుణీశునకుఁ బర
మాణ్వాదియుగపరా♦ర్థాంత మగుచు
జరుగు నీకాలంబు ♦ చర్చింప నొక్కని
మేషకాలంబయి ♦ మెలఁగుచుండుఁ
గాన నీశ్వరునకుఁ ♦ గర్త గాఁజాల ది
క్కాలంబు విను మది♦గాక దేహ
తే॥ గీ॥ మందిరార్థాదికర్మాభి♦మానశీలు
రైనవారికి నాశ్రయం ♦ బగుటఁజేసి
యరయ హరి దద్గుణవ్యతి♦కరుఁడుగానఁ
గాల మమ్మేటి కెన్నఁడుఁ ♦ గర్తగాదు. తృ. 363

3 వ॥ మఱియు షోడశవికారయుక్తంబై పృథివ్యాదిపంచభూత[1]పరివృతంబును దశావరణంబులంగలిగి పంచాశత్కోటి విస్తీర్ణంబై బ్రహ్మాండకోశంబు దనర్చుచుండు. తృ. 364

4 చ॥ హరి పరమాణురూపమున ♦ నందువసించి విరాజమానుఁడై
సరివెలుఁగొందు నిమ్ములన♦సంఖ్యములైన మహాండకోశముల్
నెరి దనయందుడింద నవ♦నీరజనేత్రుఁ డనంతుఁ డాద్యుఁ డ
క్షరుఁడు పరాపరుం డఖిల♦కారణకారణుఁ డప్రమేయుఁడై. తృ. 365

1 పరివృతంబై.

5 ఉ॥ వాయువశంబులై యెగసి ♦ వారిధరంబులు మింటఁగూడుచుం
బాయుచునుండుకైవడిఁ బ్ర♦పంచము సర్వము గాలతంత్రమై
పాయుచుఁగూడుచుండు నొక♦భంగిఁ జరింపదు కాల మన్నియుం
జేయుచునుండుఁ గాలము వి♦చిత్రము దుస్తర మెట్టివారికిన్.
ప్ర. 210

6 క॥ కాలము ప్రబలులకును బలి
గాలాత్ముం డీశ్వరుం డ♦గణ్యుఁడు జనుల
న్గాలవశులఁగాఁ జేయును
గాలము గడువంగలేరు ♦ ఘను లెవ్వారున్. ద. 1646

7 క॥ లోకజనస్థితిలయములు
గైకొని చేయుదువు త్రిగుణ♦కలితుఁడవై కా
లాకారమున నమోఘ
శ్రీకలితుఁడవగుచు నిచ్చఁ♦జెందక యీశా! ద. 685

8 క॥ చతురత నీక్షితి నేలియు
మతిమోహము విడువలేక ♦ మానవనాథు
ల్వతతము దమ కీకాలం
బతిచంచలమగుట నెఱుఁగ♦రయ్య మహాత్మా! ద్వా. 5

9 గీ॥ ఈజగంబేలు తొల్లిటి ♦రాజవరులు
కాలవశమున నాయువు ♦ ల్గోలుపోయి
నామమాత్రావశిష్టులై ♦నారు గాన
[1]నుంపవలవదు మమతను ♦ బెంపుతోడ. ద్వా. 17

10 క॥ బాలాజనశాలాధన
లీలావనముఖ్యవిభవ♦లీనమనీషా
[2]లాలసులగు మానవులను
గాలము వంచించు దురవ♦గాహము సుమతీ ప్ర. 308

11మత్త॥చూడ నీజగమంతయు న్వెసఁ♦జుట్టి పట్టుక లీల నే
జోడులేక రయంబునం[3]గుడి ♦ చుట్టినట్టి స్వతంత్రముం

1 చెప్పవలదు మమతను నెచ్చటఁనృపాల 2 లోలాకులమానసులను 3 సుడి

గూడియుండిన కాలచక్రిముఁ ♦ గోరిచూడనివారి కే
జాడఁగల్గును గర్మసంగతిఁ ♦ జారుమోక్షపదం బిలన్. ష.236

12 క॥ ఎందునుగాలము నిజమని
పందతనంబునను బుద్ధిఁ ♦ బాయక ఘనులై
యెందాఁక బుద్ధి నెగడెడి
నందాఁక జరింపవలయు ♦ నాత్మబలమునన్. ద.36

13 సీ॥ దేవ జగన్మయ ♦ దేవేశ జగదీశ
కాల[1]జగదూర్ధ్వ♦కస్వరూప
యఖిలభూతములకు ♦ నాత్మహేతువునైన
యాదియీశ్వరుఁడ వా♦ద్యంతములకు
మధ్యంబు[2]బయలును ♦ మఱి లోపలయు లేక
పూర్ణమై యమృతమై ♦ భూరిసత్య
మానందచిన్మాత్ర ♦ మవికార మాద్య మ
నన్య మశోకంబు ♦ [3]నఖిలగుణము
తే॥ గీ॥ సంభవస్థితిలయముల ♦ సంగరహిత
మైనబ్రహ్మంబు నీవని ♦ యంఘ్రియుగము
నుభయసంగవిస్పృష్టులై ♦ యున్నమునులు
గోరి కైవల్యకాములై ♦ కొల్తు రెపుడు. అ. 388

14 మ॥ పురుషాధీశ! భవత్పదాబ్జయుగళీ♦పూజాదికర్మక్రియా
పరితం జెందని మూఢచిత్తునిఁ బశు♦ప్రాయు న్మనుష్యాధము
న్జరయు న్నంతము నొందఁజేయు నతిద♦క్షుంబైన కాలంబు ద
ద్గురుకాలాత్ముఁడవై నసీకుమదిసం♦తోషంబున న్ప్రొక్కెదన్. త్రృ.307

3. కర్మము.

1 సీ॥ జనులెల్ల నర్థవాం♦ఛలఁజేసి యత్యంత
మూఢులై యైహికం♦బులు మనంబు
లందులఁ గోరుదు ♦ రల్పసౌఖ్యములకు
నన్యోన్యవైరంబు ♦ లంద దుఃఖ

(1) జగద్వ్యాపక (2) బహియును (3) నగుణ మఖిల

ములఁబొందుదురు[1]గాన ♦ నలయక గురుఁడైన
వాఁడు మాయామోహ♦వశుఁడు నెంత
జడుఁడునైనట్టి యా♦జంతువునందును
దయగల్గి మిక్కిలి ♦ ధర్మబుద్ధిఁ
ఆ॥ వె॥ గన్నులున్నవాఁడు ♦ గానివానికిఁ
దెరువుఁ జూపినట్లు ♦ తెలియఁబలికి
యతులమగుచు దివ్య♦మైన యామోక్షమా
ర్గంబుఁ జూపవలయు ♦ రమణతోడ. ప్ర. 71

2 సీ॥ పావకశిఖలచే ♦ భాండంబు దాఁదప్త
మగుఁ దప్తఘటముచే ♦ నందునున్న
జలము దపించు నా♦జలముచేఁ దండులం
బులు దప్తమొంది య♦ప్పుడు విశిష్ట
మైన యన్నంబగు ♦ నాచందమునను దా
దేహేంద్రియంబులఁ ♦ దెలివితోడ
నాశ్రయించుకయున్న ♦ యట్టిజీవునకు దే
హంబునఁ బ్రాణేంద్రి♦యాదికమున
ఆ॥వె॥ జరుగుచుండు నిట్లు ♦ సంసారఘట[2]వృత్తి
దుండునైనరాజు ♦ దుష్టమైన
కర్మములకుఁ బాసి ♦ కంజాక్షుపదసేవఁ
జేసెనేని భవముఁ ♦ జెందకుండు. ప్ర. 147

3 క॥ హరి నరులకెల్లఁ బూజ్యుఁడు
హరి లీలామనుజుఁడును గు♦ణాతీతుండై
పరగిన భవకర్మంబులఁ
బొరయండఁట హరికిఁ గర్మ♦ములు లీల లగుఁ. తృ. 74

4 క॥ విను జీవుని చిత్తము దా
ఘనభవబంధాపవర్గ♦కారణ మది యే

(1) గాన మునుకొని (2) శిక్ష రక్షకుండునైనరాజుదుష్ట

చినఁ ద్రిగుణాసక్తం బయి
నను సంసృతిబంధకార♦ణంబగు మరియున్. తృ. 373

5 తే॥గీ॥ కోరి కర్మ్మంబు నడపెడు♦వారి కెల్లఁ
గలితశుభములు నశుభము ♦ ల్గలుగుచుండు
నరయఁగా దేహి గుణసంగి ♦ యైనయపుడె
పూని కర్మ్మంబు సేయక ♦ మానరాదు. ష. 86

6 క॥ కర్మ్మములు మేలు [1]నిచ్చెడు
కర్మ్మములు కీడు నిచ్చు ♦ కర్త్తలు దమకున్
గర్మ్మములు బ్రహ్మకైనను
గర్మ్మగుఁడై పరులఁ దడవఁ♦గా నేమిటికిన్. ద. 32

7 క॥ పురుషుఁడు నిజప్రకాశతఁ
బరఁగియు నలఘుఁడు పరుండు ♦ భగవంతుండున్
గురుఁ డగు నయ్యాత్మను దగఁ
బరువడి నెఱుఁగంగలేక ♦ ప్రకృతిగుణములన్. చ. 856

8 క॥ విను మెపుడు దగుల నప్పుడు
నొనరంగ గుణాభిమాని♦యును గర్మ్మవశుం
డనఁదగు నాపురుషుఁడు దా
ఘనమగు త్రైగుణ్యకర్మ్మ♦కలితుం డగుచున్. చ. 857

9 సీ॥ ధృతినొప్పుచున్న సా♦త్త్విక కర్మ్మమునను బ్ర
కాశభూయిష్ఠలో♦కముల భూరి
రాజసప్రకటక♦ర్మ్మమున దుఃఖోదర్క
లోలక్రియాయాస♦లోకములను
గైకొని తామస♦కర్మ్మంబునను దమ
శ్శోకమోహోత్కట♦లోకములను
[2]బొందుచుఁ బుంస్త్రీన♦పుంసకమూర్తుల
దేవతిర్యఙ్మర్త్య ♦ భావములను
తే॥ గీ॥ గలుగుఁ గర్మ్మానుగుణములు♦గాఁగ జగతిఁ
బుట్టిచచ్చుచుఁ గ్రిమ్మఱుఁ♦బుట్టునట్లు

1 మేలునిచ్చును 2 గడఁకబొందుచుఁ ద్రిలింగస్వరూపములను

దవిరి కామాశయుండైన ♦ దేహి యెప్పు
[1]డున్నతోన్నత పదవుల ♦ నొందుచుండు. చ. 858

10 సీ॥ తివిరి యప్పురుషుండు ♦ దేహంబునను జేసి
యనయంబుఁ బెక్కు దే♦హాంతరముల
నంగీకరించుచు ♦ నది విసర్జించుచు
సుఖదుఃఖభయమోహ♦శోకములను
[2]బురుషుండు దద్దేహ♦మునసె బొందుచునుండు
నది యెట్టులన్నను ♦ నగ్రభాగ
తృణమూఁది మఱిపూర్వ♦తృణపరిత్యాగంబుఁ
గావించు తృణజలూ♦కయును బోలి

ఆ॥వె॥ జీవుఁ డవనిఁ గొంత ♦ జీవించి మ్రియమాణుఁ
డగుచునుండ దేహ ♦ మర్థిఁజెంది
కాని పూర్వమైన♦కాయంబు విడువఁడు
గాన మనమె జన్మ♦కారణంబు. చ. 890

11 తరల॥ నరవరోత్తమ ! యట్లుగాన మ♦నంబె జీవులకెల్ల సం
సరణకారణ మట్టికర్మవ♦శంబున న్సకలేంద్రియా
చరణుఁడౌట నవిద్యగల్గును ♦ సంతతంబు నవిద్యచేఁ
బరగుటన్బహుదేహకర్మని♦బంధము ల్గలుగుంజుమీ. చ.891

12 చ॥ గొనకొని యిట్టిదుఃఖముల♦కుం బ్రతికారము మానవేంద్ర!క
ల్గిన విను తత్ప్రతిక్రియ న♦కించనవృత్తి జనుండు మస్తకం
బున నిడు మోఁపు మూఁపునను♦బూనినఁదద్భరదుఃఖమాత్మఁబా
యనిగతి జీవుఁడుం ద్రివిధ♦మైతగు దుఃఖముఁబాయఁడెన్నఁడున్.
చ. 861

13 చ॥ సుమహిత శుద్ధసత్త్వగుణ♦శోభితము న్సరసీరుహోదరో
త్తమగుణచింతనాపరము ♦ ధన్యమునైన మనంబునందు భూ
రమణసుధాంశునందును బ♦రాగమున న్దివిఁదోఁచు రాహుచం
దమునను గోచరంబగు ను♦దారత నీ యఖిలప్రపంచమున్.
చ. 888

1 డున్నతానతపదముల 2 పొలుపొందు తద్దేహములసె

14 క॥ కామక్రోధాదులు దా
భూమీశ్వర! కర్మబంధ♦ములు మఱియును జే
తోమూలము లగుటను దా
నీమహిలో మనము నమ్మ♦రెప్పుడు పెద్దల్. ప్ర 86

15 క॥ ఒత్తికొనుచు రానీఁ జన
దెత్తినరోగముల రిపుల ♦ నిందిర్యముల ను
త్పత్తిసమయములఁ జెఱుపక
మెత్తనగా రాదు రాదు♦మీఁద జయంబుల్. ద. 167

16 ఉ॥ కావునఁ గాలకింకరవి♦కారముఁ గానకమున్న మృత్యుదు
[1]ర్భావనచిత్తముం జెడుగు♦పాటుగఁ జేయకమున్న మేనిలో
జీవము వెల్గుచుండి తన♦చెల్వముఁ దప్పకమున్నమున్నగాఁ
భావనచిత్తుఁడై యఘముఁ♦బాయఁ దెలంగొనరింపఁగాఁదగున్.
ష. 44

17 చ॥ తపమున బ్రహ్మచర్యమున ♦ దానములన్ శమసద్దమంబులన్
జపముల సత్యశౌచముల ♦ సన్నియమాదియమంబులన్ గృపా
నిపుణులు ధర్మవర్తనులు ♦ నిక్కము హృత్తనువాక్యజంపుఁబా
పపుగుదిఁదుంతు రగ్నిశత♦పర్వవనంబుల నేర్చుకై వడిన్. ష. 50

18 ఆ॥ వె॥ జలఘటాదులందుఁ ♦ జంద్రసూర్యాదులుఁ
గానఁబడుచు గాలిఁ ♦ గదలుభంగి
నాత్మకర్మనిర్మి♦తాంగంబులను బ్రాణి
గదలుచుండు రాగ♦కలితుఁ డగుచు, ద. 31

19 సీ॥ భువి విషయాకృష్ట♦భూతంబులైన యిం
ద్రియములచేతను ♦ దివిరి మనము
దగ విషయాసక్తిఁ♦దగిలి యాంతరమైన
మహితవిచారసా♦మర్థ్యమెల్ల

1 భావము చిత్తముం బెగడుపాటుగఁజెందక. బెగడు (పా) నెడగు

1శరకుశ స్తంబక♦జాలంబు హ్రదతోయ
ములు గోలుగతిఁ గ్రమం♦బున హరించు
నీరీతి నంతర్వి♦చారసామర్థ్యంబు
నపహృతంబైన పూ♦ర్వాపరాను

తే॥ గీ॥ మేయసంధానురూపసం♦స్మృతి నశించు
నది నశించిన విజ్ఞాన ♦ మంతఁ దొలఁగు
నట్టివిజ్ఞాననాశంబు ♦ నార్యజనులు
స్వాత్మ కది సకలాపహ్న♦వం బటండ్రు. చ.623

20 క॥ ఎందాఁక నాత్మ దేహము
నొందెడు నందాఁక కర్మ♦యోగము లటపైఁ
జెందవు మాయాయోగ
స్పందితులై రిత్తజాలిఁ ♦ బడ నేమిటికిన్. స. 54

21 ఆ॥ వె॥ అరయఁ గర్మరూప ♦ మగు నవిద్యాజన్మ
మైన హృదయబం♦ధనాదిలతల
నపరిమత్తయోగ♦మనుశిమహాసురియచేఁ
దెంపవలయు నంతఁ♦దెంపుతోడ. ప్ర. 69

22 ఆ॥ వె॥ ఒనర నిట్లు యోగ♦యుక్తుండు గురుఁడైన
3భూపుఁడైన శిష్య♦పుత్రవరుల
యోగమతులఁ జేయ♦నొప్పుగావలయును
గర్మపరులఁ జేయఁ ♦ గాదు కాదు. పం.70

23 క॥ కర్మము కర్మము చేతను
నిర్మూలముగాదు తెలియ♦నేరక తానే
కర్మముఁ జేసినఁ దత్ప్రతి
కర్మం బొనరింపవలయుఁ ♦ గలుషవిదూరా! ప. 48

24 సీ॥ సంసార మిది బుద్ధి♦సాధ్యము గుణకర్మ
గణబద్ధ మజ్ఞాన♦కారణంబు
కలవంటి దింతియ♦కాని నిక్కముగాదు
సర్వార్థములు మన♦స్సంభవములు

(1) శరకుశాదిస్తంబజాలంబు (పా) శకుశకుశీ రాదిజాలంబు
(2) మహచ్ఛురిక చే (3)నరపతైన శిష్యవరుల నెల్ల

స్వప్న జాగరములు ♦ సమములు గుణశూన్యుఁ
డగుపరమునికి గు♦ణాశ్రయమున
భవవినాశంబులు ♦ పాటిల్లిన ట్లుండు
పట్టిచూచినలేవు ♦ బాలురార

తే॥ గీ॥ కడఁగి త్రిగుణాత్మకములైన♦కర్మములకు
జనకమైవచ్చు నజ్ఞాన♦సముదయమును
ఘనతరజ్ఞానవహ్నిచేఁ ♦ గాల్చిపుచ్చి
కర్మవిరహితులై హరిఁ♦గనుట మేలు. స.238

25 క॥ పాలింపుము శేముషి ను
న్మూలింపుము కర్మబంధ♦ముల సమదృష్టిం
జాలింపుము సంసారముఁ
గీలింపుము హృదయమందుఁ ♦ గేశవభక్తిన్. స.268

26 మ॥ [1]అరుదానభ్రితమఃప్రభల్మనునభం♦బం దొప్పుగాఁదోఁచి[2]యు
న్మరలం జూడఁగ నందె లేనిగతి బ్ర♦హ్మంబందు నీశక్తులున్
బరికింపన్ ద్రిగుణప్రవాహమున ను♦త్పన్నంబులై క్రిమ్మఱన్
విరతింబొందుచునుండుఁగావున హరి ♦ న్విష్ణు న్భజింపందగున్.
చ. 958

27 చ॥ విను మదిగాన భూవర య♦విద్య లయించుటకై రమాపతి
న్ఘనజననస్థితిప్రళయ♦కారణభూతునిఁ బద్మపత్రలో
చనుఁ బరమేశు నీశ్వరుని ♦ సర్వజగంబు దదాత్మకంబుగాఁ
గనుఁగొనుచుం దదీయపద♦కంజము లర్థి భజింపుమెప్పుడున్.
చ. 892

28 చ॥ ఘనపురుషార్థభూత మనఁ♦గాఁదగు నాత్మకు నేనిమిత్తమై
యొనర ననర్థహేతువన ♦ నూల్కొనుసంసృతి సంభవించి న
ట్లనయముఁ దన్నిమిత్తపరి♦హారక మర్థి జగద్గురుండు నా
దనరిన వాసుదేవపద♦తామరసస్ఫుటభక్తి యూరయన్. చ.865

---

1 అరయన్నభ్రితమఃప్రకాశల 2 క్రిమ్మరనీయంద

29 సీ॥ వసుమతీనాథ! యెవ్వని పాదపద్మప
లాశవిలాసస ♦ ల్లలితభక్తి
సంస్మరణంబుచే ♦ సజ్జనప్రకరంబు
ఘనకర్మసంచయ ♦ గ్రథితమగు న
హంకార మను హృద ♦ యగ్రంథిఁ[1] జేరరు
వివరింప నిట్లు ని ♦ ర్విషయమతులు
మహి నిరుద్ధేంద్రియ ♦ మార్గులు నైనట్టి
యతులకుఁ జేరంగ ♦ నలవిగాని
తే॥ గీ॥ యట్టిపరమేశుఁ గేశవు ♦ నాదిపురుషు
వాసుదేవుని భువనపా ♦ వనచరిత్రు
నర్థి శరణంబుగాఁ దత్ప ♦ దాంబుజములు
భక్తి సేవింపు గుణసాంద్ర! ♦ పార్థివేంద్ర! చ. 629

30 మ॥ అనఘా! మాధవ!నీవు మావలెనె క ♦ ర్మారంభివై యుండియున్
విను తత్కర్మఫలంబు బొంద వితరు ♦ ల్విశ్వంబున న్ఖ్యాతికై
యనయంబు న్భజియించు నిందర[2]గరం ♦ బర్థి న్నినుం జేరఁ గై
కొన వేమందుము నీచరిత్రమునకు ♦ న్గోవింద! పద్మోదరా!
చ. 185

31 మ॥ తమలోఁబుట్టు నవిద్యఁ గప్పికొనఁగ ♦ న్దనూమలసంసారవి
భ్రములై కొందఱు దేలుచున్ గలఁచుచున్ ♦ బల్వెంటలెంద్రైన యో
గమునందే పరమేశుఁ గొల్చి ఘనులై ♦ కైవల్యసంప్రాప్తులై
ప్రమదం బందెద రట్టినీవు గరుణన్ ♦ బాలింపు మ మ్మీశ్వరా!.
అ. 728

32 శా॥ ఏవేళం గృపఁజూచు నెన్నఁడు హరి ♦ న్వీక్షింతునం చాత్ముఁడై
నీవెంట న్బడి తొంటికర్మచయము ♦ న్నిర్మూలముంజేయుచు
న్నీవాఁడై తనువాఙ్మనోగతుల ని ♦ న్సేవించువిన్నాణివో
కైవల్యాధిప! లక్ష్మి నుద్ధవడిఁదాఁ ♦ గైకొన్నవాఁడీశ్వరా. ద.556

33 చ॥ భరితనిదాఘతప్తుఁడగు ♦ పాంథుఁడు శీతలవారిఁ గ్రుంకి దు
ష్కరమగుతాపముం దొరఁగు ♦ కైవడి సంసరణోగ్రతాపము

1 చేఱతురు 2 మిముఁన్నర్థిన్నసర.

స్వైరవునఁ బాయుచుండుదురు ♦ నిన్ను భజించుమహాత్మకుల్జరా
మరణమనోగుణంబులఁ గ్ర♦మంబునఁ బాయుట సెప్పనేటికిన్.
ద. 1209

34 క॥ మంగళహారికీర్తిమహా
గంగామృత మించుకైనఁ ♦ గర్ణాంజలుల
న్సంగతము సేసి [1]త్రావఁ దొ
లంగును గర్మంబు లా[2]వి♦లం బగుచు నృపా!. న. 782

35 క॥ లీలం బ్రాకృతపూరుష
కాలాదికనిఖిలమగు జ♦గంబుల కెల్లన్
మాలిన్యనివారకమగు
నీ లలితకళాసుధాబ్ధి♦నిం గ్రుంకి తగన్. ద. 1208

36 చ॥ హరి భవదుఃఖభీషణద♦వానలదగ్ధ తృషార్తమన్మనో
ద్విరదము [3]శోభితంబును బ♦విత్రము నైన భవత్కథాసుధా
సరిదవగాహనంబునను ♦ సంసృతి తాపముఁ బాసి క్రమ్మరన్
దిరుగదు బ్రహ్మముం గనిన♦ధీరునిభంగిఁ బయోరుహోదరా!.
చ. 187



1 లేని. 2 పరివిమలంబగుచు నృపా. 3 శోభనంబును.

# ౨ సంసార ప్రకరణము

## ౧ సాంసారిక ధర్మాధర్మము.

1 సీ॥ భూపాలకోత్తమ! ♦ భూతహితుండు సు
జ్ఞానస్వరూపకుఁ ♦ డై నయట్టి
ప్రాణికి దేహసం♦బంధ మెట్లగునన్న
మహి నొప్పు నీశ్వర♦మాయ లేక
కలుగదు [1]నిద్రవోఁ ♦ గలలోనఁ దోఁచిన
దేహబంధంబుల♦ తెఱఁగు[2]కరణి
హరి యోగమాయామ♦హత్త్వంబునం బాంచ
భౌతిక దేహ సం♦బంధుఁ డగుచు
తే॥ గీ॥ నట్టిమాయాగుణంబుల ♦ నాత్మలోన
బాల్యకౌమారయౌవన♦భావములను
నరసుపర్వాదిమూర్తులఁ ♦ బొరసి యేను
నాయ దిదియను సంసార♦మాయఁ దగిలి. ద్వి. 225

2 చ॥ ధన పశు పుత్ర మిత్ర వని♦ తా గృహ కారణభూతమైన యా
తనువున నున్న జీవుఁడు ప♦దంపడి యట్టిశరీర మెత్తి తా
ననుగతమైన కర్మఫల ♦ మందక పోవఁగరాదు మిన్ను వ్రాఁ
కిన భువిదూరినన్ దెసల♦[4]కేగిన నెచ్చటనైన డాఁగినన్. తృ. 1011

3 సీ॥ పద్మలోచన! కృష్ణ! ♦ భక్తాభయప్రద!
వినుము సంసారాగ్ని ♦ వేచుచున్న
జనులసంసారంబు ♦ సంహరింపఁగ నీవు
దక్క నన్యులు లేరు ♦ దలఁచిచూడ

---

1 నిద్రలోఁగల 2 వలెను 3 రోలి 4 కీల్కొని గ్రుమ్మతి.

సాక్షాత్కరించిన ♦ సర్వేశ్వరుండవు
[1]ప్రకృతిపరుండవు ♦ పరమపురుష
నీప్రబోధముచేత ♦ నీమాయ నంతయు
నడఁతువు నిశ్శ్రేయ♦సాత్మయందు
ఆ॥ వె॥ మాయయందుమునిఁగి ♦ మనువారలకుఁ గృపఁ
జేసి ధర్మముఖ్య♦చిహ్నమైన
శుభము సేయుచుందు ♦ సుజనుల నవనిలోఁ
గావఁబుట్టుదువు జ♦గన్నివాస! ప్ర. 147
4 సీ॥ అమరతిర్యఙ్మను♦ష్యాదిచేతనయోను
లందు నాత్మేచ్ఛచేఁ ♦ జెందినట్టి
కమనీయ శుభమూర్తి ♦ గలవాఁడవై ధర్మ
సేతు వనంగఁ బ్ర♦ఖ్యాతినొంది
విషయసుఖంబుల ♦ విడిచి సంతతనిజా
నందానుభవసము♦న్నతిఁ దనర్తు
వదిగానఁ బురుషోత్త♦మాఖ్యఁ జెన్నొందుదు
వట్టి నిన్నెప్పుడు ♦ నభినుతింతు
తే॥ గీ॥ నర్థి భవదీయపాదంబు ♦ లాశ్రయింతు
మహితభక్తిని నీకు న♦మస్కరింతు
భక్తజనపోషపరితోష ♦ పరమపురుష
ప్రవిమలాకార సంసార♦భయవిదూర!. తృ. 369
5 సీ॥ ప్రకృతియొక్కటి పాదు ♦ ఫలములు సుఖదుఃఖ
ములు రెండు గుణములు♦మూఁడు వేళ్లు
దగురసంబులు నాల్గు ♦ ధర్మార్థముఖరంబు
లెఱిఁగెడివిధము లై ♦ దింద్రియంబు
లాఱు స్వభావంబు ♦ లాశోకమోహాదు
లూర్ములు ధాతువు ♦ లొక్కయేడు
పైపొర లెనిమిది ♦ ప్రంగలు భూతంబు
లైదు బుద్ధియు మనో♦హంకృతులును

1 ప్రకృతికి నవ్వలిప్రభుఁడ వాద్యపురుషుండ వీవగుబోధంబుచే మాయనడఁతువు.

తే॥ గీ॥ రంధ్రములు తొమ్మిదియుఁ గోట♦రములు ప్రాణ
పత్రదశకంబు జీవేశ! ♦ పక్షియుగము
గలుగు సంసారవృక్షంబు ♦ గలుగఁజేయుఁ
గావ నడఁగింప రాజ వా♦క్కరుఁడ వీవ. ద. 91

6 క॥ నీకుం గ్రీడార్థములగు
లోకంబులఁ జూచి నరులు ♦ లోకులు కుమతు
ల్లోకాధీశుల మందురు
లోకములకు రాజ వీవ ♦ లోకస్తుత్యా! అ. 660

7 ఆ॥ వె॥ కడిదివేదనలకుఁ ♦ గారణంబై యుండు
గుఱుతులేని నరక♦కూపరాశి
పాలుగాక నరుఁడు ♦ బ్రతికెడుమార్గంబు
పరమపుణ్య! తెలియఁ♦బలుకు మయ్య. ప. 41

8 ఆ॥ వె॥ జంతుజాలములకు ♦ శ్రద్ధలు త్రిగుణాత్మ
కములుగాన వారి♦కర్మగతుల
తారతమ్యములును ♦ దగిలి యున్నియు వివి
ధంబు లగుచు సంత♦తంబు నుండు. పం. 129

9 క॥ కర్మమునఁ బుట్టు జంతువు
కర్మమునన్ వృద్ధిఁబొందుఁ ♦ గర్మమునఁ జెడున్
గర్మమె జనులకు దేవత
కర్మము సుఖదుఃఖములకుఁ ♦ గారణ మధిపా! ద. 886

10 ఆ॥ వె॥ ప్రకృతిఁ గామకర్మ♦పరవశమై యుచ్చ
నీచగతులఁ బొంది ♦ నెఱయ బ్రమసి
తిరుగుచున్న జనము ♦ తెలియనేరదు నిజ
గతివిశేష మీాజ♦గంబునందు. ద. 962

11 సీ॥ మేనితోడన బుట్టు ♦ మృత్యువు జనులకు
నెల్లి నేఁడైన నూ♦ఱేండ్లకైనఁ
దెల్లంబు మృత్యువు ♦ దేహాంబు పంచత
నొందఁ గర్మానుగుం♦డై శరీరి

మాఱు దేహముఁ జొచ్చి ♦ మఱి తొంటి దేహంబుఁ
బాయును దనపూర్వ♦భాగ మెత్తి
వేఱొంటిపైఁ బెట్టి ♦ వెనుక భాగం బెత్తి
గమనించు తృణజలూ♦కయనుబోలె
ఆ॥ వె॥ వెంటవచ్చు కర్మ♦విసరంబు మును మేలు
కన్న వేళ నరుఁడు ♦ గన్న విన్నఁ
దలఁపఁబడినఁ గార్య♦తంత్రంబు కలలోనఁ
బాడితోడఁ గానఁ♦బడినయట్లు. ద. 29

12 క॥ తనతొంటికర్మరాశికి
ననుచరమై బహువికార♦మై మనము వడిం
జను నింద్రియముల తెరువులఁ
దనువులు పెక్కైనఁ జెడవు ♦ తనకర్మంబుల్. ద. 30

13 ఆ॥ వె॥ ధర్మవంతులెల్లఁ ♦ దప్పక స్వర్గంబు
నందు భోగసమితిఁ ♦ బొందుచుందు
రెలమిఁ బుణ్యపాప♦ముల శేషములవల్లఁ
బుట్టుచుందు రవనిఁ ♦ బుణ్యచరిత !. పం. 161

14 క॥ ప్రకృతమునఁ దా నొనర్చిన
సుకృతము దుష్కృతము నెంతఁ ♦ జూడఁగ నంతే
[1]వికృతిఁగని యనుభవించు
న్నకృతమతిన్ దత్ఫలంబు ♦ నతి నిపుణుండై. ష. 87

15 మ॥ ఎనయన్ క్షుత్పరిపీడఁ గుంది శునకం ♦ బింటింటికిం బోవ బూ
నినఁ దద్దైవికమైన దండహతిగా♦సీ కాక చౌర్యాన్నమై
ననుగానీ తగఁబొందుచందమున నె♦న్నన్ దైవయోగంబు పెం
పున నీజీవుఁడు దా ప్రియాప్రియములం♦బొందున్ద్రిలోకంబులన్.
చ. 860

16 క॥ దమమును శౌచముఁ దపమును
శమమును మార్దవముఁ గృపయు ♦ సత్యజ్ఞాన

1 వికృతగతి.

క్షమలును హరిభక్తియు హ
ర్షము నిజలక్షణము లగ్ర♦జాతికి నధిపా. స. 412

17 ఉ॥ శౌర్యము దానశీలముఁ బ్ర♦సాదము నాత్మజయంబుఁ దేజముం
ధైర్యము దేవభక్తియును ♦ ధర్మము నర్థముఁ గామము న్బుధా
చార్య ముకుంద సేవలును ♦ సత్కృతియుం బరితోషణంబు స
ద్వీర్యము రక్షణంబుఁ బృథి♦వీవర శేఖర! రాజచిహ్నముల్.
స. 413

18 క॥ ధర్మార్థకామవాంఛయు
నిర్మలగురుదేవవిప్ర♦నివహార్చనము
ల్నిర్మదభావము ప్రమదము
శర్మకరత్వములు వైశ్య♦జనలక్షణముల్. స. 414

19 ఉ॥ స్తేయములేనివృత్తియు శు♦చిత్వము సన్నుతియు న్ద్విజేశుల
న్మాయలులేక డాయుటయు ♦ మంత్రముఁజెప్పక పంచయజ్ఞము
ల్సేయుటయుం ధరామరుల♦సేవయు గోవులరక్షణంబు న
న్యాయములేమియు న్మనుజ♦నాథ యెఱుంగుముశూద్రధర్మముల్.
స. 415

20 సీ॥ నిలయము వాటించి ♦ నిర్మలదేహయై
శృంగార మేపారఁ ♦ జేయవలయు
సత్యప్రియాలాప♦చతురయై ప్రాణేశు
చిత్తంబు ప్రేమ రం♦జింపవలయు
దాక్షిణ్యసంతోష♦ధర్మమేధాదుల
దైవత మని ప్రియుఁ ♦ దలఁపవలయు
నాథుఁ డేపద్ధతి ♦ నడుచు నాపద్ధతి
నడిచి సద్బంధుల ♦ నడుపవలయు
ఆ॥ వె॥ మార్దవమునఁ బతికి ♦ మజ్జనభోజన
శయనపానరతుల ♦ జరుపవలయు
విభుఁడు పతితుఁడైన ♦ వెలఁది పాతివ్రత్య
మహిమఁ బుణ్యుఁ జేసి ♦ మనుపవలయు. స. 416

21 క॥ ఉపవాసంబును వ్రతములు
దపములు వేయేల? భర్త • దైవత మని ని
ష్కపటతఁ గొల్చిన సాధ్వికి
నృపవర? దుర్లభములేదు • నిఖిలజగములన్. స. 418

22 క॥ పతిసన్మానము వడసిన
సతులకు నభిమతపదార్థ•సంసిద్ధియు నూ
ర్జితయశముఁ గలిగి లోక
స్తుతమై చెలువారుచుండు • జువ్వో మహాత్మా. తృ. 455

23 క॥ తరుణి తనప్రాణవల్లభు
హరిభావముగా భజించి • యతఁడును దాను
న్నిరికై వడి వర్తించును
హరిలోకమునందు సంత•తానందమునన్. స. 417

24 చ॥ [1]ఇలువరిసున్న జేసి హృద•యేశుల [2]సిగ్గులఁజంపి యుత్తమా
మల నెఱియించి సోదరుల•మానము నూరలు వుచ్చి తల్లిదం
డ్రుల రుచిమాన్చి బంధులకు • ద్రోత యొనర్చుచు జారవాంఛల
న్వలతురె సత్కులాంగనలు • వత్తురె లోకులు చూచి మెత్తురే.
ద· 980

25 సీ॥ ప్రాణేశుఁ డెఱిఁగినఁ • బ్రాణంబునకుఁ దెగు
దండించు నెఱిఁగిన • ధరణివిభుఁడు
మామ యెఱింగిన • మనువెల్లఁ జెడిపోవుఁ
దలవరి యెఱిఁగినఁ • దగులు సేయుఁ
దలిదండ్రు లెఱిఁగినఁ • దలలెత్త కుండుదు
రేరా లెఱింగిన • నెత్తిపొడుచు
నాత్మజు లెఱిఁగిన • నాదరింపరు చూచి
బంధువు లెఱిఁగిన • బహి యొనర్తు
ఆ॥ వె॥ రితరు లెఱిఁగిరేని • నెంతయుఁ జులకగాఁ
జూతు రిందు నందు • సుఖములేదు

---

1 ఇలువడి 2 సిగ్గులఁబుచ్చి

యశము లేదు నిర్భ♦యానందమును లేదు
జారుఁ జేరఁ జనదు ♦ చారుముఖికి. ద. 981

26 క॥ నడువడి కొఱగాకున్నను
బడుగైనఁ గురూపియైనఁ ♦ బామరుఁడైనన్
జడుఁడైన రోగియైనను
విడుచుట మర్యాదగాదు ♦ విభు నంగనకున్. ద. 982

27 క॥ పనుపకఁ జేయుదు రధికులు
పనిచిన మధ్యములు పొందు♦పరతురు తండ్రి
ల్పని చెప్పి కోరి పనిచిన
ననిశము మాఱాడుపుత్రు ♦ లధములు తండ్రీ. న. 559

28 క॥ చెల్లుబడి గలిగి యెవ్వఁడు
తల్లికిఁ దండ్రికిని దేహ♦ధనములు వృత్తుల్
చెల్లింపఁ డట్టికష్టుఁడు
ప్రల్లదుఁ డామీఁద నాత్మ♦పలలాశియగున్. ద. 1394

29 క॥ జననీజనకుల వృద్ధులఁ
దనయుల గురువిప్రసాధు♦దారాదుల నే
జనుఁడు ఘనుఁడయ్యుఁ బోవక
వనరును జీవన్మృతుండు ♦ వాఁడు ధరిత్రిన్. ద. 1395

30 క॥ దుష్టజననిగ్రహంబును
శిష్టజనానుగ్రహంబు ♦ సేయఁగ నృపులన్
సృష్టి విధించెఁ బురాణ
ద్రష్టలు సెప్పుదురు పురుష♦ధర్మము సాధ్వీ. ప్ర. 424

31 క॥ సాధువులగు జంతువులకు
బాధలు గావించు ఖలుల ♦ భంజింపని రా
జాధము నాయుస్స్వర్గ
శ్రీధనములు పీటివోవు ♦ సిద్ధము తల్లీ. ప్ర. 423

32 ఆ॥ వె॥ హరుఁడు గళమునందు ♦ హాలాహలము వెట్టఁ
గప్పుగలిగి తొడవు ♦ కరణి నొప్పె

సాధురక్షణంబ ♦ సజ్జనులకు నెన్న
భూషణంబు గాదె ♦ భూవరేంద్ర. అ. 248

33 క॥ [1]అలుగరు కలఁగరు సాధులు
మిళితములై పరులవలన ♦ మేలుం గీడున్
నెలకొనిన నైన నాత్మకు
నొలయవు సుఖదుఃఖచయము ♦ [2]లుగ్రము లగుచున్. ప్ర. 487

34 క॥ అతిథిజనంబుల భక్తిన్
సతతముఁ బూజించి యుచిత♦సత్కారము లు
న్నతి నడుపు సుజనులును శా
శ్వతకీర్తులు ధరణిఁ బడయఁ ♦ జాలుదు రనఘా. ద. 720

35 ఆ॥ వె॥ అన్నమైనఁ దోయ♦మైన ద్రవ్యంబైన
శాకమైనఁ దనకు ♦ జరుగుకొలఁది
యతిథిజనుల కడ్డ♦మాడక యిడ రేని
[3]లేనివారు పుడమి♦ లేనివారు. అ. 467

36 క॥ మానుష దేహము గలుగుట
భూనాయక దుర్లభంబు ♦ పుట్టినమీఁద
న్దానము పరోపకారము
భూనుతకీర్తియును వలదె ♦ పురుషున కెందున్. న. 243

37 క॥ శరణ మని వచ్చు జంతువుఁ
గరుణం గనువిచ్చి చూచి ♦ కాచినఁ బుణ్యం
బరయఁగ నధికంబని మున్
[4]గర మెఱిఁగించెను మునీంద్ర♦గణములు ప్రేమన్. పం. 103

38 క॥ ప్రాణేచ్ఛ వచ్చి చొచ్చిన
ప్రాణుల రక్షింపవలయుఁ ♦ బ్రభువుల కెల్లన్
బ్రాణుల కిత్తురు సాధులు
ప్రాణంబులు నిమిషభంగు♦రములని మగువా. అ. 235

---

1 చెలఁగరు తలఁగరు 3 యుగ్మము 3 లేమ వారుకలిగి 4 నెఱింగించిరి సన్ము
నీంద్రులెల్లం బ్రేమన్.

39 క॥ పరహితము సేయ నెవ్వఁడు
పరమహితుం డగును భూత♦పంచకమునకుం
బరహితమె పరమధర్మము
పరహితునకు నెదురులేదు ♦ పర్వేందుముఖీ. అ. 236

40 ఉ॥ తప్పక [1]నర్భకావళికిఁ ♦ దల్లియు దండ్రియు నేత్రపఙ్క్తికిన్
ఱెప్పలు నాతికిం [2]బతి న♦రేంద్రుఁడు లోకులకెల్ల నర్థికి
నొప్ప గృహస్థు మూఢులకు ♦ నుత్తము [3]లెన్నఁగ వీరు బంధువు
లుప్పునఁ గావలేని కడు♦మూర్ఖులు [4]సుమ్మి సమస్తబంధువుల్.
ప. 200

41 చ॥ దయయును సత్యము న్విడిచి ♦ ధర్మముమాని యశంబుమాని శ్రీ
జయములఁ బాఱఁదోలి పురు♦షత్వముఁ గానక లోకనిందితా
హ్వయుఁడగువానిచావునకు ♦ నార్యులు గుందుదురే సృగాలము
ల్ప్రియముననంటునే శవముఁ♦ బ్రేలక చేరునె కంకగృధ్రముల్.
ప. 393

42 క॥ భూమికి ధనధాన్యములకు
భామలకును మానములకుఁ ♦ బ్రాభవమునకుం
గామించి మీఁదుఁ గానరు
శ్రీమదమున మానఘనులు ♦ చెనఁకుదు రొరులన్. ద. 1780

43 క॥ దురితముఁ దలఁపరు గానరు
జరుగుదు రెట్లైన నిమిష♦సౌఖ్యంబులకై
పరవనితాసక్తులకును
బరధనరక్తులకు నిహముఁ ♦ బరముం గలదే. న. 310

44 క॥ వావి నెఱుంగని కూ్రరుని
జీవన్మృతుఁడనుచు నింద♦సేయుదు రతఁడు
న్నొవ్వును నరకమునకు దు
ర్భావముతో బ్రతుకు టొకట♦బ్రతుకే తలఁపన్. ద. 11

1 పిల్లవారలకు 2 బతియు రేఁడు ప్రజావళి 3 లెన్న సమస్త 4 కొరు నిజాల చుట్టముల్.

45 క॥ రక్షణము లేక సాధుఁడు
రక్షితుఁ డగు సమతఁజేసి ♦ రాయిడు లందుర్
రక్షణము వేయు గలిగిన
శిక్షితుఁ డగు ఖలుఁడు పాప♦చిత్తుం డగుటన్. ద. 277

46 క॥ భూతముల కెగ్గుఁజేసిన
భూతంబులు నీకు నెగ్గు ♦ పుట్టించు వృథా
భూతమగు మనికి యెల్లను
భూతద్రోహికిని శుభము ♦ పొంద దధీశా. ద. 1389

47 క॥ పరపుత్త్రకళత్త్రంబులఁ
బరికింపక యపహసించు ♦ పాపాత్ముఁడు దు
ష్కరపాశబద్ధుఁడై యమ
పురుషులచే నధికబాధఁ ♦ బొందుచు నుండున్. పం. 135

48 క॥ కావునఁ బరులకు హింసలు
గావింపఁగవలదు తనకుఁ ♦ గల్యాణముగా
భావించి పరుల నొంచినఁ
బోవునె తత్ఫలము పిదపఁ ♦ బొందకయున్నే. ద. 33

49 క॥ అనఘా! యీదుఃఖమునకుఁ
బని లే దన్యులకు సొలయ ♦ బలవంతంబై
తనపూర్వజన్మదుష్కృత
ఘనకర్మము వెంటనంటఁ♦గా నెవ్వలనన్. చ. 229

50 ఆ॥ వె॥ సభకుఁ బోవఁ జనదు ♦ సభవారిదోషంబు
నెఱిఁగి యూఱకున్న ♦ నెఱుఁగకున్న
నెఱిఁగి యుండి యైన ♦ నిట్టట్టు పలికినఁ
బ్రాజ్ఞునైనఁ బొందుఁ ♦ బాపచయము. ద. 1360

51 క॥ [1]ధర్మేతరవర్తనులును
దుర్మంత్రులునైన జనుల ♦ దురితము లొందు
న్మర్మములు గలఁచి కల్మష
కర్మల రోగములు నొందు♦కై వడి విప్రా. స. 174

1 ధర్మేతరులు నధర్ములు దుర్మంత్రులు.

52 క॥ కాలం బెడ గని పాపము
మూలముఁ జెఱుపంగవలయు ♦ మును [1]రోగములన్
దేలినదోషము నెఱుఁగుచు
వాలాయము దాని నడఁచు ♦ వైద్యునిభంగిన్. వ. 45

53 క॥ హితముగల కుడుపు మఱి రు
గ్వితతులఁ బొడమంగనీని♦విధమున నతిస
ద్వ్రతుఁడై నవాఁడు [2]నిర్మ
మతిచే నఘరాశి నెల్ల ♦ మట్టము సేయున్. వ. 49

54 మ॥ చెలియే మృత్యువు చుట్టమే యముఁడు సం♦సేవార్థులే కింకరు
ల్కలలంజేసెనె బ్రహ్మ దన్ను దృఢమే ♦ జీవంబు నోచెల్లరే
చలితంబౌట నెఱుంగ రీ కపటసం♦సారంబు నిక్కంబుగాఁ
దలఁచు న్మూఢుఁడు సత్యదానకరుణా♦ధర్మాదినిర్ముక్తుఁడై.
అ. 651

55 క॥ పరికింపఁగ దేహం బ
స్థిరమని నిజబుద్ధిఁ దలఁచి ♦ చిరతరకీర్తి
స్ఫురణన్ బ్రస్తుతి కెక్కని
పురుషుఁడు జీవన్మృతుండు ♦ భూరివివేకా. ద. 721

56 క॥ ధర్మము సత్యముఁ గీర్తియు
నిర్మలదయ విష్ణుభక్తి ♦ నిరుపమఘనస
త్కర్మ మహింసావ్రతమును
నర్మిలిగలవారె పుణ్యు ♦ లవనీనాథా. ద్వా. 16

57 క॥ తాలిమి మనకును ధర్మము
తాలిమి [3]మూలంబు మనకు ♦ ధన్యత్వమునం
దాలిమి గలదని యీశుం
డేలించును బ్రహ్మపదము ♦ నెల్ల న్మనలన్. న. 462

---

1 దేహములన్ దేలినరోగము 2 తాలిమికతమున దత్త్వంబుకొఱకు గల్పించు నృపా 3 మూలమగు ధర్మతత్త్వంబులకున్.

58 క॥ క్షమ గలిగిన సిరి గలుగును
క్షమ గలిగిన వాణి గలుగు ♦ సౌఖ్యము లెల్లన్
క్షమ గలుగ [1]ముక్తి గలుగును
క్షమ గలిగిన మెచ్చు శౌరి ♦ సదయుఁడు తండ్రీ. స. 463

59 క॥ అతనికిఁ దలపోయ హితా
హితులును సన్మాన్యులును వి♦హీనులు నతిగ
ర్హితులును లే రీశుఁడు సమ
మతియును నిఖిలైకభూత♦మయుఁడై యుండన్. తృ. 465

60 క॥ కర్మములకుఁ దగుఫలములు
కర్మాదుల నిడఁగ రాజు♦గాని సదా ని
ష్కర్ముఁడగు నీశ్వరుండును
గర్మవిహీనునికి రాజు ♦ గాఁడు మహాత్మా. ద. 887

61 సీ. పరధనపరదార♦పరదూషణాదులఁ
బరవస్తుచింతఁ దాఁ ♦ బరిహరించి
ముదిమిచే రోగము ♦ లుదయింప కటమున్నఁ
దనువు చంచలతను ♦ దగలకుండ
బుద్ధి సంచలతఁ బెం♦పొదలక యటమున్న
శ్లేష్మంబు గళమునఁ ♦ జేరకుండ
శక్తియుక్తులు మది♦[2]చేవ దీయకమున్న
భక్తిభావనచేతఁ ♦ బ్రౌఢుఁ డగుచు
తే॥ గీ॥ దైత్యభంజను దివ్యపా♦దారవింద
భజన నిజభక్తిభావనఁ ♦ బ్రాజ్ఞుఁ డగుచు
నవ్యయానందమును బొందు ♦ ననుదినంబు
నతఁడు గర్మవిముక్తుఁడౌ ♦ ననఘచరిత. ఏ. 94

1 తోన 2 సన్నగిల్లక

## ౨. సంసార విముక్తిమార్గము.

1 సీ॥ నలినాక్ష! విను భవ♦న్మాయావశంబున
దేహంబు దాల్చి త♦ద్దేహమందు
[1]నాత్మ యహమ్మను ♦ యను నభిమానియై
పుత్రజాయాగృహ♦క్షేత్రబంధు
ధనపశుముఖవస్తు♦తతుల సంయోగవి
యోగదుఃఖంబుల ♦ నొందుచుండు
ధృతివిహీనుఁడు నస♦ద్విషయాతిలాలసుఁ
డతిదుష్టమతియు నై ♦నట్టివాఁడు
తే॥ గీ॥ దవిలి భవదీయగుణసత్క♦థావిలోలుఁ
డయ్యెనేనియు [2]నాత్మమో♦హంబువలనఁ
బాసి వర్తించు విజ్ఞాన♦పరతఁ దగిలి
చిరదయాకార! యిందిరా♦చిత్తచోర!. చ. 204

2 మ॥ మిము సద్భక్తి భజింపనొల్లకిల దు♦ర్మేధ న్ప్రవర్తించు నీ
చమతివ్రాతము నేర్పునం బసులఁ బా♦శశ్రేణి బంధించుచం
దమున న్వైక్కగునామరూపములచే♦త న్వారి బంధించి దు
ర్గమసంసారపయోధిఁ ద్రోతువు [3]దర♦త్కంజాతపత్రేక్షణా!.
ద. 1222

3 క॥ వినుమీ సంసారం బను
వననిధిలో మునిఁగి కర్మ♦వాంఛలచే వే
దనఁ బొందెడువానికి వి
ష్ణునిగుణవర్ణనము దేప ♦ సుమ్ము మునీంద్రా! ప్ర. 131

4 మ॥ వనజాతాక్ష! భవత్పదాబ్జయుగసే♦వాసక్తులైనట్టి య
జ్జనము ల్మృత్యుశిరంబుఁ దన్ని ఘనసం♦సారాంబుధిన్ దాఁటి పా
వనులై లోకములం బునీతములుగా ♦ వర్తించుచు న్నిత్యశో
భనమైయొప్పెడి ముక్తిఁ బొందుదురు శుం♦భద్వైభవోపేతులై.
ద. 1221

(1) నాత్మ నహమ్మ మేత్యభిమాని (2) నాత్మ (3) దళత్కంజాత

5 మ॥ అవివేకానుగతస్వకార్యజలవే♦లాకీర్ణమై మిత్రబం
ధువధూపుత్రజలగ్రహాగ్రయుతమై ♦ దుర్దాంతసంసారదు
ర్భరపాథోధిఁ దరించువారె హరిసం♦బంధక్రియాలోలభా
గవతానుగ్రహనావలేనియధము♦ ల్గారుణ్యసంధాయకా!. తృ. 183

6 మ॥ వరగోవిందకథాసుధారసమహా♦[1]వర్షోరుధారాపరం
పరలంగాక బుధేంద్రచంద్రయితరో♦పాయానురక్తిం బ్రవి
స్తరదుర్దాంతదురంతదుస్సహజను♦స్సంభావితానేకదు
స్తరగంభీరకఠోరకల్మషకన♦ద్దావానలం బాఱునే!॥ ప్ర. 49

7 సీ॥ శోకదావాగ్నిశి♦ఖాకులితంబు పృ
థుక్లేశఘనదుర్గ♦దుర్గమంబు
దండధరక్రూర♦కుండలిశ్లిష్టంబు
పాపకర్మవ్యాఘ్ర♦పరివృతంబు
గురుసుఖదుఃఖకా♦కోలపూరితగర్త
మగుచు ననాశ్రయ ♦ మైనయట్టి
సంసారమార్గసం♦చారులై మృగతృష్ణి
కలఁ బోలు విషయసం♦గము నహమ్మ
తే॥ గీ॥ మేతిహేతుకదేహని♦కేతనములు
నను మహాభారవహులైన♦యట్టిమూఢ
జనము లేనాఁట మీపదా♦బ్జములు గానఁ
జాలువారలు భక్తప్ర♦సన్న దేవ. చ. 49

8 సీ॥ క్షితిప! నీప్రశ్నంబు ♦ [2]శ్రేష్ఠతమంబగు
నాత్మవిదు ల్మెత్తు ♦ రఖిలశుభద
మాకర్మనీయాదు ♦ లయుతసంఖ్యలుగల
[3]వందు ముఖ్యం బిది ♦ యఖిలచరము
గృహములలో నెల్ల ♦ గృహమేధు లగునరు
లాత్మ[4]తత్త్వము లేశ ♦ మైన నెఱుఁగ
రంగనారతుల ని♦ద్రాసక్తిఁ జను రాత్రి
వోవుఁ గుటుంబార్థ♦బుద్ధి నహము

---

(1) వర్షోక్తి (2) సిద్ధంబుమంచిది యాత్మ (3) వందులోపల నిది యఖిలతరము
(4) తత్త్వములు నింతైన

ఆ॥ వె॥ పశుకళత్రపుత్ర♦బాంధవ దేహాది
సంఘమెల్లఁ దనకు ♦ సత్య మనుచుఁ
గాపురములు సేసి ♦ కడపటఁ జత్తురు
కనియుఁ గాన రంత్య♦కాలసరణి. ద్వి. 3

9 సీ॥ ధరణీశ! మాయచే♦తను దాఁటఁగారాని
పదమునఁ బట్టంగఁ ♦ బద్ధజీవుఁ
డెలమిమై గుణకర్మ♦ములఁ జేయుచును లాభ
మాసించి [1]తిరిగెడు ♦ నర్యమాడిక్కు-
ఫల మపేక్షింపుచుఁ ♦ బాయక జీవుండు
సంసారగహనసం♦చారి యగుచు
ననవరతమునుండు ♦ నామహావనమందుఁ
గామలోభాదిత♦స్కరులుగూడి

తే॥ గీ॥ ధరణి విజితేంద్రియుఁడుకాని ♦ నరునిఁబట్టి
ధర్మ మనియెడి యామహా♦ధనము నెల్ల
నరసి కొనిపోవుచుండుదు ♦ రనుదినంబుఁ
గాన సంసారమందు నా♦కాంక్ష వలదు. పం. 162

10 సీ॥ రథము మేనెల్ల సా♦రథి బుద్ధి యింద్రియ
గణము గుఱ్ఱములు ప♦గ్గములు మనము
ప్రాణాదిదశవిధ♦పవనంబు లిఱుసు ధ
ర్మాధర్మగతులు ర♦థాంగకములు
బహుళతరంబైన ♦ బంధంబు చిత్తంబు
శబ్దాదికములు [2]సం♦చారభూము
లభిమానసంయుతుం♦డైన జీవుఁడు రథి
ఘనతరప్రణవంబు ♦ కార్ముకంబు

తే॥ గీ॥ శుద్ధజీవుండు బాణంబు ♦ [3]సుభగమైన
బ్రహ్మ మంచితలక్ష్యంబు ♦ పరులు రాగ
భయమద ద్వేషశోకలో♦భపరిమోహ
మానమత్సరముఖములు ♦ మాన వేంద్ర. స. 464

---

(1) తిరుగు జేహారి (2) సంసార (3) శుభదమైన.

11 వ॥ ఇట్లు మనుష్యశరీరరూపంబైన రథంబు దనవశంబుచేసికొని మహాభాగవతచరణకమలసేవానిశితంబైన విజ్ఞానఖడ్గంబు ధరియించి శ్రీమన్నారాయణ కరుణావలోకన బలంబున రాగాదిశత్రు నిర్మూలనంబు గావించి ప్రణవబాణాసనంబున శుద్ధజీవశరం బనుసంధించి బ్రహ్మమని యెడి గుఱియందుఁ [1]బడనేసిన నహంకారరథికుండు రథికత్వంబుమాని నిజానందంబున నుండవలయు అట్టివిశేషంబు సంభవింపనిసమయంబున బహిర్ముఖంబులైన యింద్రియఘోటకంబులు బుద్ధిసారథిసహితంబులై స్వాభిమానరథికుని ప్రమత్తత్వంబుఁ దెలిసి ప్రవృత్తిమార్గంబు నొందించి విషయశత్రుమధ్యంబునం గూల్చిన.
స. 465

12 ఆ॥ వె॥ విషయశత్రులెల్ల ♦ విక్రాంతితోడ సా
రథిసమేతుఁడైన ♦ రథికుఁబట్టి
యుగ్రతిమిరమృత్యు♦యుతమగు సంసార
కూపమధ్యమందుఁ ♦ గూల్తు రధిప. స. 466

13 క॥ అరయఁగ సంసారాటవిఁ
దరలక యాపుత్రమిత్ర♦దారాదు లనం
[2]బరగిన సృగాలవృకములు
పరువడి నరబస్తములను ♦ భక్షించు వడిన్. పం. 163

14 ఆ॥ వె॥ బహుకుటుంబి యగుచు ♦ బహుధనాపేక్షల
నెండమావులఁ గని♦యేఁగుమృగము
కరణిఁ బ్రేమఁజేసి ♦ పరువులు వారుచు
నొక్కచోట నిలువ♦కుండు రెపుడు. పం. 167

15 ఆ॥ వె॥ మఱిగి కాననమునఁ ♦ గొఱవిదయ్యముఁ గాంచి
యగ్ని గోరి వెంట ♦ నరుగుమాడ్కిఁ
గాంచనంబుఁగోరి ♦ కలవారియిండ్లఁ బం
చలను దిరుగు నరుఁడు ♦ చలన మంది. పం. 166

---

(1) బడవేసిన. (2) బరగుచునుండెడు, బరగెడు మాయికమృగములు, పరువడి మానవునిబట్టి భక్షించు.

16 ఆ॥ వె॥ అల్పధనుఁడు విశ్ర♦మస్థానములఁ దృప్తిఁ
బొంద కొరుల ధనముఁ ♦ బొందఁగోరి
యరిగి వారివలన ♦ నవమానములఁ బొంది
యధికమైనదుఃఖ ♦ మనుభవించు. పం. 170

17 ఆ॥ వె॥ అంతఁ గొంద ఱెల్ల ♦ నన్యోన్యవిత్తాది
వినిమయమునఁ గడుఁ బ్ర♦వృద్ధమయిన
వైరములను బొంది ♦ పోరాట మొందుదు
రాత్మచింతలేక ♦ యనుదినంబు. పం. 171

18 తరల॥ మలసి సంసృతిఘోరకానన♦ మందిరంబుల నెల్లనుం
జెలఁగి గుల్మలతాతృణాదుల♦చేత గహ్వరమైన ని
శ్చలనికుంజములందు దుర్జన♦సంజ్ఞలం గల మక్షికం
బుల నిరోధము దన్ను సోఁకినఁ♦బొందు[1]చుండు విపద్దశన్.
పం. 164

19 ఆ॥ వె॥ మఱియు నొక్కచోట ♦ మత్తుఁడై పవనర
జోహతాక్షుఁడగుచుఁ ♦ జూపు దప్పి
దిక్కెఱుంగ కొందు♦దిశ కేఁగు పురుషుని
కరణిఁ దిరుగు నరుఁడు ♦ నరవరేణ్య. పం. 168

20 క॥ ధరణీనాథులు తమతమ
వరవనితామందిరంబుల ♦ వసియించుచు గో
ఖరమార్జాలములగతిన్
స్థిరబద్ధు లగుదురు నిన్నుఁ ♦ దెలియని కతనన్. ద. 259

21 ఆ॥ వె॥ సకలదిశలు గెలిచి ♦ సములు వర్ణింపంగఁ
జారుపీఠ మెక్కి ♦ సార్వభౌముఁ
డైన సతులగృహము♦లందుఁ గ్రీడాసక్తి
వృత్తినుండు నిన్ను ♦ వెదకలేఁడు. ద. 1663

22 క॥ నరపతులమహిమ నంతయు
నురగాధిపుఁడైన నుడువ ♦ నోపఁడు ధాత్రిం

(1) దుర్దశ నెప్పుడున్

జిరకాల మేలి యిందే
పరువడి నడఁగుదురు వారు ♦ భ్రాంతులు నగుచున్. ద్వా. 6

23 ఆ॥ వె॥ మఱియు నీగృహస్థ♦మార్గంబునం దెల్ల
విషయములను బొంది ♦ విశ్వమెల్లఁ
గడఁకతోడ నిట్లు ♦ గంధర్వ[1]లోకంబుఁ
గాఁ దలంచి మిగుల ♦ మోద మందు. పం.165

24 సీ॥ పూని యనిత్యంబు♦లైన గృహక్షేత్ర
పశుధనసుతవధూ♦బాంధవాది
వివిధవస్తువులను ♦ ధ్రువముగా మదినమ్మి
పరలు దుర్మతియగు♦వాఁడు జంతు
సంఘాతమగు దేహ♦సంబంధమున నిల్చి
యర్థి నెయ్యెయోను♦లందుఁ జొరఁగ
ననుగమించును వాని♦యందు విరక్తుఁడు
గాక[2]యుండును నర♦కస్థుఁడైన
తే॥ గీ॥ దేహి యాత్మీయదేహంబు ♦దివిరి వదల
లేక తన కది పరమసౌ♦ఖ్యాకరంబు
గాఁగ వర్తించు నదియును ♦ గాక యతఁడు
దేవమాయావిమోహిత♦భావుఁ డగుచు. తృ. 975

25 క॥ ఘనముగఁ [3]బుత్త్రవధూపశు
ధనగృహరక్షణమునందుఁ ♦ దత్తత్క్రియల
న్మనమునఁ దలపోయుచు దిన
దినమున్ దందహ్యమాన♦దేహుం డగుచున్. తృ. 977

26 క॥ అతిమూఢహృదయుఁ డగుచు దు
రితకర్మారంభమునఁ జ♦రింపుచు ధరణిం
గృతగోప్యభాషణములను
[4]సుతలాలనభాషణములఁ ♦ జొక్కుచు మఱియున్. తృ. 977

(1)నగరంబు (2)చరించు దుర్గతికుఁడైన (3)తనయవధూ(4)సుతకలసంభాషణముల

27 క॥ విను మింద్రియపరవశుఁడై
మునుకొని తత్కాలధర్మ♦ములఁ గల దుఃఖం
బనయము సుఖరూపంబుగ
మనమునఁ దలపోసి తదభి♦మానుం డగుచున్. తృ. 978

28 క॥ సతతము దమ తమ సంపా
దితమగు నర్థములచేత ♦ ధృతిఁ బరులకుఁ గు
త్సితమతి హింసలు సేయుచు
నతిమూఢమనస్కు లగుచు ♦ నాత్మజనములన్. తృ. 979

29 తే॥ గీ॥ పూని రక్షింపుచును వారి♦భుక్తశేష
మనుభవింపుచు నంత జీ♦వనము దోపఁ
గడఁగి మఱిమఱి యపరార్థ♦కాముఁ డగుచు
సత్వ మెడలి కుటుంబపో♦షణమునందు. తృ. 980

30 సీ॥ బలిమి చాలక మంద♦భాగ్యుఁడై కుమతియై
పూని యప్పుడు క్రియా♦హీనుఁ డగుచుఁ
దవిలి వృథాప్రయ♦త్నంబులు సేయుచు
మూఢుఁడై కార్పణ్య♦మునఁ జరించు
నట్టి యకించనుఁ ♦ డగువానిఁ జూచి త
ద్దారసుతాదు లా♦త్మలను వీఁడు
గడు నశక్తుఁడు ప్రోవఁ♦గాఁ జాలఁ డితఁ డని
యెగ్గింతు రర్థిఁ గృ♦షీవలుండు
తే॥ గీ॥ బడుగు ముసలెద్దు రోసిన ♦ పగిది నంత
నతఁడు నేవెంటనను సుఖం ♦ బంద లేక
[1]తాను పోషించుజనులు దం ♦ దనరి ప్రోవ
[2]బ్రతుకు ముదిమియు మిక్కిలి ♦ బాధపఱుప. తృ. 981

31 క॥ వెడరూపుఁ దాల్చి బాంధవు
లడలఁగ నిర్యాణమునకు ♦ నభిముఖుఁడై యి
ల్వెడలఁగఁ జాలక శునకము
వడువునఁ గుడుచుచును మేను ♦ వడవడ వడఁకన్. తృ. 982

(1) గోరితిరిసినవారల మారుతిరిసి (2) బ్రదుకుచును ముది.

32 సీ॥ అతిరోగపీడితుం♦డై మందమగు జఠ
రాగ్నిచే మిగుల న♦ల్పాశియగుచు
మెఱసి వాయువుచేత ♦ మీఁదికి నెగసిన
కన్నులు కఫమునఁ ♦ గప్పఁబడిన
నాళంబులును గంఠ♦నాళంబునను ఘుర
ఘురమను శబ్దంబు ♦ [1]లురుఁగ బంధు
జనులమధ్యంబున ♦ శయనించు బహువిధ
ములఁ దన్నుఁ బిలువంగఁ ♦ బలుకలేక
తే॥ గీ॥ చటులతరకాలపాశవ♦శంగతాత్ముఁ
డగుచు బిడ్డలఁ బెండ్లాము ♦ నరసిపోవుచు
[2]చింతవికలములైన హృ♦షీకములును
గలిగి విజ్ఞానమును బాసి ♦ కష్టుఁ డగుచు. స్కం. 983

33 సీ॥ అటు చాల ఘురఘుర♦మనుశబ్ద మడరంగ
మనమున జంతాని♦మగ్నుఁడగుచుఁ
గొడుకులఁ గోడండ్రఁ ♦ గూతుల నల్లుండ్ర
మనుమల నాప్తుల ♦ ననుచరాళి
ననయంబు నల్పమా♦త్రానశిష్టంబైన
గృహకోశనివహాప♦రిచ్ఛదముల
మసలు నహంకార♦మమకారములఁజేసి
మతిహీనుఁ డగుచు నె♦మ్మనములోనఁ
తే॥ గీ॥ గణఁకఁ దలఁచుచు విప్రయో♦గమునఁ దాను
గటకటా యిట్లు పరలోక♦గతుఁడనైన
నిట్టి భార్య యనాథయై ♦ యీకుమార
వరుల నేరీతిఁ బోషించునో ♦ [3]యవని ననుచు. చ. 824

34 క॥ తనపుత్రులు దనతనయలు
ననయముఁ దాఁ జనినయెడ ని♦రాశ్రయు లగుచుఁ
వననిధిమధ్యంబున నవి
సిన కలముం బోలి యెట్లు ♦ జీవించెదరో. చ. 826

(1) దొరయ (2) చిత్తము వికలమైన (3) యరసియనుచు.

35 సీ॥ పడఁతి యే మును భుజింపక ♦ భుజింపదు నేను
నిద్రపోవక మఱి ♦ నిద్రపోదు
నేను నీళ్ళాడక ♦ నీళ్ళాడ నొల్లదు
పదరి యేఁ గోపింప ♦ భయమునొందు
[1]భర్జించుటకు మాఱుఁ♦బలుకగ వాయోడు
బుద్ధిహీనుఁడ నైన ♦ బుద్ధిఁ జెప్పు
లలిమీఱ నిట్టి క♦ళత్రంబుతో నేను
గడఁగి దేహాంతర♦గతుఁడ నైన
తే॥ గీ॥ ననయమును దాను బతిప్రి♦యగుటఁ జేసి
యాత్మశోచిని యగుచు గృ♦హస్థధర్మ
మాచరించుచునుండునో ♦ యనుగమనము
సేయునోయని మనమునఁ ♦ జింత నొంది. చ. 825

36 వ॥ అంత మరణావస్థం బొందుసమయంబున నతిభయంకరాకారులు సరభసేక్షణులు నగు యమదూతలిద్దరు దనముందర నిలిచినఁ జూచి త్రస్తహృదయుండై శకృన్మూత్రంబులు విడుచుచు యమపాశ(ంబులచే, గళంబున) బద్ధుండై శరీరంబువలన నిర్గమించి యాతనాశరీరంబు నవలంబించి (బలాత్కారంబున) దీర్ఘంబై దుర్గమంబగు మార్గంబునుబొంది (రాజ)భటులచే నీయమానుండగుచు దండనంబున కభిముఖుండై చను [2]నపరాధిచందంబునఁ జనుచుండి. త్రి. 984

37 చ॥ అనయము మూర్ఛనొందు శున♦కావళిచేతను భక్ష్యమాణుఁడై
యనుపమకాలకింకరభ♦యంకరతర్జనగర్జనంబుల
న్మనము గలంగ దేహము స♦మస్తముఁ గంపమునొందఁగాఁ బురా
తనభవపాపకర్మసము♦దాయముఁ జిత్తములోఁ దలంపుచున్
త్రి. 985

38 సీ॥ అనుపమక్షుత్తృష్ణ♦లంత వ్యథలఁ జేయ
ఝంఝానిలజ్వాల♦జ్వలనచండ
భానుప్రదీప్తిత♦ప్తంబైన వాలుకా
మార్గానుగతతప్య♦మానగాత్రుఁ

---

(1) భర్జించినను (2) భటుని.

డై వీఁపు కశలచే ♦ నడపంగ వికలాంగుఁ
డగుచు మార్గమునందు ♦ నచట నచటఁ
జాల మూర్ఛిల్లి యా♦శ్రయశూన్యమగు నీళ్ల
మునుఁగుచు లేచుచు ♦ మొనసి పాప
తే॥ గీ॥ రూపమగు తమములచే ని♦రూఢుఁ డగుచు
వెలయఁ దొంబదితొమ్మిది♦ వేల యోజ
నముల దూరంబుగల యమ♦నగరమునకుఁ
బూని యమభటు ల్గొంపోవఁ ♦ బోవునంత. త్రి. 986

39 వ॥ ఇట్లు మహాపాపాత్ముండైనవాఁడు ముహూర్తత్రయ కాలంబునను సామాన్యదోషి యగువాఁడు [1]ద్విముహూర్తంబున నేగి యాతనం బొందు నందు. త్రి. 987

40 క॥ పట్టుదురు కొఱవులను వడిఁ
బెట్టుదు రసిపత్రికలను ♦ బెనుమంటలయం
దొట్టుదు రొడళ్లు నలియ
న్మొట్టుదు రప్పాపచిత్తు ♦ మత్తుం బెలుచన్. త్రి. 988

41 ఉ॥ ముంతురు తప్తతోయముల ♦ మొత్తుదు రుగ్రగదాసిధారలన్
ద్రెంతురు పొట్టప్రేవులు వ♦ధింతురు మీఁద నిభేంద్రపఙ్క్తి నొ
ప్పింతురు ఘోరభంగిఁ గఱ♦పింతురు పాములచేత బిట్టు ద్రొ
బ్బింతురు మీఁద గుండ్లఁ దిని♦పింతురుఁ దేహముఁ గోసి ఖండలున్.
త్రి. 989

42 వ॥ మఱియుఁ గుటుంబపోషణంబునఁ గుక్షింభరుం డగుచు నధర్మపరుండై భూతద్రోహంబున నతిపాపుండై నరయంబునం బొంది నిజధనంబులు గోలుపడి మొఱవెట్టు నాపన్నునిచందంబునఁ [2]బరస్పర సంబంధంబునఁ గల్పింపఁబడినఁ దమిస్రాంధతామిస్రరౌరవాదులగు నరకంబులంబడి తీవ్రంబులైన బహుయాతనల ననుభవించి క్షీణ పాపుండై పునర్నరత్వంబునుం బొందునని చెప్పి వెండియు నిట్లనియె.
త్రి. 990

(1) ముహూర్తద్వయంబున (2) జరమంబగు తమిస్రాంధంబున.

43 సీ॥ కంటిరే మనవారు ♦ ఘనులు గృహస్థులై
విఫలులై గైకొన్న ♦ వెఱ్ఱితనము
భద్రార్థులైయుండి ♦ పాయరు సంసార
పద్ధతి నూరక ♦ పట్టువడిరి
కలయోనులందెల్ల ♦ గర్భాద్యవస్థలఁ
బురుషుండు దేహియై ♦ పుట్టుచుండుఁ
ద న్నెఱుంగఁడు ♦కర్మతంత్రుఁడై కడపట
ముట్టఁడు భవశత♦ములకు నైన
ఆ॥ వె॥ దీన శుభము లేదు ♦ దివ్యకీర్తియు లేదు
జగతిఁ బుట్టి పుట్టి ♦ చచ్చి చచ్చి
పొరలనేల మనకుఁ ♦ బుట్టని చావని
త్రోవ వెదకికొనుట ♦ దొడ్డబుద్ధి. న. 214

44 శా॥ హాలాపానవిజృంభమాణమదగ♦ర్వాతీత దేహోల్లస
ద్బాలాలోకనశృంఖలానిచయసం♦బద్ధాత్ములై లేశము
న్వేలానిస్సరణంబుఁ గానక మహా♦విద్వాంసుడుం గామినీ
హేలాకృష్టకురంగశాబక మగుఁ ♦ హీనస్థితి న్వింటిరే. న.216

45 క॥ మోహితుఁడై వసుకాంతా
వాహినిలోఁ జిక్కి కూర♦వశుఁడై [1]యెవ్వం
డూహాపోహ లెఱుంగక
దేహము నలఁగంగఁజేయు ♦ దీనత నొందున్. ఏ. 99

46 క॥ మండనహాటకపశువే
దండాశ్వవధూదుకూల♦ధాన్యాదులు పె
క్కుండియు నాశాపాశము
నిండింపఁగలేవు [2]జగతి ♦ నిజ మిది సుమ్మీ. న. 581

47 శా॥ ఆశాపాశము దాఁ గడున్నిడుపు లే ♦ దంతంబు రాజేంద్ర వా
రాశిప్రావృత మేదినీవలయసా♦మ్రాజ్యంబు చేకూడియుం

(1) మనుజుం (2) గడమయుచుమ్మీ

గాసిం బొందిరిగాక వైన్యగయభూ♦కాంతాదులు న్నర్థకా
మాశ న్బాయఁగనేర్చిరే మును నిజా♦శాంతంబులం జూచిరే॥
అ. 579

48 క॥ కడలే దాశాలతకును
గడఁ జూడఁగఁ గానరాదు ♦ కడఁ గనిరేని
న్గడుముదమున సంసారము
కడఁ గందురు తత్త్వవిదులు ♦ కమలదళాక్షీ. స. 580

49 క॥ వెంగలివిత్తయి [1]తిరుగక
సంగజులీలలను ముక్తి ♦ నాశించు సతం
డంగనలతోడ విడువని
సంగడములు వదలవలయు ♦ జలజాతముఖీ!. స. 584

50 సీ॥ లలిసుమనోవాటి♦కలయందు నల్పప్ర
సూనమరందగం♦ధానుమోద
సంచారితము మృగీ♦సహితముఁ దన్నివే
శితచిత్తమును మధు♦వ్రతనినాద
మేదురశ్రవణాను♦మోదితమును బురో
భాగచరన్నిజ♦ప్రాణహారి
దీపితవృకగణా♦ధిష్ఠితమును లుబ్ధ
కక్రూరఘనసాయ♦కప్రభిన్న
తే॥ గీ॥ పృష్ఠభాగమునై మనం♦బునను మృత్యు
భీతి వాటింప నొందు ద♦ప్పింప వెరవుఁ
గాన కడవిఁ జరించు మృ♦గంబుపగిది
భూవరోత్తమ! వినుమయ్య ♦ పురుషుఁ డెప్డు. చ. 880

51 క॥ [2]వెడవిలుతు కేళిఁ జిగురా
కడిదపువేటునకు లొంగి ♦ యతిమోహితుఁడై
విడువక సతులం దగిలెడు
జడునకు నెక్కడివి బుద్ధి♦చాతుర్యంబుల్. స. 570

(1) తిరుగుచుఁ గంగారై చెడక ముక్తి కాంక్షించు (2) వెడవింటివాని

52 క॥ పలుకులు మధురసధారలు
దలఁపులు నానాప్రకార♦దావానలము
ల్సెలుములు సాలావృకములు
చెలువల నమ్ముటలు వేద♦సిద్ధాంతములే. అ. 310

53 ఉ॥ దారలయందుఁ బుత్రధన♦ధాన్యములందు ననేకభంగులం
గూరిమిచేయు మర్త్యుఁ డతి♦ఘోరవియోగజదుఃఖమగ్నుఁడై
నేరుపుదక్కి చిక్కువడి ♦ నీతివివేకవిహీనుఁడై మనో
భారముతోఁ గపోతపతి♦భంగి నిజంబుగఁబోవు నష్టమై. ఏ. 95

54 మ॥ చెలులుం దండ్రులుఁ దల్లు లాత్మజులు సం♦సేవ్యు ల్సతు ల్చారుని
ర్మలగేహంబులటంచుఁగూ ర్తురుమహా♦మాయాగుణభ్రాంతులై
కలలోఁ దోఁచిన యర్థము ల్నిజములే♦ కర్మానుబంధంబులం
గలుగు స్సంగము లేక మానుఁ బిదపన్♦గర్మాంతకాలంబునన్.
స. 55

55 చ॥ మృతియును జీవనంబు నివి ♦ మేదినిలోపల జీవకోటికిన్
సతతము సంభవించు సహ♦జం బిది చోరవహ్నితాశసర్పసం
హతులను దప్పి యోఁకటను ♦ బంచతనొందెడు నట్టిజీవుఁ[1]డున్
వెతలను బూర్వకర్మభవ♦వేదన లొందుచుఁ గుందు నెప్పుడున్.
ద్వా. 27

56 తే॥ గీ॥ బాంధవజ్ఞాతిసుతులును ♦ బగతు లాత్మ
వరు లుదాసీనమధ్యస్థ♦వర్గములును
నరవిఁ గనుచుందు రొక్కొక్క♦జన్మమునను
నెఱయఁ బ్రాణికి నొకవావి ♦ నిజము గలదె. ష. 463

57 క॥ గజతురగాదిశ్రీలను
నిజమని నమ్మంగరాదు ♦ నిత్యమును హరిన్
గజిబిజిలేక తలంచిన
సుజనులకును నతనియందుఁ ♦ జొరఁగా వచ్చున్. ద్వా. 7

58 క॥ తరుణీపుత్రధనాదుల
మరిగి మహారాజ్యవిభవ♦మదమత్తుఁడనై

(1) డాపదలనుగుంది పూర్వమగు పాపఫలంబు భుజించు నెప్పుడున్.

నరతను లుబ్ధుఁడనగు నా
కరయఁగ బహుకాల మీశ ♦ యాఁటడిబోయెన్. ద. 1659

59 క. ముదిసెను దంతావళియును
ముదిసెను గేశములు దనువు ♦ ముదిసెం దనకున్
ముదియనివి రెండు చిక్కెను
బ్రిదికెడితీపియును విషయ♦పక్షస్పృహయున్. న. 579

60 సీ॥ కామహర్షాదిసం♦కలితమై చిత్తంబు
భవదీయచింతన♦పదవి సొరదు
మధురాదిరసముల ♦ మరిగి చొక్కుచు జిహ్వ
నీవర్ణనమునకు ♦ నిగుడనీదు
సుందరీముఖములఁ ♦ జూడఁ గోరెడిచూడ్కి
తావకాకృతులపైఁ ♦ దగులువడదు
వివిధదుర్భాషలు ♦ వినఁగోరు వీనులు
వినవు యుష్మత్కథా♦విరచనములు
తే॥ గీ॥ ఘ్రాణ మురువడిఁ దిరుగు దు♦ర్గంధములకుఁ
దనివు గొలుపదు వైష్ణవ♦ధర్మములకు
నడఁగియుండవు కర్మేంద్రి♦యములు పురుషుఁ
గలఁచు సవతులు గృహమేధిఁ ♦ గలఁచునట్లు. స. 363

61 క॥ నీమాయఁ జిక్కి పురుష
శ్రీమూర్తిగ జనము నిన్ను ♦ సేవింపరు వి
త్తామయగృహగతమై సుఖ
తామసమై కామవంచి♦తంబై యీశా. ద. 1657

62 చ॥ కడపటిసేఁత నైహిక సు♦ఖంబులఁ గోల్పడి చిత్తకోర్కి వెం
బడిఁబడి యెండ[1]మావులఁ బి♦పాసులునై సలిలాస డాయుచు
న్నెడుమనుజు ల్భవాబ్ధి దరి♦జేరఁగలేక నశింతు రట్టి యీ
యిడుమలఁ బొందఁజాలము ర♦మేశ త్రిలోకశరణ్య మాధవా.
ద. 752

(1) మావులను బాలిశులై.

63 క॥ ఘటకుడ్యసన్నిభంబగు
చటులకళేబరము జొచ్చి ♦ జనపతినంచు
న్బటుచతురంగంబులతో
నిటనటఁ దిరుగుదును నిన్ను ♦ నెఱుఁగమి నీశా. ద. 1660

64 క॥ నరవరసంజ్ఞితమై రథ
కరిసేవితమైన యొడలు ♦ కాలగతి న్భ
కగమృగభక్షితమై దు
స్తరవిట్క్రిమిభస్మసంగ♦తంబగు నీశా. ద. 1662

65 మ॥ అతిమోహాకులితంబు సాంద్రమమతా♦హంకారమూలంబు సం
తతనానాసుఖదుఃఖపీడిత మని♦త్యం బట్టి దేహంబు సం
కృతి నాకేటికి మీనజీవనముభం♦గిం భీతిబాహుళ్య మం
చితరుల్పెద్దలు దీనిఁ జేకొనరు స♦ర్వేశున్మదిం గొల్పెదన్. న. 369

66 చ॥ పరఁగుచునున్న దుర్వ్యసన♦భాజనమై ఘనదుఃఖమూలమై
యరయఁగ బెక్కుతూట్లుగల♦దై క్రిమిసంభవమైనయట్టి దు
స్తరబహుగర్భవాసముల♦సంగతి మాన్పుటకై భజించెద
న్సరసిజనాభభూరిభవ♦సాగరతారకపాదపద్మముల్. తృ. 1003

67 మ॥ కలలం బోలెడి పుత్రమిత్రవనితా♦గారాదిసంయోగము
[1]ల్జలవాంఛారతి యెండమావులకు నా♦సల్సేయు చందంబున
న్దలఁతు న్సత్యములంచు మూఢుఁడ వృ♦థాతత్త్వజ్ఞుఁడన్నాకునీ
విలసత్పద్మపదంబుచూపి కరుణ ♦ న్వీక్షింపు లక్ష్మీపతీ. ద. 1238

68 మ॥ అరవిందాక్షపదారవిందమకరం♦దాసక్తులైనట్టి స
త్పురుషశ్రేష్ఠులవృత్తము ల్వినక దు♦ర్బుద్ధి [2]న్విలంఘించి దు
ర్నరవార్తాకథనప్రపంచములు గ♦ర్వప్రాప్తము ల్సేసి వా
సరముల్ వ్యర్థతఁద్రోచుచుండఁ జన దీ♦సంసారమోహంబునన్.
ప్ర. 392

---

(1) జలధారల్ సరిగొండ (2) విడంబించి

69 మ॥ హరిఁ జింతింపక మత్తుఁడై విషయచిం♦తాయత్తుఁడై చిక్కి వా
సరము [1]ద్రోచెడువాఁడు గింకరగదా♦సంతాడితోరస్కుఁడై
ధరణీశోత్తమ దండ[2]భృన్నిలయస♦ద్ద్వారోపకంఠాగ్రవై
తరణీవహ్ని శిఖాపరంపరలచే ♦ దగ్ధుండు గాకుండునే. ద్వి. 24

70 క॥ ఏనరుఁ డే నొకనిమిషం
బైన వృథావాదగతిని ♦ హరిపదకమల
ధ్యానానందుఁడు గాఁడే
నా నరునకు నాయు వల్ప♦మగు మునినాథా! తృ. 194

71 ఉ॥ అచ్చపుఁజీఁకటిం బడి గృ♦హావ్రతులై విషయ[3]ప్రమత్తులై
చచ్చుచుఁ బుట్టుచు న్మఱలఁ ♦ జర్వితచర్వణులైనవారికిం
జెచ్చెరఁబుట్టునే పరులు ♦ సెప్పిననైన నిజేచ్ఛనైన నే
మిచ్చిననైనఁ గానలకు ♦ నేగిననైన హరిప్రబోధముల్. స. 181

72 సీ॥ వాసుదేవశ్లోక♦వార్త లాలించుచుఁ
గాల మేపుణ్యుండు ♦ గడపుచుండు
నతనియాయువుదక్క ♦ నన్యులయాయువు
నుదయాస్తమయముల ♦ నుగ్రకరుఁడు
వంచించి కొనిపోవు♦ వాఁ డది యెఱుఁగక
జీవింతుఁ బెక్కేండ్లు ♦ సిద్ధ మనుచు
నంగనాపుత్రగే♦హారామవిత్తాది
సంసారహేతుక♦సంగసుఖముఁ
తే॥ గీ॥ దగిలి వర్తింపఁ గాలము ♦ తఱినెఱింగి
దండధరకింకరులు వచ్చి ♦ తాడనములు
సేసికొనిపోవఁ బుణ్యంబు ♦ సేయనైతిఁ
బాపరతినైతి నని బిట్టు ♦ పలవరించు. ద్వి. 47

73 సీ॥ సంసారజీమూత♦సంఘంబు విచ్చునే
చక్రిదాస్యప్రభం♦జనము లేక
తాపత్రయాభీల♦దావాగ్ని లాఱునే
విష్ణుసేవామృత♦వృష్టి లేక

(1) ద్రొబ్బెడు (2) భృన్నివసన (3) ప్రవిష్టులై.

సర్వాంకషాఘౌఘ♦జలరాసు లింకునే
హరిమనీషాబడ♦బాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధ♦కారంబు లడఁగునే
పద్మాప్తునుతిరవి♦ప్రభలు లేక
తే॥ గీ॥ నిరుపమాపునరావృత్తి♦నిష్కళంక
ముక్తినిధిఁ గానవచ్చునే ♦ ముఖ్యమైన
శార్ఙ్గకోదండచింతనాం♦జనము లేక
తామరసగర్భునకునైన ♦ దానవేంద్ర. స. 171

74 శా॥ శోధింపంబడె సర్వశాస్త్రములు ర♦క్షోనాథ వెయ్యేటికి
న్నాథ లాప్తమధవక్షేముషీతరణిసాం♦గత్యంబునం గాక దు
ర్మేధం దాఁటఁగవచ్చునే సుతవధూ♦మీనోగ్రవాంఛామద
క్రోధోల్లోల విశాలసంసృతిమహా♦ఘోరామితాంభోనిధిన్. స. 183

75 క॥ ఉరుసంసారపయోనిధి
తరణంబులుఁ బాపపుంజ♦దళనంబులు శ్రీ
కరణంబులు ముక్తిసమా
చరణంబులు బాలకృష్ణ♦సంస్మరణంబుల్. ద. 246

76 క॥ భవములకు మందు చిత్త
శ్రవణానందము ముముక్షు♦జనపదము హరి
స్తవము పశుఘ్నుఁడు దక్కను
జెవులకు దనివయ్యె ననెడి ♦ చెనటియుఁ గలఁడే. ద. 5

77 తరల॥ హరినెఱుంగక నింటిలో బహు♦హాయనంబులు మత్తుఁడై
పొరలుచుండెడివెఱ్ఱి ముక్తికిఁ ♦ బోవనేర్చునె వాఁడు సం
సరణముం బెడఁబాయఁ డెన్నఁడు ♦ సత్య మాహరినామసం
స్మరణ మొక్కముహూర్తమాత్రము♦చాలు ముక్తిదమౌ
నృపా. ద్వి. 8

78 ఆ॥ వె॥ దనుజ భుజగ యక్ష♦ దైత్యమృగాభీర
సుందరీ విహంగ ♦ శూద్ర శబరు

లైనఁ బాపజీవు♦లైన ముక్తికిఁ బోదు
రఖిలజగము విష్ణుఁ ♦ డనుచుఁ దలఁచి. స. 245

79 చ॥ అనుపమబ్రహ్మవాదులగు ♦ నంచితయోగిజనానుగీయమా
ననిజకథాసముత్సుకుఁ డ♦నందగునేను మదీయులంద నూ
తనముగ నుందుఁ గావున ను♦దారత వారికి నీగృహావళుల్
ఘనభవబంధహేతువులు♦గా వినియంతయు నిక్క మారయన్.
చ. 914

80 చ॥ అరయ గృహస్థులయ్యును మ♦దర్పితకర్ములు నస్మదీయసుం
దరచరితామృతశ్రవణ♦తత్పరమానసయాతయాములు
న్సరసగుణాఢ్యులై తనరు ♦ సాధుల కీ గృహము ల్దలంప దు
ష్కరభవబంధహేతువులు♦గావు నృపాత్మజులార యెన్నఁడున్.
చ. 912

81 చ॥ విను మదిగాక యీభువి ది♦విం బలుమారుఁ జరించు నాత్మ దా
ధనపశుపుత్రమిత్ర వని♦తా[1]తతిపైఁ దగులంబు మాని న
న్ననఘుని విశ్వతోముఖు నన♦న్యగతి న్భజియించె నేని వా
నిని ఘనమృత్యురూపభవ♦నీరధి నేఁ దరియింపఁజేయుదున్.
తృ. 886

82 క॥ తమతమధర్మము తప్పక
సములైనను నమ్మి తిరుగు ♦ సభ్యులకును బం
ధము ననుఁ జూచిన విరియును
గమలాప్తుఁడు వొడమ విరియు ♦ ఘనతమము క్రియన్. ద.411

83 ఆ॥ వె॥ తనువు మనువు విడచి ♦ తనయులఁ జుట్టాల
నాలి విడిచి సంప♦దాళి విడిచి
నన్నె కాని యన్య ♦ మెన్నఁడు నెఱుఁగని
వారి విడువ నెట్టి♦వారినైన. స. 121

84 క. లౌకిక మొల్లక నన్నా
లోకించు ప్రపన్నులకును ♦ లోఁబడి కరుణా

(1) రతిపై.

లోకనములఁ బోషింతును
నా కాశ్రితరక్షణములు • నైసర్గికముల్. ద. 1439

5 క॥ వాదములు వేయునేటికి
వేదోక్తవిధిం జరించు•విబుధుఁడు గృహమం
దాదరమున నారాయణ
పాదంబులఁ గొలిచి ముక్తి•పదమున కేఁగున్. స. 470

---

# సగుణ ప్రకరణము.

## ౧. సగుణ తత్త్వము.

1 చ॥ ఎఱిఁగినవాఁడు గర్మచయ♦మెల్లను మాని హరిస్వరూపము౯
నెఱయ నెఱుంగుఁ దాను మది♦ నేరుపఁజూపు గుణానురక్తుఁడై
తెఱకువలేక భ్రమ్మఱుచు ♦ దేహధనాద్యభిలాషయుక్తుఁడై
యెఱుఁగనివానికిం దెలియ ♦ నీశ్వరలీల లెఱుంగఁ జెప్పుమా.
ప్ర. 99

2 క॥ అగుణునకు [1]నిర్వికారికి
జగదవనోద్భవవినాశ♦సత్కర్మములుం
దగులీల లెట్లు లాతఁడు
సగుణుండై యుండు టెట్లు ♦ సౌజన్యనిధీ! తృ. 232

3 సీ॥ ఈశుండు హరి విష్ణుఁ ♦ డీ[2]విశ్వ మంతయుఁ
బుట్టించు రక్షించుఁ ♦ బొలియఁజూచు
బహుశక్తియుతుఁడగు ♦ భగవంతుఁ డవ్యయుఁ
డాది నేశక్తుల ♦ నాశ్రయించి
బ్రహ్మశక్రాదిరూ♦పముల వినోదించెఁ
గ్రమమునవో యేక♦కాలమునవో
ప్రకృతిగుణంబులఁ♦బట్టి గ్రహించుట
నేకత్వమునసుండు ♦ నీశ్వరుండు
ఆ॥ వె॥ భిన్నమూర్తియగుచుఁ ♦ బెక్కువిధంబుల
నేల యుండు నతని ♦ కేమివచ్చె
నుండకున్నఁ దాప♦సోత్తమ! దెలుపవే
వేడ్కతోడ [3]నాకు ♦ వేదవేద్య. ద్వి. 56

4 సీ॥ పూర్ణుఁడయ్యును మహా♦భూతపంచకయోగ
మున మేనులను బుర♦ములు సృజించి

---

(1) నీశ్వరునకు (2) విశ్వ మేరీతి (3) సర్వవేది వీవు

పురములలో నుండి ♦ పురుషభావంబున
దీపించు [1]నెపుడు న♦దీనవృత్తిఁ
బంచభూతములను ♦ బదునొకొం డింద్రియ
ములను బ్రకాశించి ♦ భూరిమహిమ
షోడశాత్మకుఁడన ♦ శోభిల్లి జీవత్వ
[2]నిత్యవినోదంబు ♦ నెఱపుచుండు
తే॥ గీ॥ నట్టిభగవంతుఁ డవ్యయుఁ ♦ డచ్యుతుండు
మానసోదితవాక్పుష్ప♦మాలికలను
మంజునవరసమకరంద♦మహిమ పుట్ట
శిష్టహృద్భావలీలలఁ ♦ జేయుఁగాత. ద్వి. 68

5 సీ॥ అనఘ యేకోదక♦మై యున్నవేళ నం
తర్నిరుద్ధాసల♦దారువికృతి
భాతిఁ జిచ్ఛక్తిస♦మేతుఁడై కపటని
ద్రాలోలుఁడగుచు ని♦మీలితాక్షుఁ
డైననారాయణుం ♦ డంబుమధ్యమున భా
సురసుధాఫేనపాం♦డురశరీర
రుచులు సహస్రశి♦రోరత్నరుచులతోఁ
జెలిమి సేయఁగ నొప్పు ♦ శేషభోగ
తే॥ గీ॥ తల్పమునఁ బవ్వళించి య♦నల్పతత్త్వ
దీప్తిఁజెన్నొందఁగా నద్వి♦తీయుఁ డగుచు
[3]నభినుతుండయ్యుఁ గోర్కుల♦యందుఁ బాసి
ప్రవిమలాకృతి నానంద♦భరితుఁ డగుచు. తృ. 273

6 తే॥ గీ॥ యోగమాయావిదూరుఁడై ♦ యుగసహస్ర
కాలపర్యంత మఖిలలో♦కములు మ్రింగి
పేర్చి మఱికాలశక్త్యుప♦బృంహితమున
సమత సృష్టిక్రియాకలా♦పములఁ దగిలి. తృ. 274

---

(1) నెప్పుడు ధీరవృత్తి (2) నృత్త (3) నభిరతుండ

7 క॥ నరలోకవిడంబనమున
హరి పరమపరుండు మానవాకృతితో ని
ద్ధరఁ బుట్టి యాత్మమాయా
స్ఫురణన్ మోహింపఁజేయు ♦ భూజనకోటిన్. తృ. 69

8 క॥ ఎప్పుడు ధర్మక్షయమగు
నెప్పుడు పాపంబు లొదవు ♦ నీలోకములో
నప్పుడు విశ్వేశుఁడు హరి
దప్పక విభుఁడయ్యుఁ దన్నుఁ ♦ దా సృజియించున్. న. 726

9 క॥ దుష్టజననిగ్రహంబును
శిష్టప్రతిపాలనంబు ♦ సేయన్ హరి దా
సృష్టి నవతార మొందెను
స్రష్టృముఖానేకదివిజసంఘము వొగడన్. ఏ. 80

10 మ॥ సకలస్థావరజంగమప్రతతికి ♦ న్సర్గింపఁ దా నాద్యుఁడై
యకలంకశ్రుతిగర్భుఁడుం [1]బరుఁడు సర్వాద్యుండు నీశుండు సే
వక యోగీంద్రకుమారసిద్ధముని దేవశ్రేణి యోగప్రవ
ర్తకమై తన్ను భజింపఁ జూపు సగుణబ్రహ్మంబు లీలాగతిన్.
తృ. 1019

11 క॥ నిగమస్తుత! లక్ష్మీపతి
జగదంతర్యామి వగుచు ♦ సర్గము లెల్ల
న్నగు భవదైశ్వర్యంబున
నగణితసౌఖ్యానుభవము ♦ నందింతుగదే. తృ. 311

12 సీ॥ యజ్ఞేశ విశ్వంభ ♦ రాచ్యుత శ్రవణమం
గళనామధేయ లోకస్వరూప
యాపన్నభక్తజనార్తివిఖండనా
దీనలోకాధార ♦ తీర్థపాద
విశ్వోద్భవస్థితివిలయకారణభూత
[2]సంతతానందశశ్వద్విలాస

(1) బరముఁడు నైనట్టి యీశుండు (2) సంతతైశ్వర్య

మాయువు దేహంబు ♦ ననుపమలక్ష్మియు
వసుధయు దివముఁ ది♦వర్గములను
తే॥ గీ॥ వైదికజ్ఞానయుక్తియు ♦ వైరిజయము
నిన్నుఁగొలువని నరులకు ♦ నెఱయఁ గలదె
వినతమందార గుణహార ♦ వేదసార
ప్రణుతవత్సల పద్మాక్ష ♦ పరమపురుష. ఆ. 486

13 క॥ సరసిజనాభ భవత్పద
సరసీరుహ మాశ్రయించు♦జను లతిసౌఖ్య
స్ఫురణం బొలుపారుచు భువిఁ
జరియింపరె భక్తపారి♦జాత! మురారీ! ద. 1077

14 చ॥ సరసగతి న్మునీంద్రులు ప్ర♦సన్నశరీరహృషీకమానస
స్ఫురణ గలప్పు డవ్విభుని ♦ భూరికళాకలిత[1]స్వరూప మా
దరమిడి చూతు రెప్పుడుఁ గు♦తర్కితమోహతిచేత నజ్ఞతం
బొరసినయప్పు డవ్విభుని♦మూర్తిఁ గనుంగొనలేరు నారదా!
ద్వి. 113

15 మ॥ వరయోగీంద్రులు యోగమార్గముల భా♦వంబందు నేనీమనో
హరరూపంబుఁ దలంచి యేగుణగణ♦ధ్యానంబుఁ గావింతు ర
ప్పురుషశ్రేష్ఠపరిగ్రహంబునకునై ♦ పొల్పారఁ దద్ధ్యానగో
చరమూర్తి న్ధరియింతుగాదె పరమో♦త్సాహుండవై మాధవా!
తృ. 299

16 సీ॥ పరమాత్మ! మర్త్యసు♦పర్వతిర్యఙ్మృగ
దితిజసరీసృప♦ద్విజగణాది
సంవ్యాప్తమును సద♦సద్విశేషంబును
గైకొని మహదాది ♦ కారణంబు
నైన విరాడ్విగ్ర♦హంబు నే నెఱుఁగుదుఁ
గాని తక్కన సుమం♦గళముసైన
సంతతసుమహిమై♦శ్వర్యరూపంబును
భూరిశబ్దాదివ్యా♦పారశూన్య

1 స్వరూపము౦

తే॥ గీ॥ మయిన బ్రహ్మస్వరూప మే • నాత్మ నెఱుఁగఁ
బ్రవిమలాకార సంసార•భయవిదూర
పరమమునిగేయ సంతత•భాగధేయ
నళిననేత్ర రమాలల•నాకళత్ర. చ. 287

* 17 సీ॥ తవిలి పదార్థభే•దగ్రాహకములైన
చక్షురింద్రియముల•సరవిఁ జూడఁ
గలుగు నీ రూపంబు • గడఁగి మాయామయం
బగు నసద్వ్యతిరిక్త•మగుచు మఱియు
జ్ఞానార్థకారణ•సత్వాదిగుణముల
కాశ్రయభూతమై • యలరుచున్న
నిరుపమాకారంబు • నీకు విలక్షణ
మైయుండు ననుచు నే • నాత్మఁ దలఁతు
తే॥ గీ॥ నిర్వికార నిరంజన • నిష్కళంక
నిరతిశయ నిష్క్రియారంభ • నిర్మలాత్మ
విశ్వసంబోధ్య నిరవద్య • వేదవేద్యఁ
ప్రవిమలానంద సంసార•భయవిదూర. చ. ౧౮౮

18 సీ॥ నళినాక్ష సత్వగు•ణంబు నీగాత్రంబు
గాదేని విజ్ఞాన•కలిత మగుచు
నజ్ఞానభేదనం • బగు టెట్లు గుణముల
యందును వెలుఁగు నీ • వనుమతింపఁ
బడుదువు సత్వరూ•పంబు సేవింపంగ
సాక్షాత్కరింతువు • సాక్షివగుచు
వాఙ్మనంబులకు న•వ్వలనైన మార్గంబు
గలుగు నీ గుణజన్మ•కర్మరహిత
తే॥ గీ॥ మైన రూపును బేరు న•త్యనఘబుద్ధు
లెఱుఁగుదురు నిన్నుఁగొల్వ నూ•హించుకొనుచు
వినుచుఁ దలఁచుచుఁ బొగడుచు • వెలయువాఁడు
భవము నొందఁడు నీపాద•భక్తుఁ డగుచు. ద. 97

---

* ఈపద్యము నాలుగవస్కంధమునఁ గానరాదు.

19 సీ॥ గృహమందు వర్తించు ♦ గృహమేధులగువారు
మహితధర్మార్థకా♦మములకొఱకు
సంప్రీతులగుచుఁ ద♦త్సాధనానుష్ఠాన
నిరతులై వేదని♦ర్ణీతభూరి
భగవత్సుధర్మత♦ద్భక్తిపరాఙ్ముఖు
లై దేవగణముల ♦ ననుదినంబు
భజియింపుచును భక్తిఁ ♦ బైతృకకర్మము
ల్సేయుచు నెప్పుడు ♦ శిష్టచరితు
తే॥ గీ॥ లగుచుఁ దగ దేవపితృ సుప్రీ♦తాఢ్యులయిన
కామ్యచిత్తులు ధూమాది♦గతులఁ జంద్ర
లోకములఁ జెంది పుణ్యంబు ♦ [1]లోపమయిన
మరలి వత్తురు భువికి జ♦న్మంబు నొంద. తృ. 1013

20 ఉ॥ పూని యనేకజన్మములఁ♦బొంది తుదిం దనపుణ్యకర్మ సం
తానము పేర్మిఁ గర్మవసు♦ధాస్థలిఁబుట్టి ప్రపూర్ణ దేహుఁడై
మానవుఁడై గృహేచ్ఛఁబడు♦మందుఁ డజంబు తృణాభిలాషియై
కానకపోయి నూతఁబడు♦కైవడి నీపదభక్తిహీనుఁడై. ద. 1658

21 తే॥ గీ॥ చేతులారంగ శివునిఁ బూ♦జింపఁడేని
నోరునొవ్వంగ హరికీర్తి ♦ నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ ♦ దలఁపఁడేనిఁ
గలుగ నేటికిఁ దల్లుల♦కడుపుచేటు. ప్ర. 14

22 క॥ శ్రుతధనకులకర్మసము
న్నతమదములఁ జేసి సజ్జ♦నప్రతతికి సం
తత మొగ్గొనరించుచును గు
మతు లర్థిం జేయు పూజ ♦ మతిఁ గొనఁ డెందున్. చ. 961

23 ఆ॥ వె॥ నిన్ను ననుసరింప ♦ నేరని కుజనులు
పవనపూర్ణచర్మ♦భస్త్రిసమితి
వోలెఁ జేయుచుందు ♦ రుచ్ఛ్వసనంబులు
బలసి యాత్మభేద♦భజను లగుచు. ద. 1213

(1) లుప్తమయిన

24 ఉ॥ రాజసతామసాత్ములకు • రాదుగదా నినుఁ గాన నవ్యపం
కేజదళాయతాక్ష! ముని•గేయ! పవిత్రచరిత్ర! విస్ఫుర
ద్రాజకళాధరాజసుర•రాజముఖామరమౌళిరత్నవి
భ్రాజితపాదపీఠ! భవ•బంధవిమోచన! పద్మలోచనా!
ద. 1147

25 క॥ సత్త్వేతరగుణపాశవ
శత్వంబునఁ బొంద వీరు • జలజాక్షు సదై
కత్వంబుఁ గాననోపరు
సత్త్వప్రధాన్యు లితర•జనులకు సరియే! ష. 171

26 తే॥ గీ॥ సతతహింసాతిదంభమా•త్సర్యరోష
తమములను జేయుచును భేద•దర్శియగుచుఁ
బరఁగ నాయందుఁ గావించు•భక్తిఁ దలఁపఁ
దామసంబనఁ దగువాఁడు • దామసుండు. తృ. 953

27 క॥ ఘనవిషయప్రావీణ్యము
లను [1]మహదైశ్వర్య యశము • లను బూజాద్య
ర్థాని నను నర్థి భజించుట
చను రాజసయోగమనఁగ • సౌజన్యనిధీ! తృ. 954

28 క॥ దళమైనఁ బుష్పమైనను
ఫలమైనను సలిలమైనఁ • బాయనిభక్తి
న్గొలిచిన జను లర్పించిన
నెలమి నుపచిరాన్నముగనె • యేను భుజింతుఁగా. ద. 1010

29 సీ॥ అబ్జాక్షి! నిఖిలభూ•తాంతరాత్ముఁడనైన
నాయందు భూతగ•ణంబునందు
నతిభేదదృష్టి మా•యావులై సతతంబు
బాయక వైరాను•బంధనిరతు
లగువారి మనములఁ • దగులదు శాంతి యె
న్నఁటికైన నేను నా•కుటిలజనులు

(1) సుమహైశ్వర్య

మానక యెప్పుడు సా♦మాన్యాధికద్రవ్య
సమితిచే మత్పదా♦ర్చన మొనర్ప
తే॥ గీ॥ నర్థి నాచిత్తమున ముదం ♦ బందకుందు
ననుచు నెఱింగించి మఱియు ని♦ట్లనియెం గరుణఁ
గలితసద్గుణజటిలుఁ డ♦క్కపిలుఁ డెలమిఁ
దల్లితోడ గుణవతీమ♦తల్లితోడ. తృ. 965

30 చ॥ అనిశము సర్వభూతహృద♦యాంబుజవర్తి యనం దనర్చు నీ
శు నను నవజ్ఞఁజేసి మను♦జుం డొగి మత్ప్రతిమార్చనావిడం
బనమున మూఢుఁడై యుచిత♦భక్తిని నన్ను భజింపఁడేని య
మ్మనుజుఁడు భస్మకుండమున ♦ మానక వేల్చిన యట్టివాఁ డగున్. తృ. 964

31 క॥ జీవావలిఁ గల్పించుచు
జీవావలిలోనఁ దగ వ♦సించుచుఁ బ్రియవ
స్త్వావలిలోపలఁ బ్రియవ
స్త్వావలినై యుండు నన్ను ♦ ననిశముఁ బ్రీతిన్. తృ. 330

32 చ॥ అనుపమపాపకర్మపరి♦హారముకై భజనీయుఁడైన శో
భనచరితుం డితం డనుచు ♦ భావమునం దలపోసి భక్తిచే
ననితరయోగ్యత న్భగవ♦దర్పణబుద్ధి నొనర్చి కర్మము
ల్జనహితకారియై నెగడ ♦ సాత్త్వికయోగమనంగఁ జొప్పడున్. తృ. 955

33 క॥ సాధులహృదయము నా యది
సాధులహృదయంబు నేను ♦ జగముల నెల్లన్
సాధుల నేన యెఱుంగుదు
సాధు లెఱుంగుదురు నాదు♦చరితము విప్రా! న. 123

34 క॥ నా తేజము సాధులలో
నాతతమైయుండు వారి ♦ నలఁచు జనులకున్
హేతిక్రియ భీతి నిచ్చును
జేతోమోదంబు చెఱచు ♦ సిద్ధము సుమ్మీ. న. 125

35 సీ॥ నిత్యనైమిత్తిక♦నిజధర్మమున గురు
శ్రద్ధాగరిష్ఠతఁ ♦ జతురపాంచ
రాత్రోక్త హరిసమా♦రాధనక్రియలను
నిష్కామనంబున ♦ నెఱి మదీయ
విగ్రహదర్శన♦వినుతిపూజావంద
నధ్యానసంశ్రవ♦ణములఁ గర్మ
సంగి గాకుండుట ♦ సజ్జనప్రకరాభి
మానంబు నొందుట ♦ హీనులందుఁ
తే॥ గీ॥ జాల ననుకంప సేయుట ♦ సములయందు
మైత్రినెరపుట యమనియ♦మక్రియాది
యైన యోగంబుచేత నా♦ధ్యాత్మికాధి
భౌతికాదులఁ దెలియుట ♦ పలుకుటయును. తృ. 959

36 క॥ హరిగుణమంగళకీర్తన
పరుఁడై తగ నార్జవమున ♦ భగవత్పరుల
న్గర మనురక్తి భజించుట
నిరహంకారమున నుంట ♦ నిశ్చలుఁ డగుటన్. తృ. 961

37 క॥ ఇవిమొదలు గాఁగఁ గలుగు భ
గవదుద్దేశస్వధర్మ♦కలితుండై పీ
ని వలనఁ బరిశుద్ధగతిం
దవిలిన మదిగలుగు పుణ్య♦తముఁ డెవ్వఁడలన్. తృ. ప 962

38 సీ॥ మఱియు నహంకార♦మమకారశూన్యులై
యర్థి వర్తింపుచు ♦ నర్చిరాది
మార్గగతుండును ♦ మహనీయచరితుండు
విశ్వతోముఖుఁడును ♦ విమలయశుఁడు
జగదుద్భవస్థాన♦సంహారకారణుం
డవ్యయుఁ డజుఁడు ప♦రాపరుండు
పురుషోత్తముఁడు నవ♦పుండరీకాక్షుండు
నైన సర్వేశ్వరు♦నందుఁ బొంది

తే॥ గీ॥ మాని తాపునరావృత్తి♦మార్గమయిన
ప్రవిమలానంద తేజోవి♦రాజమాన
దివ్యపదమున సుఖయించు ♦ ధీరమతులు
మఱలిరా రెన్నఁటికిని జ♦న్మములఁ బొంద. త్రి. 1017

39 సీ॥ అట్టి సర్వేశ్వరుఁ ♦ డయ్యాయికాలంబు
లందును దద్గుణ♦వ్యతికరమున
జనియించుచుండు నీ♦చాడ్పున ఋషి దేవ
గణములు దమతమ♦కర్మ నిర్మి
తైశ్వర్యపారమే♦ష్ఠ్యము లొందు పురమత్వ
మొంది యయ్యధికార♦ములు వహించి
వర్తించి కర్మముల ♦ వత్తురు మఱికొంద
ఱారూఢకర్మాను♦సారమైన

తే॥ గీ॥ మనములను జాలఁగలిగి ధ♦ర్మములయందు
శ్రద్ధతోఁగూడి యప్రతి♦షిద్ధమైన
నిత్యనైమిత్తికాచార♦నిపుణులగుచుఁ
దగి రజోగుణకలితచి♦త్తమును గలిగి. త్రి. 1020

40 వ॥ సకాములై యింద్రియజయంబు లేక పితృగణంబుల నెల్లప్పుడు పూజించుచు గృహంబులయందు వర్తించి హరిపరాఙ్ముఖులగు వారు త్రైవర్గికపురుషు లని చెప్పంబడుదురు. త్రి. 1021

41 చ॥ అలవడ ధూమమార్గగతు♦లై పితృలోకముఁబొంది పుణ్యముం బొలిసినవారు దొంటి తమ♦పుత్రులకుం దగఁదాము పుట్టి వి హ్వాలమతి గర్భగోళ పత♦నాదివ రేతధరా[1]క్రియాంతమై వెలసిన కర్మ మిం దనుభ♦వింతురుగావున నీవు భామినీ! త్రి. 1028

42 క॥ విను సర్వభావములఁ బర
ముని ననఘు ననంతు నీశుఁ ♦ బురుషోత్తము [2]స
న్మనమున భజియింపుము ముద
మునఁ బునరావృత్తిలేని ♦ ముక్తి లభింపన్. త్రి. 1024

---

(1) గతాంతమై (2) నన్నునయము

43 క॥ కరణత్రియంబుచేతను
నరుఁ డేకర్మంబు సేయు • నయ్యై వేళన్
హరి కర్పణ మని పలుకుట
పరువడి సుజ్ఞానమండ్రు • పరమమునీంద్రుల్. ఏ. 42

44 క॥ నీవారై నీదెసఁ దమ
భావంబులు నిలిపి ఘనులు • భయవిరహితులై
యేవిఘ్నంబులఁ జెందక
నీ వరయఁగ మేటిచోట • నెగడుదు రీశా. ద. 95

45 ఆ॥ వె॥ ఆశ్రయించుజనుల • కానందసందోహ
మీఁ దలంచి వివిధ• హేలతోడ
నప్రపంచకుండ•వయ్యుఁ బ్రపంచంబు
వెలయఁజేయు దీవు • విశ్వమూర్తి. ద. 577

46 చ॥ జననము లేని నీవు భవ•సంగతి నొందుట కేమికారణం
బనియును గాలసంహరుఁడ•వై జగము ల్విలయించునీవు పా
యని రిపుభీతికై సరిదు•దంచితదుర్గము నాశ్రయించు టె
ట్లనియును దేవ! నా మనము•నందుఁ దలంతు సరోజలోచనా.
తృ. 153

47 మ॥ జననం బందుటలేని యీశ్వరుఁడు దా • జన్మించు టెల్ల న్విరో
ధినిరాసార్థము వీతకర్ముఁడగు న•ద్దేవుండు గర్మప్రవ
ర్తనుఁ డౌ టెల్లఁ జరాచరప్రకట భూ•త శ్రేణుల న్గర్మవ
ర్తనులం జేయఁ దలంచికాక కలవే • దైత్యారికిం గర్మముల్.
తృ. 73

48 క॥ జలచరమృగ [1]భూసురనర
కులముల జన్మించి తీవు • కుజనులఁ జెఱుపన్
జెలిమిని సుజనుల మనుపను
దలపోయఁగరాదు నీవి•ధంబు లనంతా. ద. ప. 56

---

1 సురముని నర

49 క॥ తలపోయఁగ నప్రాకృత
బలయుక్తచతుర్భుజాది♦భవదవతారం
బులు [1]నీకు రూపములునై
పొలుపొందుంగాదె పరమ♦పురుష మహాత్మా! తృ. 853

50 క॥ అనయము భవదీయాశ్రిత
జనసంరక్షణముకొఱకు ♦ సమ్మతితోఁ దా
ల్చిన మానవరూపంబులు
ననురూపము [2]లగునుగాదె ♦ హరి నీ కెపుడున్. తృ. 855

51 క॥ మదిఁ దనశాసనమిడి నిజ
పదములు సేవించు లోక♦పాలాదులు పెం
పొదవింప యదుకులంబున
నుదయించెను భువిని బలస♦హోదరుఁ డగుచున్. తృ. 75

52 క॥ పురుషాకృతిఁ బ్రతియుగమునఁ
బురుషోత్తముఁ డవతరించి ♦ భూరిభుజావి
స్ఫురణ న్దుష్టనిశాటుల
హరియించుచునుండు మునిగ♦ణార్చితపదుఁడై. తృ. 626

53 క॥ బలియుర దండింపఁగ దు
ర్బలురను రక్షింప జగతి♦పై నిజలీలా
కలితుఁడవై యుగయుగమున
నలవడ నుదయింతుగాదె ♦ యభయ! యనంతా! ద. 649

54 క॥ భగవంతుండగు విష్ణువు
జగముల కెవ్వేళ రాక్ష♦సవ్యధ గలుగున్
దగ నవ్వేళలఁ దడయక
యుగయుగమునఁ బుట్టి ♦ కాచు నుద్యల్లీలన్. ప్ర. 65

55 ఆ॥ వె॥ మంచివారికెల్ల ♦ మంగళ ప్రదమగుఁ
గల్లరులకు మేలు♦గానియట్టి

1 నీ కనురూపములై, 2 లయ్యె

తనువు లెన్నియైనఁ ♦ దాల్చి లోకములకు
సేమ మెల్లప్రొద్దు ♦ సేయు దీవు. ద. 93

56 క॥ నీమాయచేత విశ్వము
వేమాఱు సృజింతు వనుచు ♦ విష్ణుఁడ వనుచున్
ధీమంతులు గుణపదవిని
నేమంబున నగుణుఁడైన ♦ నినుఁ గాంతు రొగిన్. అ. 166

57 క॥ నిను నాలు గాశ్రమంబుల
జనములు సేవింప నఖిల♦జనముల సత్వం
బును శుద్ధంబును శ్రేయం
బును నగుగాత్రంబు నీవు ♦ పొందుదువు హరీ ! ద. 96

58 క॥ పరికింపఁగ నే మనుజుఁడు
హరిపదమునఁ బొందఁజేయు ♦ నట్టివివేక
స్ఫురణముఁ దనర్చు వానికిఁ
బరువడి నిలఁ బొందరాని♦పదముం గలదే! చ. 663

59 ఉ॥ పుట్టువులేని నీకభవ ! ♦ పుట్టుట క్రీడయొకాక పుట్టుటే
యెట్టనుడున్ భవాదిదశ ♦ లెల్లను [1]జీవమునందు విద్యఁదాఁ
బుట్టుచునుండుఁ గాని నినుఁ ♦ బుట్టినదింబలెఁ బొంతనుండియుం
జుట్టఁగలేదు తత్క్రియలఁ ♦ జొక్కనియొక్కటి [2]వాదు ఫీశ్వరా!
ద..99

60 మత్త॥ ఒక్కవేళను సూక్ష్మరూపము ♦ నొందు దీ వణుమాత్రమై
యొక్కవేళను స్థూలరూపము ♦ నొందు దంతయు నీవయై
పెక్కురూపులు దాల్తు నీదగు♦పెంపు మాకు నుతింపఁగా
నక్కజం బగుచున్న దేమన ♦ నంబుజాక్ష రమాపతీ. ఏ. 16

61 ఉ॥ విశ్వము లీలఁ ద్రిప్పుచు న♦విద్యకుఁ జుట్టమునైన నీకు నా
శాశ్వతమైనకాల మిది ♦ సర్వము వేదబమందు రట్టి వి

1 జీవులయందు. 2 గంటి మీశ్వరా

శ్వేశ్వర ! మేలుకుప్ప నిను ♦ నెప్పుడుఁ గోరి భజించువాఁడె పో
శాశ్వతలక్ష్మి మృత్యుజయ♦సౌఖ్యయుతుం డభయుండు మాధవా
ద. 127

62 క॥ భువనములు సేయఁ గావఁగ
నవతీర్ణుఁడ వైతి కాదె ♦ యఖిలేశ్వర ! యో
గివరేణ్య విశ్వమంగళ !
కవిసన్నుత ! వాసుదేవ ! ♦ కల్యాణనిధీ ! ద. 407

63 క॥ అభవుఁడ వయ్యును జగతిం
బ్రభవించుట లీలగాక ♦ భవ మొందుటయే
ప్రభువులకుం బ్రభుఁడవు మము
సభయాత్ముల నరసి కావఁ ♦ జను నార్తిహరా ! ద. 652

64 ఆ॥ వె॥ ఆర్తజనుల మమ్ము ♦ నరసి రక్షించు మ
హాత్మ ! భక్తజనభ♦యాపహరణ !
నిన్ను మది నుతించి ♦ నీకు మ్రొక్కెదము నీ
చరణయుగము మాకు ♦ శరణ మనఘ ! ద. 648

65 క॥ అనయమును భువనరక్షణ
మునకై స్వేచ్ఛానురూప♦మునఁ బుట్టెడి వి
ష్ణుని భయవిరహితమగు పద
వనజయుగం బర్థిఁ గొల్తు ♦ వారనిభక్తిన్. తృ. 993

66 చ॥ హరి భవదీయతత్త్వము స♦మంచితభక్తి నెఱుంగ నేను నా
సరసిజసంభవాదులును ♦ జాలరు సత్త్వగుణాశ్రయుండవు
న్పరుఁడవు నిర్గుణుండవును ♦ బ్రహ్మము [1]నై తగునీకు నందఱు
న్గరము చతుర్విధార్థ ఫల♦కాంక్షల మ్రొక్కెద రాదరింపుమా.
చ. 195

67 ఆ॥ వె॥ దుర్గమంబులైన ♦ స్వర్గాదిఫలములఁ
బుట్టఁజేయఁ జాలు♦నట్టిగుణముఁ

---

1 మున్న గునీకు నెప్డు నిం, దరము.

గలిగి మెలఁగుచున్న ♦ ఘనుఁడ వైనట్టి నీ
కరయ మ్రొక్కెడువార ♦ మాదిపురుష! ష. 335

68 సీ॥ దేవాదిదేవ! యీ ♦ దృశ్యరూపంబగు
సుమహితవిశ్వంబుఁ ♦ జూచు ప్రత్య
గాత్మభూతుండవై ♦ నట్టినీవు నసత్ప్ర
కాశ[1]రూపంబులై ♦ గలుగు మామ
కేంద్రియంబులచేత ♦ నీశ్వర! నీమాయ
నొందించి పంచభూ♦తోపలక్షి
తం బగు దేహివి♦ధంబునఁ గానంగఁ
బడుదువుగాని యే♦ర్పడిన శుద్ధ
తే॥ గీ॥ సత్వగుణయుక్తమైన భా♦స్వత్స్వరూప
ధరుఁడవై కానఁబడవుగా ♦ పరమపురుష!
యవ్యయానంద! గోవింద! ♦ యట్లు గాన
యెనయ మాజీవనము లేక ♦ నేమి గలవు? చ. 191

69 సీ॥ అనయంబు దేహి ని♦త్యానిత్యసద్వ్యల
క్షణమునఁ బంచకో♦శవ్యవస్థ
లను వృద్ధిఁ బొరయుచు ♦ నందులోపల నన్న
[2]ప్రాణాదిబుద్ధి వి♦జ్ఞానమయము
లను చతుష్కోశంబు♦లవ్వల వెలుఁగొందు
నానందమయుఁడవు ♦ గాన దేవ!
సురుచిరస్వప్రకా♦శుండవు నీపరి
గ్రహము గల్గుటఁ జేసి ♦ కాదె ప్రకృతి
తే॥ గీ॥ మహదహంకారపంచత♦న్మాత్రగగన
పవన తేజోంబుభూ భూత♦పంచకాది
కలితతత్త్వంబు బ్రహ్మాండ♦కార్యకరణ
మందు నెపుడు సమర్థంబు ♦ లగుటఁజేసి. ద. 1211

70 క॥ కోరి శరీరులు భవదను
సారంబున నిహపరైక♦సౌఖ్యంబులఁ బెం

---

1 రూపమై పరగు. 2 ప్రాణాన్న.

పారఁగ నందుచు నుందురు
ధీరజనోత్తము లనంగ ♦ దివిజారిహరా! ద. 1212

71 వ॥ శబ్ద స్పర్శ రూప రసగంధంబులనియెడు గుణంబులచేతం బరిగ్ర
హింపఁబడిన మంగళ సుందర విగ్రహుండవై యజ్ఞానాంధకారనివార
కంబైన స్వరూపంబుఁ గైకొని భవదీయులైన సేవకులకు ననుభావ్యంబవైతి.
భవత్పాదారవింద మకరంద రసాస్వాదలోలాత్ములైన యోగీంద్రుల
కైనను భవన్మార్గంబు స్ఫుటంబుగాఁ దట్లగుటం జేసి యీమనుజపశువు
లకు దుర్విభావ్యంబగుట యేమి చెప్ప; నట్టియీశ్వరుండవైన నీకు నిచ్ఛ
స్వతంత్రం బదియును నా కధికంబు గావున నిన్ను నే ననుసరింతు. దేవా!
నీ వశించనుండ వైతేని బలిభోక్తలైన బ్రహ్మేంద్రాదు లెవ్వనికొఱకు
బలిసమర్పణంబు నేసిరి? నీవు సమస్తపురుషార్థమయుండవనియును, ఫల
స్వరూపివనియును, నీయందలి ప్రేమాతిశయంబులం జేసి విజ్ఞానదీపాం
కురంబున నిరస్తసమస్తదోషాంధకారులై యిహసౌఖ్యంబులు విడిచి,
భవదీయదాస సంగమంబె కోరుచుందు; రట్లు సేయనేరక నిజాధికా
రాంధకారమగ్నులై భవత్తత్వంబుఁ దెలిసి బలిప్రక్షేపణంబులు సేయం
జాలక మూఢులై సంసారచక్రంబునం బరిభ్రమింతు; రదియునుం గాక.
ద. 249

72 ఆ॥ వె॥ వరమునీంద్రయోగి♦వరసురకోటిచే
వర్ణితప్రభావ♦వై భవంబు
గలిగి యఖిలచేత♦నులకు విజ్ఞానప్ర
దుండ వగుదు వభవ! ♦ దురితదూర! ద. 250

73 క॥ జనములు నిను సేవింపని
దినములు వ్యర్థంబులగుచుఁ ♦ దిరుగుచునుందుర్
దనువులు నిలుకడ కావఁట
వనములలో నున్ననైన ♦ వనరుహనాభా! ఏ. 14

74 సీ॥ వలనొప్పఁ దను ననువర్తించు నిందిరా
కామినీమణిఁ దదా♦కాంక్షు లగుచు

ధృతి ననువర్తించు • దేవేంద్రముఖ్యుల
[1]నైన నెవ్వఁడు చూడఁ • డాత్మ నట్టి
నిత్యస్వతంత్రుని • నిజభక్త[2]వరదుని
దీనవత్సలగుణా•ధీశు నజునిఁ
బురుషోత్తముని జగ•ద్భరితు సర్వేశ్వరు
నారాయణునిఁ జిదా•నందమయుని
తే॥ గీ॥ నజితు నచ్యుతుఁ బుండరీ•కాయతాక్షుఁ
దవిలి సేవింపకుండునే • ధరఁ గృతజ్ఞుఁ
డైనపురుషుండు సమ్మోది•తాత్ముఁ డగుచుఁ
జారుమతులార! రాజకు•మారులార! చ. 963

75 సీ॥ అనఘాత్మ! మఱి భవ•దవతారగుణకర్మ
ఘనవిడంబనహేతు•కంబు లయిన
రమణీయమగు దాశ•రథివసుదేవకు
మారాదిదివ్యనా•మంబు లోలి
వెలయంగ మనుజులు • వివశాత్ములై యవ
సానకాలంబున • సంస్మరించి
జన్మజన్మాంతర•సంచితదురితంబుఁ
బాసి కైవల్యసం•ప్రాప్తులగుదు
తే॥ గీ॥ రట్టి దివ్యావతారంబు • లవతరించు
నజుఁడవగు నీకు మ్రొక్కెద • ననఘచరిత!
చిరశుభాకార! నిత్యల•క్ష్మీవిహార!
భక్తమందార! దుర్భర•భవవిదూర! తృ. 305

76 ఆ॥ వె॥ పుణ్యభూము లరుగు • పుణ్యతీర్థంబులఁ
గ్రుంకు పుణ్యజనులఁ • గోరి చూచు
పుణ్యకథల వినుము • భూపాలపుత్రిక!
మేలుగలుగు[3]నట్టి•మేర గలదు. ప. 198

---

1 నే ననువర్తింప కెప్పుడాత్మ 2 వరదుఁడు దీనవత్సలుఁడును నైనయట్టి 3నింటి

77 క॥ దురితవినాశకపదపం
కరుహా భవత్కీర్తితీర్థ♦కణచయబాహ్యాం
తరనేకధూతకల్మష
పురుషులు ధరమీఁదఁ దీర్థ♦భూతులు గారే? చ. 716

78 ఉ॥ ఈవిధ మాత్మలం దెలిసి ♦ యెప్పుడు సజ్జనసంఘము ల్జగ
త్పావనమైన నీగుణక♦థామృత మాత్మలఁ గోరి సర్వతీ
ర్థావళిఁ గ్రుంకినట్టి ఫల ♦ మందుదు రంచు సమస్తవేదము
ల్పావిరిఁ బల్కఁగావునను♦ వారలు ధన్యులు మాన్యు లుత్తముల్.
త్యా. 1038

79 మ॥ హరినామాంకితసత్కథామృతరస♦వ్యాలోలుఁడై నట్టి స
త్పురుషశ్రేష్ఠుఁ డసత్కథాలవణవాః♦పూరంబుఁ దాఁ గ్రోలునే
వరమందారమరందపానకుతుక♦స్వాంతద్విరేఫంబు స
త్వరమై పోవునె చేఁతివేములకుఁ ద♦ద్గంధానుమోదాత్మమై.
త్యా. 224

80 మ॥ వివరింపన్ హరి యజ్ఞమూర్తిఁ బరమున్ ♦ విష్ణున్ హృషీకేశుఁ గే
శవుఁ బద్మాక్షు గుఱించి జన్నములు శ♦శ్వద్భక్తిఁ గావింపు మా
ధవుఁ డాత్మ న్పరితోష మొందు నతఁ డు♦ద్యత్ప్రీతిఁ గైకొన్న లో
కవితానంబులు తుష్టినొందు ననఘా ♦ కావింపుమా యజ్ఞముల్.
త్యా. 400

81 మ॥ కమలాధీశ్వరుఁ బూజసేయుట సమ♦గ్రప్రీతిఁ బ్రాణోపహా
రము సర్వేంద్రియతృప్తిహేతువును స♦ర్వజ్ఞాత్మజ మూలాభిషే
కము శాఖాభుజపుష్టిదంబునగు రే♦ఖ న్సర్వదేవార్హణ
క్రమమై యొప్పు ధరావరేణ్యసుతులా♦రా బుద్ధి నూహించినన్.
చ. 954

82 క॥ సువ్యక్త[1]తంత్రరూపకుఁ
డవ్యక్తుఁ డనంతుఁ డభవుఁ ♦ [2]డచ్యుతుఁ డీశుం
డవ్యయుఁ డగుహరి సురగుణ
సేవ్యుఁడు క్రతుఫలదుఁడగుటఁ ♦ జేసిరి మఖముల్. త్యా. 100

(1) మంత్రరూపకు (2) డాద్యుం డీశుం

83 చ॥ మనువులు దేవదానవులు ♦ మానవనాథులు మర్త్య[1]కోటి దా
రనయము వారివారికిఁ బ్రి♦యంబగు దేవతలన్ [2]భజించుచున్
ఘనతరనిష్ఠ యజ్ఞములఁ ♦ గైకొని చేసిరి తత్ఫలంబు ల
య్యనుపమమూర్తియజ్ఞమయుఁ♦డైన రమావరునందుఁజెందఁగన్.
ద్వి. 99

84 చ॥ అరయఁగ క్షుద్రభూతహృద♦యంబులయందుల నంతరాత్మవై
తిరముగనుండునీవు భవ♦దీయపదాంబురుహద్వయార్చనా
పరమతులైన [3]మాకును శు♦భప్రదభూరిమనోరథంబు లీ
[4]వరుదుగ నీవె భక్త[5]హృద♦యప్రమదప్రద ముక్తిదాయకా.
చ. 924

85 మ॥ భగవంతుం బరమున్ జనార్దనుఁ గృపా♦పారీణు సర్వాత్మకున్
జగదీశున్ హరి సేవసేయు మతఁడు ♦ న్సాంగత్యముంబొంది నీ
కగు సిద్ధార్థము లెల్ల నిచ్చు నిఖిలా♦ర్థావాప్తి చేకూఱెడి
న్భగవత్సేవలఁ బొందరాదె బహుసౌ♦భాగ్యంబులం బ్రేయసీ!
అ. 480



(1) కోటియు న్ననయము (2) గుణించుచున్ (3) మామక (4) వెలుఁగనె (5) హృదయేప్సితదాయక లోకనాయకా.

# ౪ నిర్గుణ ప్రకరణము

## ౧. జ్ఞానబోధ.

1 వ॥ వినుండు సకల జన్మంబులందును ధర్మార్థాచరణకారణం
బయిన మానుషజన్మంబు దుర్లభం; బందుఁ బురుషత్వంబు దుర్గమం;
బదియు శతవర్ష పరిమితంబయిన జీవితకాలంబున నియతంబై యుండు;
నందు సగ మంధకారబంధురంబయి రాత్రిరూపంబున నిద్రాదివ్యవ
హారంబుల నిరర్థకంబై చనుఁ; జిక్కిన పంచాశద్వత్సరంబులందును [1]బాల్య
యౌవన కౌమార కైశోర వయోవిశేషంబుల వింశతిహాయనంబులు
గడచుఁ; గడమ ముప్పదియబ్దంబులు నింద్రియంబులచేతఁ బట్టువడి
దురవగాహంబులైన కామక్రోధ లోభ మోహ మదమత్సరంబులను
పాశంబులఁ గట్టువడి విడివడ సమర్థుండుగాక ప్రాణంబుల కంటె
మధురాయమాణమైన తృష్ణకు లోనై భృత్యతస్కరవణిక్కర్మంబులఁ
బ్రాణహానికైన నంగీకరించి పరార్థంబుల నర్థించుచు రహస్యసంభోగ
చాతుర్య సౌందర్య విశేషంబుల ధైర్యవల్లికాలవిత్రంబులయిన కళ
త్రంబులను మహనీయమంజుల మధురాలాపంబులు గలిగి వశులయిన
శిశువులను శీలవయోరూపధన్యలగు కన్యలను వినయవివేక విద్యా
లంకారులయిన కుమారులను గామిత ఫలప్రదాతలగు భ్రాతలను
మమత్వప్రేమదైన్యజనకు లయిన జననీజనకులను సకల సౌజన్య
సింధువులయిన బంధువులను ధనకనక వస్తువాహన సుందరంబులైన మం
దిరంబులను సుకరంబులైన పశుభృత్య నికరంబులను వంశపరంపరా
యత్తంబులయిన విత్తంబులను వర్జింపలేక సంసారంబు నిర్జింప నుపా
యంబుఁగానక తంతువర్గంబున నిర్గమద్వార శూన్యంబయిన మంది
రంబుఁజేరి[2] చిక్కువడి వెడలెడి పాటవంబు చాలక తగులువడు కీటకంబు
చందంబున గృహస్థుండు స్వయంకృతకర్మబద్ధుండయి శిశ్నోదరాది
సుఖంబులఁ బ్రమత్తుండై నిజకుటుంబ పోషణ పారవశ్యంబున విరక్తి

---

(1) బాల్యకైశోర (2) చుట్టువడి

మార్గంబుఁ దెలియనేరక స్వకీయ పరకీయ భిన్నభావంబున నంధకారం బునం బ్రవేశించుఁ; గావునఁ గౌమారసమయంబున మనీషాగరిష్ఠుండై పరమభాగవతధర్మం బనుష్ఠింపవలయు. దుఃఖంబులు వాంఛితంబులుగాక చేకుఱుభంగి సుఖంబులు గాలానుసారంబులై లబ్ధంబు లగుం గావున వృథాప్రయాసంబున నాయుర్వ్యయంబు సేయందగదు. హరిభజనంబున మోక్షంబు సిద్ధించు; విష్ణుండు సర్వభూతంబులకు నాత్మేశ్వరుండు ప్రియుఁడు. ముముక్షుండగు దేహికి దేహావసానపర్యంతంబు నారాయణ చరణారవింద సేవనంబు కర్తవ్యంబు. స. 213

2 వ॥ కావున రాగాదియుక్త మనస్కుండైన శరీరికి సంసార చక్రనివర్తకంబైన హరిచింతనంబు బ్రహ్మమందలి నిర్వాణ[1]సుఖం బని బుధులు దెలియుదురు, హరిభజనంబు దుర్గమంబుగాదు, హరి సకలప్రాణి హృదయంబులయందు నంతర్యామియై యాకాశంబుభంగి నుండు. విష యార్జనంబుల నయ్యెడిది లేదు. నిమిషభంగుర ప్రాణులైన మర్త్యులకు మమతాస్పదంబులు చంచలంబులయిన పుత్రమిత్రకళత్ర పశుభృత్యబల బంధు రాజ్య కోశ మణిమందిర మంత్రి మాతంగ మహీప్రముఖ విభవం బులు నిరర్థకంబులు. యాగప్రముఖ పుణ్యలబ్ధంబులైన స్వర్గాదిలోక భోగంబులు పుణ్యానుభవక్షీణంబులుగాని నిత్యంబులుగావు. నరుండు విద్వాంసుండనని యభిమానించి కర్మంబు లాచరించి యమోఘంబు లయిన విపరీతఫలంబుల నొందుఁ; గర్మంబులు గోరక చేయవలయుఁ; గోరి చేసిన దుఃఖంబులు ప్రాప్తించుఁ; బురుషుండు దేహంబుకొఱకు భోగంబు లపేక్షించు; దేహంబు నిత్యంబుగాదు; తోడ రాదు, మృతం బయిన దేహమును శునకాదులు భక్షించు; దేహి కర్మంబు లాచరించి కర్మబద్ధుండై క్రిమ్మఱం గర్మానుకూలంబైన దేహంబుఁ దాల్చు; నజ్ఞానంబునంజేసి పురుషుండు గర్మదేహంబుల విస్తరించు; నజ్ఞాన తంత్రంబులు ధర్మార్థకామంబులు; జ్ఞానలభ్యంబు మోక్షంబు; మోక్ష ప్రదాతయగు హరి సకలభూతంబులకు నాత్మేశ్వరుండుఁ బ్రియుండు; దనచేతనైన మహాభూతంబులతోడ జీవసంజ్ఞితులైయుండు నిష్కాములై హృదయగతుండయిన హరిని నిజభక్తిని భజింపవలయు. స. 241

(1) సుఖం బెట్టి దట్టిదని

3 వ॥ అది గావున గురుశుశ్రూషయు సర్వలాభసమర్పణంబును సాధుజనసంగంబు నీశ్వరప్రతిమాసమారాధనంబును హరితత్పరత్వంబును వాసుదేవునియందలి ప్రేమయు నారాయణగుణకర్మకథానామ కీర్తనంబును వైకుంఠచరణకమలధ్యానంబును విశ్వంభర మూర్తివిలోకన పూజనంబులు మొదలైనవి జ్ఞాన వైరాగ్య లాభ సాధనంబులైన భాగవత ధర్మంబులపయి రతిగలిగి సర్వభూతంబుల యందు నీశ్వరుండు భగవంతుం డాత్మ గలండని సన్మానంబు సేయుచుం గామక్రోధలోభ మోహామదమత్సరంబులం గెలిచి యింద్రియవర్గంబును బంధించి భక్తి సేయుచుండ నీశ్వరుండైన విష్ణుదేవునియందుఁ గల గతి సిద్ధించు. స. 239

4 వ॥ కావున విషయంబులఁ జిక్కువడిన రక్కసులకు హరిభజనంబు శక్యంబుగాదు. రమ్యమయ్యును బహుతరప్రయాసగమ్యమని తలంచితిరేనిఁ జెప్పెద. సర్వభూతాత్మకుండై సర్వదిక్కాల సిద్ధుఁడయి బ్రహ్మ కడపలఁగాఁగల చరాచరస్థూలసూక్ష్మజీవసంఘంబులందును నభో వాయు కుంభినీ సలిల తేజంబు లనియెడు మహాభూతంబులందును భూతవికారంబులయిన ఘటపటాదులందును గుణసామ్యంబైన ప్రధానమందును [1] గుణవ్యతిరిక్తంబైన మహత్తత్త్వాదియందును రజస్సత్త్వతమోగుణంబులయందును భగవంతుం డవ్యయుం డీశ్వరుండు పరమాత్మ పరబ్రహ్మమనియెడు వాచకశబ్దంబులం గేవలానుభవానంద స్వరూపకుండు నవికల్పితుండు నిర్దేశ్యుండు ననిర్దేశ్యుండునైన పరమేశ్వరుఁడు ద్రిగుణాత్మకంబైన తనదివ్యమాయచేత నంతర్బహిశ్వరుండై వ్యాప్యవ్యాపకరూపంబులంజేసి దృశ్యుండును ద్రష్టయు భోగ్యుండును భోక్తయునై నిర్దేశింపందగి వికల్పితుండై యుండుఁ; దత్కారణంబున నాసురభావంబు విడిచి సర్వభూతంబులందును దయాసుహృద్భావంబులు గర్తవ్యంబులు;[2] దయగలిగిననధోక్షజుండు సంతసించు; ననంతుండాద్యుండు హరి సంతసించిన నలభ్యంబెయ్యదియు లేదు. జనార్దనచరణ సరసీరుహ యుగళస్మరణ సుధారసపాన పరవశుల మైతిమేని మనకు దైవవశంబున నకాంక్షితంబులై సిద్ధించు; ధర్మార్థకామంబులు కాంక్షి

(1) గుణవ్యతికరంబైన (2) దయాసుహృద్భావంబులు

తంబై సిద్ధించు; మోక్షంబననేల? త్రివర్గంబును నాత్మవిద్యయుం దర్క
దండనీతిజీవికాదులన్నియు త్రైగుణ్య విషయంబులైన వేదంబులవల
నం బ్రతిపాద్యంబులు; నిస్త్రైగుణ్య లక్షణంబునం బరమపురుషుండైన
హరికి నాత్మసమర్పణంబు సేయుట మేలు. పరమాత్మతత్త్వజ్ఞానోద
యంబునం జేసి స్వపరభ్రాంతిం జేయక పురుషుండు యోగావధూతత్వం
బున నాత్మవికల్ప భేదంబునం గలలోం గన్న విశేషంబుభంగిం దథ్యం
బనక మిథ్యయని తలంచును. స. 217

5 వ॥ దేవా! సకలయోనులందును సుఖవియోగ దుఃఖసం
యోగ జనితంబైన శోకానలంబున దందహ్యమానుండనై దుఃఖనివా
రకంబుకాని దేహాద్యభిమానంబున మోహితుండనై పరిభ్రమించుచున్న
యేను నాకుం బ్రియుండవు, సఖుండవు, పరమదేవతయునైన నీబ్రహ్మ
గీతంబులైన లీలావతారవిశేషంబులం బఠియించుచు రాగాది[1]విముక్తుం
డనై దుఃఖపుంజంబు లుత్తరించి భవదీయ చరణకమల స్మరణసేవా
నిపుణులైన భక్తులం జేరి యుండెద; బాలునిం దల్లిదండ్రులును రోగిని
వైద్యదత్తంబైన యౌషధంబును సముద్రంబున మునింగెడివాని
నావయును దక్కొరులు రక్షింపలేని తెఱంగున సంసారతాప సంతప్య
మానుండై నీచేత నుపేక్షితుండైనవాని నుద్ధరింప నిన్నుందక్క నన్యుండు
సమర్థుండుగాండు; జగంబుల నెవ్వం డేమికృత్యంబున నెవ్వనిచేతం
బ్రేరితుండై యేయింద్రియంబులం జేసి యేమిటికొఱకు నెవ్వనికి సం
బంధియై యేస్థలంబున నేసమయంబునం దేమిరూపంబున నేగుణంబైన
నేపరంబునవైన జనకాదిభావంబు నుత్పాదించి పరంబైన బ్రహ్మాది
భావంబున రూపాంతరంబునొందించు నట్టివివిధప్రకారంబులన్ని నీవ.
నిత్యముక్తుండవు రక్షకుండవు. నీయంశంబైన పురుషునికి నీయనుగ్రహం
బునం గాలంబుచేతం బ్రేరితయై కర్మమయంబును బలయుతంబును
ప్రధానలింగంబునునైన మనంబును మాయ సృజించు నవిద్యాన్విత
వికారంబును వేదోక్త కర్మప్రధానంబును సంసారచక్రాత్మకంబైన
యీమనమున నిన్ను సేవింపక నియమించి తరియింప నొక్కండును
సమర్థుండులేండు. విజ్ఞాన నిర్జిత బుద్ధిగుణుండవు. నీవు నీవలన వశీకృత

(1) వినిర్ముక్తుండనై

కార్యసాధనశక్తియైన కాలంబు మాయతోడం గూడ షోడశవికార యుక్తంబైన సంసార చక్రంబుఁ జేయుచుండు సంసారదావదహన సంతప్యమానుండనగు నన్ను రక్షింపుము. స. 356

6 వ॥ దేవా మునీంద్రులు నిజవిముక్తికాములై విజనస్థలంబులం దపంబులాచరింతురు. కాముకత్వంబు నొల్లకయుండు వారికి నీకంటెనొండు శరణంబు లేదు. [1]నిన్ను సేవించెదం; గొందఱు కాముకులు కరద్వయ కండూతిచేతం దనియని చందంబునఁ దుచ్ఛమైన పశుపక్షిక్రిమికీట సామాన్యంబైన మైథునాది గృహమేధిసుఖంబులం దనియక కడపట నతిదుఃఖవంతు లగుదురు. నీప్రసాదంబుగల సుగుణుండు నిష్కాముం డై యుండు. మానవ్రత జప తప శ్రుతాధ్యయనంబులును నిజధర్మ వ్యాఖ్యాన విజనస్థల నివాస [2]నియమంబులు మోక్షహేతువు లగు; నైన నివి పదియు నింద్రియజయంబు లేనివారికి భోగార్థంబులై [3]విశ్రమించు వారికి జీవనోపాయంబులై [4]డాంబికులకు వార్తాకరంబులై యుండు, సఫలంబులు గావు. భక్తిలేక భవదీయజ్ఞానంబు లేదు. రూప రహితుండవైన నీకు బీజాంకురంబులకై వడిఁ గారణకార్యంబులైన సదస ద్రూపంబులు రెండును బ్రకాశమానంబు లగు; నారెంటియందును భక్తి యోగంబున బుద్ధిమంతులు మథనంబున దారువులందు వహ్నిం గనియెడు తెఱంగున నిన్నుఁ బొడగందురు. పంచభూత తన్మాత్రంబులు ప్రాణబుద్ధీం ద్రియంబులును మనోహంకారచిత్తంబులును నీవ; సగుణంబును నిర్గుణం బును నీవ; గుణాభిమానులై జన్మమరణంబుల నొందు విబుధు లాద్యంతం బులుగానక నిరుపాధికుండవైన ని న్నెఱుంగరు. తత్త్వజ్ఞులైన విద్వాం సులు వేదాధ్యయనాదివ్యాపారంబులు మాని వేదాంతప్రతిపాద్యుండ వగు నిన్ను సమాధివిశేషంబుల నెఱింగి సేవింతు; రది గావున.

స. 366

7 వ॥ వినుము ప్రవాహకారిణియై విషయంబులచేతఁ బూరింప రాని తృష్ణచేతం బడి కర్మంబులఁ బరిభ్రామ్యమాణుండనైన నేను నానావిధయోనులందుఁ బ్రవేశించుచు వెడలుచు నెట్టకేలకు మనుష్య దేహంబు ధరియించి యందు ధర్మంబున స్వర్గద్వారంబును నధర్మంబున

1 కావున 2 సమాధులును 3 లైయుండు 4 విక్రయించు

శునకసూకరాది తిర్యగ్జంతుయోనిద్వారంబుల నొంది క్రమ్మఱమనుష్యుఁడై పుట్టవలయునని వివేకించి సుఖరక్షణ దుఃఖమోక్షణంబుల కొఱకు ధర్మంబులు సేయు దంపతుల వ్యవహారంబుఁ గని సర్వక్రియానివృత్తిఁ గలిగిన జీవుండు స్వతంత్రుండై ప్రకాశించునని నిర్ణయించి భోగంబులు మనోరథజాతమాత్రంబులు గాని శాశ్వతంబులుగావని పరీక్షించి నివృత్తుండనై యుద్యోగంబు లేక నిద్రించుచుఁ బ్రారబ్ధ భోగంబుల ననుభవించుచు నుండుదు; నివ్విధంబునఁ దనకు సుఖరూపంబైన పురుషార్థంబుఁ దనయందుఁ గలుగుట యెఱుంగక పురుషుండు శైవాలజాల నిరుద్ధంబులైన శుద్ధజలంబుల విడిచి యెండమావులు జలంబులనిపాఱెడు మూఢుని వడువున సత్యంబుగాని ద్వైతంబుఁ జొచ్చి ఘోరసంసార చక్ర పరిభ్రాంతుండై యుండు. దైవతంత్రంబులైన దేహాదులచేత నాత్మకు సుఖంబును దుఃఖనాశంబును గోరుచు నిరీశుండైనవానిప్రారంభంబులు నిష్ఫలంబులగు; నదియునుంగాక మర్త్యునకు ధనంబు ప్రాప్తంబైన నది దుఃఖకరంబుగాని సుఖకరంబుగాదు. లోభవంతులైన ధనవంతులు నిద్రాహారంబులులేక రాజ చోర యాచక శత్రు మిత్రాది సర్వస్థలంబులందు శంకించుచు దానభోగంబుల మఱచియుండుదురు. ప్రాణార్థవంతులకు భయంబు నిత్యంబు. శోకమోహాభయక్రోధరాగ శ్రమాదులు వాంఛామూలంబులు. వాంఛ లేకుండవలయు.

స. 435

8 వ॥ గృహస్థుండైనవాఁడు వాసుదేవార్పణంబుగా గృహోచితక్రియ లనుసంధించుచు మహామునుల సేవించి, వారలవలన నారాయణదివ్యావతారకథాశ్రవణంబుఁ జేయుచు నయ్యై విహితకాలంబుల శాంతజనులం గూడి [1]యుండుచుఁ, బుత్రమిత్రకళత్రాదిసంగంబులు గలల వంటివని యెఱుంగుచు లోపల నాసక్తిలేక సక్తునికైవడి వెలుపలఁ బురుషాకారంబు లొనర్చుచుఁ దగులంబులేక విత్తంబు లిచ్చి జనక సుత సోదర సఖి జ్ఞాతిజనుల చిత్తంబులు సమ్మతాయత్తంబులు గావించుచు ధనధాన్యనిదాన దైవలబ్ధంబులవలన నభిమానంబు మాని యనుభవించుచు గృహక్షేత్రంబులఁ జొచ్చి యుదరపూరణ మాత్రంబు

1 మెలంగుచు.

దొంగిలినవాని దండింపక భుజగ మృగ మూషక మర్కట మక్షికా ఖరోష్ట్రంబుల హింసింపక పుత్రుల భంగి నీక్షించుచు, దేశకాలదైవంబులకొలందిని ధర్మార్థకామంబులఁ బ్రవర్తించుచు, శునకపతితచండాలాదులకైనభోజ్యపదార్థంబులు తగినభంగి నిచ్చుచు, నిజవృత్తిలబ్ధంబులగు నశనాదులచేత దేవఋషి పితృభూతమానవుల సంతర్పించుచుఁ బంచమహాయజ్ఞావశేషంబుల నంతర్యామిపురుషయజనంబు నాత్మజీవనోపాయంబును సమర్థించుచు నుండవలయు. స. 445

9 వ. అది గావున ధర్మవేదియైనవాఁడు దైవప్రాప్తంబులైన కందమూలాదికంబులచేత నిత్యనైమిత్తిక క్రియలఁజేయవలయు; నిజధర్మబాధకంబైన ధర్మంబును బరధర్మ ప్రేరితంబైన ధర్మంబు నాభాసధర్మంబును బాషండధర్మంబును గపటధర్మంబును ధర్మజ్ఞుండైనవాఁడు మానవలయు; నైసర్గికధర్మంబు దురితశాంతిసమర్థం బగు. నిర్ధనుండు ధర్మార్థంబు యాత్ర చేయుచునైన ధనంబు గోరవలదు; జీవనోపాయంబునకు నిట్టట్టుఁ దిఱుగక కార్పణ్యంబులేక జీవించు మహాసర్పంబు తెఱంగున సంతోషంబున నాత్మారాముండై యెద్దియుంగోరక బ్రతికెడినుగుణునికెంగల సుఖంబు కామలోభంబులం దశదిశలం బరిధావనంబుఁ జేయువానికి సిద్ధింపదు. పాదరక్షలు గలవానికిఁ గర్కశ కంటకాదులవలన భయంబులేక మెలంగ నలవడుభంగిఁ గామంబుల వలన నివృత్తిగలవానికి నెల్లకాలంబును భద్రంబగు; నుపస్థకును జిహ్వాదైన్యంబునకును బురుషుండు గృహపాలక శునకంబుకైవడి సంచరించుచు సంతుష్టిలేక చెడు; సంతోషిగానివిప్రుని విద్యాతపోవిభవయశంబులు నిరర్థకంబులగు; నింద్రియలోలత్వంబున విజ్ఞానంబు నశించు; సకల భూలోక భోగంబులు భోగించియు దిగ్విజయంబుఁ జేసియు బుభుక్షాపిపాసలవలనఁ గామపారంబును, హింసవలనఁ గ్రోధపారంబును జేరుట దుర్లభంబు; సంకల్పవర్జనంబునఁ గామంబును, గామవర్జనంబునఁ గ్రోధంబును, నర్థానర్థ దర్శనంబున లోభంబును, నద్వైతానుసంధానంబున భయంబు, నాత్మానాత్మవివేకంబుల శోకమోహంబులును, సాత్త్వికసేవనంబుల దంభంబును, మౌనంబున యోగాంతరాయంబును, శరీరవాంఛలేమి హింసయు హితాచరణంబున భూతజంబైన దుఃఖంబును

సమాధిబలంబున దైవికవ్యథయును, ప్రాణాయామాదికంబున మన్మథవ్యథయును, సాత్త్వికాహారంబుల నిద్రయు, సత్త్వగుణంబున రజస్తమంబులును [1]గురుభజనకుశలుండై శీలంబున జయింపవలయు.
స. 456

10 వ. వినుము షడింద్రియంబులలోన నొకటియందుఁ దత్పరులై యిచ్ఛాపూరణవిధానంబులఁ జరితార్థులమైతి మనువారలు ధారణాభ్యాస సమాధియోగంబుల సాధింపలేరు. కృషిప్రముఖంబులు సంసారసాధనంబులుగాని మోక్షసాధనంబులుగావు. కుటుంబసంగంబునఁ జిత్తవిక్షేపంబగుఁ, జిత్తవిజయప్రయత్నంబున సన్న్యసించి సంగంబు వర్జించి మితంబైన భిక్షాన్నంబు భక్షించుచు శుద్ధవివిక్తసమప్రదేశంబున నొక్కచో నాసీనుండై సుస్థిరత్వంబునఁ బ్రణవోచ్చారణంబుఁ జేయుచు రేచక పూరక కుంభకంబులఁ బ్రాణాపానంబుల నిరోధించి కామహతంబైన చిత్తంబు పరిభ్రమణంబు మాని, కామవిసర్జనంబు చేసి మఱలునంతకు నిజనాసాగ్రనిరీక్షణంబుఁ జేయుచు నివ్విధంబున యోగాభ్యాసంబుఁ జేయువానిచిత్తంబు కాష్ఠరహితంబైనవహ్ని తెఱంగున శాంతిఁజెందుఁ గామాదులచేత వేధింపంబడక ప్రశాంతసమస్తవృత్తంబైన చిత్తంబు బ్రహ్మసుఖ సమర్పనంబు లీనంబై మఱియు నెగయనేరదు.
స. 460

11 వ. విను వైదికకర్మంబు ప్రవృత్తంబును నివృత్తంబు నన రెండు తెఱంగు లయ్యె; నందుఁ బ్రవృత్తంబునఁ బునరావర్తనంబును నివృత్తంబున మోక్షంబును సిద్ధించుఁ; బ్రవృత్తకర్మంబులోన నిష్టాపూర్తంబులన రెండుమార్గంబులు గల; వందు హింసాద్రవ్యమయ కామ్యరూపంబులైన దర్శపూర్ణమాసపశుయాగవైశ్వదేవ బలిహరణప్రముఖంబులైన యాగాదికంబు లిష్టంబులు; దేవతాలయ వన కూప తటాక ప్రముఖంబులు పూర్తంబులు; ప్రవృత్తకర్మంబున దేహంబు విడిచి దేహాంతరారంభంబున దేహి హృదయాగ్రంబున వెలుంగువాని తోడ నింద్రియంబులంగూడి భూతసూక్ష్మయుక్తుండై ధూమదక్షిణాయన కృష్ణపక్షరాత్రిదర్శంబులవలన సోమలోకంబుఁ జేరి భోగా

1 సుపశమంబున సత్త్వంబున

వసానంబున విలీనదేహుండై వృష్టిద్వారంబునఁ గ్రమంబున నోషధి లతాన్న శుక్లరూపంబులఁ బ్రాపించి భూమియందు జన్మించునది పున ర్భవరూపంబైన పితృమార్గంబు; నివృత్త కర్మనిష్ఠుండైనవాఁడు జ్ఞానదీప్తంబులైన యింద్రియంబులందుఁ, గ్రియాయజ్ఞంబుల యజించి యింద్రియంబుల దర్శనాదిసంకల్పరూపంబైన మనంబునందు, వికారయుక్తంబైన మనంబును వాక్కునందు, విద్యాదిలక్షణమైన వాక్కును వర్ణసముదాయంబునందును, వర్ణసముదాయంబు నకారాది స్వర త్రయాత్మకంబైన యోంకారంబునందు, నోంకారంబును బిందువందు, బిందువును నాదంబునందు, నాదంబును బ్రాణంబునందుఁ, బ్రాణంబును బ్రహ్మమందు నిలుపవలయు; దేవమార్గంబులైన యుత్తరాయణ శుక్లపక్ష దివా ప్రాహ్ణపూర్ణిమారాకలవలన సూర్య బ్రహ్మలోకంబులందుఁ జేరి భోగావసానంబున స్థూలోపాధిని విశ్వుండై సూక్ష్మంబునందు లయించి సూక్ష్మోపాధియైన తేజసుండై సూక్ష్మంబును గారణంబునందు లయించి కారణోపాధియైన ప్రాజ్ఞుండై కారణంబును సాక్షిస్వరూపంబునందు లయించి తుర్యుండై [1]సాక్షిలయంబునందు శుద్ధాత్ముండై యివ్విధంబున ముక్తుం డగును. స. 467

12 వ॥ వినుము దేహాదులకుఁ గారణత్వంబున నాదియందు, నవధికత్వంబున నంత్యమందును గలుగుచు, బహిరంగంబున భోగ్యంబును, నంతరంగంబున భోక్తయుఁ, బరంబునఁ బరంబును, జ్ఞానంబున జ్ఞేయంబును, వచనంబున వాచ్యమును, [2]బ్రకాశమునఁ బ్రకాశంబునైన వస్తువునకు వేఱొండులేదు ప్రతిబింబాదికంబు వస్తుత్వంబునంజేసి వికల్పితంబై తలంపంబడుభంగి నైంద్రియకంబైన సర్వంబును నర్థత్వంబున వికల్పితంబై తోఁచుంగాని పరమార్థంబుకాదు. దేహాదికంబులు [3]వినాశ్యంబులు వానికి హేతువులైన క్షితిప్రముఖంబులు [4]వినాశ్యంబులగుట సిద్ధంబు. పరమాత్మకు నవిద్యచేత నెంతతడవు వికల్పంబు దోఁచు నంత తడవును భ్రమంబు దోఁచు; నవిద్యానివృత్తియైన సర్వంబును మిథ్యయని శాస్త్రవిధినిషేధంబులునెఱింగి కలలోపల మేలుఁగన్న తెఱంగులగు భా

1 సూక్ష్మలయంబులందు 2 నప్రకాశంబును 3 మిథ్యాత్మికంబులు
4 మిథ్యాత్వంబగుట

వాద్వైత క్రియాద్వైత ద్రవ్యాద్వైతంబులు మూఁడు గల; వందుఁ బటతం తున్యాయంబునఁ గార్యకారణంబు లందు 'వస్తు వొక్కటియై యుండు నని యెఱింగి యేకత్వాలోచనంబు చేసి' వికల్పంబు లేదని భావించుట భావాద్వైతంబు; మనోవాక్కాయకృతంబులైన సర్వకర్మంబులను ఫల భేదంబుఁజేయక పరబ్రహ్మార్పణంబుఁ జేయుట క్రియాద్వైతంబు; పుత్ర మిత్రకళత్రాదిసర్వప్రాణులకుం దనకును దేహంబునకుం బంచభూతాత్మ కత్వంబున భోక్తయొక్కండను పరమార్థత్వంబున నర్థకామంబులయెడ నైక్యదృష్టిఁ జేయుట ద్రవ్యాద్వైతంబు; నేర్పున నాత్మతత్త్వాను భవం బున నద్వైతత్రయంబును విలోకించి వస్తుభేదబుద్ధియు స్వకీయ పరకీయ బుద్ధియు స్వప్నంబులుగాఁ దలంచి మునియైనవాఁడు మానవలయు.

స. 469

13 వ॥ వినుము దైవమాయంజేసి దేహాభిమానులైన మానవుల కుం బగవాఁడు, బంధుండు, నుదాసీనుండు నను మోహంబున సిద్ధంబై యుండు; జలాదులయందుఁ జంద్రసూర్యాదులును, ఘటాదులందు గగ నంబును పెక్కండ్రై కానంబడుభంగి దేహధారుల కందఱికి నాత్మ యొక్కండయ్యును బెక్కండ్రై తోఁచు; నాద్యంతంబులుగల యీ దేహంబు ద్రివ్యపాణిగుణాత్మకంబై యాత్మయందు నవిద్యచేతఁ గల్పితంబై దేహిని సంసారంబునం ద్రిప్పు; సూర్యుండు తటస్థుండై యుం డం బ్రకాశమానంబులైన దృష్టిరూపంబులం బోలె నాత్మ తటస్థుండై యుండ దేహేంద్రియంబులు ప్రకాశమానంబులగు; నాత్మకు వేఱొ క్కటితోడ సంయోగ వియోగంబులు లేవు; వృద్ధిక్షయంబులు చంద్ర కళలకుంగాని చంద్రునికి లేనిక్రైవడి జన్మనాశంబులు దేహంబునకుం గాని యాత్మకుఁ గలుగనేరవు. నిద్రవోయినవాఁ డాత్మను విషయ ఫలానుభవంబులు సేయించు తెఱంగున నెఱుకలేనివాఁడు నిజము కాని యర్థంబునందు ననుభవము నొందుచుండుఁ గావున. ద. 1781

14 వ॥ అట్టి పురుషరూపంబు నొందిన జీవుండు నిరంతర స్త్రీ సంగంబుచే విత్తాపత్య గృహాదిప్రదంబగు స్త్రీత్వంబు నొందు; నీక్రమం బున నంగనారూపుండగు జీవుండును మన్మాయచేఁ బురుషరూపంబు

(1) వస్తువేకత్వాలోచనంబుఁజేసి 2 భోగంబులు

నొంది ధనాదిప్రదుండగు భర్తను నాత్మబంధకారణంబగు మృత్యువు నుగ నెఱుంగవలయు. మఱియు జీవోపాధిభూతం బగు లింగదేహంబుచే స్వావాసభూతలోకంబుననుండి లోకాంతరంబు నొందుచుం బ్రారబ్ధ కర్మఫలంబుల ననుభవింపుచు, మఱల కర్మాదులం దాసక్తుఁడగుచు మృగయుండు గానసంబున ననుకూలసుఖప్రదుండైనను మృగంబునకు మృత్యు వగుచందంబున జీవుండు భూతేంద్రియ మనోమయం బైన దేహంబు గలిగియుండు; నట్టిదేహనిరోధంబె మరణంబు; నావిర్భావంబె జన్మంబునుం గాన సకలవస్తువిషయజ్ఞానంబు గలుగుటకు జీవునకు సాధనంబు చక్షురింద్రియంబగు; ద్రష్టృదర్శనీయ యోగ్యతా ప్రకారం బున జీవునకు జన్మమరణంబులులేవు; గావున భయకార్పణ్యంబులువిడిచి సంభ్రమంబుమాని [1]జీవప్రకారంబు జ్ఞానంబునం దెలిసి ధీరుండై ముక్త సంగుండగుచు యోగవైరాగ్యయుక్తంబైన సమ్యగ్జ్ఞానంబునమాయా విరచితంబైన లోకంబున దేహాదులం దాసక్తి మాని వర్తింపవలయునని చెప్పి వెండియు నిట్లనియె. తృ 1012

15. వ॥ సూర్యోదయాస్తమయంబులం బ్రతిదినంబు నాయువు [2]క్షయంబు నొంద దేహి దేహకళత్రమిత్ర భ్రాతృ మమత్వపాశబద్ధుం డై విడివడు నుపాయంబుఁ గానక సంసారాంధకారమగ్నుండై గతాగత కాలంబుల నెఱుంగక దివాంధంబులగు జంతుజాలంబులభంగి జన్మ జరారోగ విపత్తి మరణంబు లందియు శరీరంబ మే లనుచుఁ బ్రమోద మోహమదిరాపానమత్తులై విపర్యాసక్తతం జిక్కి తమ్ముఁ దా మెఱుం గక యుండి విరక్తిమార్గంబు తెలియక వర్తించుమూఢులగు జనంబుల పొంతలం బోవక, కేవలవిష్ణుభక్తిభావంబుగల సద్గురులం బ్రతిదినంబును భజియించి సాత్వికంబు భూతదయయును హరికథామృతపానంబును బ్రహ్మచర్యవ్రతంబును విషయంబుల మనంబు చేరకుండుటయు సాధు సంగంబును సజ్జనమైత్రియు వినయసంపత్తియు శుచిత్వంబును దపంబును క్షమయు మౌనవ్రతంబును వేదశాస్త్రాధ్యయన తదర్థానుష్ఠానంబు నహింసయు సుఖదుఃఖాది ద్వంద్వసహిష్ణుతయు నీశ్వరుని సర్వగతు నిఁగా భావించుటయు ముముక్షుత్వంబును జనసంగవర్జనంబును వల్క

---

2 జగత్ప్రకారంబు 2 క్షీణంబు

లాది ధారణంబును యదృచ్ఛాలాభ సంతుష్టియు వేదాంత శాస్త్రార్థ జిజ్ఞాసత్వంబును దేవతాంతరనిందావర్జనంబును గరణత్రయ శిక్షణంబును సత్యవాక్యతయు శమదమాదిగుణవిశిష్టత్వంబును, గృహారామక్షేత్ర కళత్రపుత్ర విత్తాదుల హరి కర్పణంబు సేయుటయు నితరదర్శన వర్జనంబుఁ జేయుటయును భాగవతోత్తమధర్మంబు లని చెప్పి యిట్లనియె.
ఏ. 54

16 వ॥ మఱియు వినుండు జన్మంబు శాంత ఘోర మూఢ గుణంబులచేత నైనను సుఖదుఃఖగుణంబులచేత నైనను ధార్మికాది గుణంబులచేతనైనను సకలభూతంబులు త్రైవిధ్యంబు నేపకారంబునం బొందు నాపకారంబున జన్మాంతరంబునం బొందుచుండు; దేవుం డైన యముండు సర్వజీవాంతర్యామియై ధర్మాధర్మయుక్తం బైన పూర్వరూపంబుల విశేషరూపంబును జేతం జూచుచుండి వాని కను రూపంబులఁ జింతించుచుండు; నవిద్యోపాధిజీవుండు తమోగుణయుక్తుం డై ప్రాచీనకర్మంబులచేత నేర్పడిన వర్తమానదేహంబు నే నని తలంచుచుండి నష్టజన్మస్మృతిగలవాఁడై పూర్వాపరంబు లెఱుంగం జాలకుండు; మఱియుఁ గర్మేంద్రియంబులచేతఁ గర్మంబులఁ జేయు చుండి, జ్ఞానేంద్రియంబులచేతఁ దమోవిషయంబులైన శబ్దస్పర్శ రూప రసగంధంబుల నెఱుంగుచుండి, పదియాఱవది యైన మనంబుతోఁ గూడి,పదియేడవవాఁ డగుచుండి, షోడశోపాధ్యంతర్గతుండై యొక్కరుం డైన జీవుండు సర్వేంద్రియవిషయప్రతిసంధానంబుకొఱకు జ్ఞానేం ద్రియ కర్మేంద్రియ మనోవిషయంబులం బొందుచుండు. షోడశకళలు గలిగి లింగశరీరంబునం బరఁగి గుణత్రయకార్యం బను నిమిత్తంబున హర్ష శోక భయంబుల నిచ్చుచున్న సంసారంబు ధరియించుచుండు. విజిత షడ్వర్గుండైన దేహి కర్మంబులొల్లని బుద్ధి నెఱింగియు వీనిఁగర్మంబులు సేయుచుండి తన సంచారకర్మంబునం జుట్టుకొన్న పసిరికాయపురువునుం బోలె నిర్గమోపాయం బెఱుంగక నాశంబు నొందుచుండు. వర్తమాన వసంతాది కాలంబు భూతభావి[1]వసంతకాలయోగ్యంబైన పుష్ప ఫలాదులు తత్కాలజ్ఞాపకంబు నెట్లు సేయు నట్లు భూతభావిజన్మం

1 వసంతాది

బులకు ధర్మాధర్మంబులు నిదర్శనంబులు సేయుచుండు; నొక్కనరుండు నొకక్షణంబును గర్మంబుఁ జేయకుండువాఁడు లేడు. పూర్వసంస్కారం బులంగల గుణంబులచేతఁ బురుషుం డవశుండవుఁ; గావున బలిమిఁ గర్మం బులు సేయింపంబడుచుండు; నవ్యక్తనిమిత్తంబు నొంది తదనురూపంబు లైన స్థూలసూక్ష్మ శరీరంబులు మాతాపితృసదృశంబు లగుచుండు; నిట్టి విపర్యయంబు పురుషునికిఁ బ్రకృతిసంగమంబునం గలుగుచుండు; నాప్రకృతి పురాణపురుషుండైన యప్పరమేశ్వరుని సేవించినఁ దలంగు చుండు. వ. 88

17 వ॥ మఱియు ధర్మాధర్మ వాసనాయుక్తంబు విషయాను రక్తంబునైన చిత్తంబు గుణప్రవాహంబులచేత వికారంబు నొంది దేవ తిర్యఙ్మనుష్యరూపంబులైన దేహంబులం బుట్టించుచుఁ గాలప్రాప్తంబు లైన సుఖదుఃఖతదుభయఫలంబుల ననుభవించుచు ననవరతంబు జీవు నికిం బ్రత్యక్షంబగుచు స్థూలసూక్ష్మరూపంబుల నుండు. స్వాంతంబు గుణరహితంబైన ముక్తికారణంబగు. ఘృతవర్తులుగలదీపంబు సధూమ శిఖలం బుట్టించు; ఘృతవర్తులు నాశంబునొందిన స్వరూపంబుఁ బొం దిన తెఱంగున మనంబు గుణకర్మానుబంధంబైన జన్మాదులం బుట్టించు. గుణ కర్మంబులం బాసెనేనియుం బరతత్త్వంబు నొందు. జ్ఞానేంద్రి యంబు లేనును విషయంబులమీఁదఁ దోఁచు బుద్ధు లేను నభిమానంబు నను నేకాదశవృత్తులంగూడిన మనంబు జీవునికి నసంఖ్యంబులైన జన్మం బులం బొందించు. మనోవృత్తుల నతిక్రమించిన జీవుండు పరంజ్యోతి యైన నారాయణస్వరూపంబుఁగా నెఱుంగుము. స్థావరజంగమంబులైన జీవులకుం బవనుండు ప్రాణంబై యున్న చందంబున నీశ్వరుండు సర్వ భూతాంతర్యామి యగుచు జీవాత్మస్వరూపంబున నుండు. జీవాత్ముండు జ్ఞానోదయంబునం జేసి మాయ నెంతకాలంబునం గెలువకుండు నంతకా లంబు ముక్తసంగుండు గాఁ; డరిషడ్వర్గంబును జయించి పరతత్త్వంబు నెఱింగిన నీశ్వరుం డగుఁ; జిత్తం బెంతకాలంబు విషయాసక్తంబగు నంత తడవు సంసారచక్రంబునందు సంచరించుం గావున మహావీరుండై నను దనకు శత్రువైన మనంబున నప్రమత్తుండై యిచ్ఛావిహారంబున జరగ నీక పరమగురుండైన శ్రీహరిచరణోపాసనాస్త్రంబునం జిత్తంబు గెలిచినం బరతత్త్వంబు నొందు. వ. 153

18 వ॥ మఱియు సంగనాసక్తులగు కాముకుల సంగంబు నిరయ రూపంబైన సంసారంబగు, మహత్సంగంబు మోక్షద్వారంబగు; నట్టి మహాత్ము లెవ్వరనిన శత్రుమిత్రవివేకంబులేక సమచిత్తులు శాంతులు క్రోధరహితులు సకలభూతదయాపరులు సాధువులు నగువారలు మహాత్ములనం దగుదు; రట్టి మహాత్ములు నాయందలిస్నేహంబె ప్రయోజనంబు గల్గియుండుటంజేసి విషయవార్తాప్రవృత్తులగు కుజనులందుం దమ దేహ గృహ మిత్ర దారాత్మజాదులందుం బ్రీతిలేక యుండుదురు. విషయాసక్తుండైనవాఁడు వ్యర్థకర్మంబులం జేయు; నట్టి దుష్కృత కర్మంబులం జేయువాఁ డెప్పుడును బాపకర్ముఁడగుచుం గ్లేశదంబగు దేహంబు నొందుచుండుం గావున బాపమూలంబులైన కామంబులు గోరకుఁ; డజ్ఞానం బెంతకాలంబు లేకయుండు నంతకాలం బాత్మతత్త్వం బెఱుంగం;డాత్మతత్త్వంబెఱుఁగమింజేసి దేహికిదుఃఖం బధికంబైయుండు. లింగదేహం బెంతతడవుండు నంతతడవు మనంబు గర్మవశంబై జ్ఞానవంతంబుగాక యవిద్యం బాయకుండు. శరీరంబు గర్మమూలం బగుటనలనఁ గర్మంబులు సేయఁజనదు. వాసుదేవుం డగు నాయందుఁ బ్రీతి యెంత తడవు లేకయుండు నంతతడవు దేహధర్మంబులు బాధించు. విద్వాంసుఁడైనను దేహేంద్రియాదులయందుఁ బ్రీతిఁజేసిన మిథునీభావ సుఖ ప్రధానంబగు గృహస్థాశ్రమంబు నంగీకరించి స్వరూపస్మృతిశూన్యుండై మూఢుండగుచు నందు సంసారతాపంబులఁ బొందు. పురుషుఁడు స్త్రీతోడంగూడి యేకీభావంబు నొందుట వారలకు హృదయగ్రంథియై యుండు; నందు జనునకు గృహక్షేత్ర సుతాప్త విత్తంబులందు నేను నాయది యనియెడి మోహంబు గలుగు; నట్టిస్త్రీపురుషమిథునీభావంబుచే సంతానంబు గలుగు; నాసంతానకారణంబున గృహక్షేత్ర విత్తాదులు సంపాదింపంబడు; నందు మోహం బధికం బగుటంజేసి మోక్షమార్గంబు దవ్వగు; నిట్లు సంసారంబునందుండియు మనంబున నెప్పుడు ముక్తిచింతం జేయు నపుడు సంసారంబును బాయు మోక్షోపాయంబులు పరమగురుఁడనైన నాయందు భక్తిసేయుట, విగతతృష్ణయు, ద్వంద్వతితిక్షయు, [1] సర్వలోకంబులందుస జంతువ్యసనావగతియు,[2] నీశ్వరవిషయక

(1) సర్వజంతు వ్యసన నిరీక్షణంబును (2) నీశ్వరదర్శనావపేక్షయు

జ్ఞానాపేక్షయుఁ, దపంబు, వినతేచ్ఛయు, మత్కృత కర్మంబులు మత్కథలు వినుటయు, నన్నె దైవంబుగా నెఱుంగుటయు, నస్మద్గుణ కీర్తనంబు, [1]నిరైరసామ్యోపశమంబులు, దేహగేహంబులందు నాత్మ బుద్ధిజిహాసయు, నధ్యాత్మ యోగంబు, నేకాంతసేవయుఁ, [2]బ్రాణేం ద్రియాత్మల గెలుచుటయుఁ, గర్తవ్యాపరిత్యాగంబు, సచ్ఛ్రద్ధయు, బ్రహ్మచర్యంబుఁ గర్తవ్యకృత్యంబు; లందుల నప్రమత్తుండగుటయు, వాఙ్నియమనంబు, సర్వంబు నన్నకాఁదలంచుటయు, జ్ఞానంబు, విజ్ఞాన విజృంభితంబైన యోగంబు ధృత్యుద్యమంబు సాత్వికంబు నాదిగాఁగల తెఱంగులచేత లింగదేహంబు జయించి దేహి కుశలుం డగుచు నుండ వలయు. పం. 68

19 వ॥ మఱియు [3]ననేకవిధనామరూపనిరూప్యంబగు మనంబు నకు దృష్టస్మృతుల నాశనంబువలనఁ గలిగెడు నుపరామంబగు సమాధి యందు దేవరజ్ఞానస్వరూపంబునఁ దోఁచు నిర్మలప్రతీతిస్థానుండైన హంసస్వరూపికి నమస్కరింతు. దారువందు నతిగూఢంబైన వీతిహో త్రుని బుద్ధిచేతం బ్రకాశంబు నొందించుభంగి బుద్ధిమంతులు హృదంత రంబున సన్నివేశుండైన పరమపురుషుని [4]నాత్మశక్తిత్రయంబులచేతం దేజరిల్లంజేయుదు; రట్టిదేవుండు సకలమాయావిచ్ఛేదకంబైన నిర్వాణ సుఖానుభవంబులంగూడి యుచ్చరింపం గొలందికాని శక్తిగల విశ్వ రూపి నాకుం బ్రసన్నుం డగుం గాక. వాగ్బుద్ధీంద్రియమానసంబుల చేతం జెప్ప నిట్టిదని రూపింప నలవిగాక యెవ్వని గుణరూపంబుల వర్తించు, నెవ్వండు నిర్గుణుండు, సర్వంబు నెవ్వనివలన నుత్పన్నంబగు, నెవ్వనివలన స్థితిం బొందు, నెవ్వనివలన లయంబగుఁ, బరాపరంబులకుం బరమంబై యనన్యంబై ప్రసిద్ధంబై సర్వవ్యాపకంబై యాదికార

---

1 నిరహంకారంబును గర్మత్యాగేచ్ఛయు. 2 నాత్మజంబును శ్రద్ధయు

3 నామరూపంబుల రూపవిభవంబునకు దృష్టిస్మృతిసంప్రయోగంబువలన నేప్రకారంబునఁ బొందరాక తమందులంగల సుజ్ఞానంబుచేత నేది యెఱుగంబడు చుండు నట్టి తేజోధామంబైన పరమహంసంబునకు నమస్కరింతు.

4 నాత్మశక్తులైన నపదవ్యంబులచేత నశక్తిత్రయంబుచేతను దేజరిల్లు

ణంబై యున్న తత్త్వంబు నాశ్రయింతు; నెవ్వనిప్రభావంబు మాటలా డెడువారలకు వాదంబు సేయువారలకు వివాదస్థలంబులగుచు నప్ప టప్పటికి మోహంబు నొందించుచుండు, నట్టి యనంతగుణంబుగల మహా త్మునకుం బ్రణామంబు సేయుచు నస్తి నాస్తి యను వస్తుద్వయనిష్ఠలం గలిగి యొక్కటన గలిగియుండి విరుద్ధధర్మంబులుగనుండు నుపాసనా శాస్త్ర సాంఖ్యశాస్త్రంబులకు సమంబై వీక్షింపఁదగిన పరమంబు నాకు ననుకూలంబగుంగాక. ఎవ్వండు జగదనుగ్రహంబుకొఱకు జన్మ కర్మంబులచేత నామరూపంబు లెఱుఁగంబడుచుండు, నట్టినామరూపం బులు గలిగి తేజరిల్లు ననంతుండైన భగవంతుండు ప్రసన్నుండగుం గాక. ఎవ్వండు జనుల పురాకృత జ్ఞానపదంబులచేత నంతర్గతుండై మేదినింగలుగు గంధాదిగుణంబుల నాశ్రయించిన వాయుభంగి మెలం గుచుండు, నాపరమేశ్వరుండు మదీయమనోరథంబు సఫలంబు సేయుం గాక. వ॥ 217

20 వ॥ మఱియు నోకానోకచోట విషయతృష్ణాపరులైన నర పశువులు పరతత్త్వంబ వైన నిన్ను మాని యైశ్వర్యకాములై తక్కిన దేవతల భజియింపుదురు. వారిచ్చుసంపదలు రాజకులంబునుంబోలె వారలంగూడి నాశంబునం బొందుచుండు. విషయకాములై నిన్ను సేవింపలేనివారు వేచినవిత్తనంబునుంబోలె దేహాంతరోత్పత్తి నొంద కుండుదురు. నిర్గుణుండవై జ్ఞానవిజ్ఞానరూపంబు నొందియున్న నిన్ను గుణసమేతునిగా నజ్ఞానులు భావింపుదురు. నీభజనం బేరూపుననైన మో క్షంబు ప్రసాదించు. జితమతివైన నీవు భాగవతధర్మం బేప్రకారంబున నిర్ణయించితి వాప్రకారంబున సర్వోత్కృష్టుండవైన నిన్ను సనత్కుమా రాదులు మోక్షంబుకొఱకు సేవింపుచున్నా; రీభాగవత ధర్మంబునందు జ్ఞానహీనుం డొక్కండును లేఁ; డన్యకామ్యధర్మంబులందు విషమబుద్ధి చేత నేను నీవు నాకు నీకు నని వచియించుచున్నవాఁడు ధర్మనిరతుండై క్షయించుచుండు. స్థావరజంగమప్రాణిసమూహంబునందు సమంబైన భాగవతధర్మంబుల వర్తించుచున్న మనుజునికి భగవద్దర్శనంబువలనఁ బాపంబు క్షయించుట యేమిచిత్రం; బిపుడు భవత్పాదావలోకనంబున

1 నతిభక్తింబ్రణామంబు

[1]నిరస్తాశుండనైతి. మూఢుండనైన నాకుఁ బూర్వకాలంబున నారదుం డనుగ్రహించి భగవద్ధర్మంబు దయసేసె; నది నేఁడు నాకు వరదుండ వైన నీకతంబునఁ దృష్టంబయ్యె. ఖద్యోతంబులచేత సూర్యుండు గోచరుండు గానిమాడ్కి జగదాత్మకుండవైన నీమహత్త్వంబు మనుజులచేత నాచరింపంబడి ప్రసిద్ధంబైనదిగా, నుత్పత్తిస్థితిలయకారుండవై భగవంతుండవైన నీకు నమస్కరించెద నని మఱియును. ష. 476

21 వ. దేవా యిట్టినిన్ను జీవాత్మస్వరూపుండవనక సకలాత్మలకు నాత్మయైన పరమాత్మస్వరూపకుఁడ వని యెవ్వ రెఱుంగుదురు, వారు గదా గురువనియెడు దినకరునివలనఁ బ్రాప్తంబైన యుపనిషదర్థజ్ఞానంబను సునేత్రంబునంజేసి సంసారమిథ్యాసాగరంబుఁ దరించిన చందంబున నుండుదురు. రజ్జువందు రజ్జువని యెఱింగెడియెఱుక లేకుండ నయ్యెఱుంగమి నది సర్పరూపంబై తోఁచినపిదప నెఱింగినవారివలన రజ్జువని [2]తెలుపుచుండ సర్పరూపంబు లేకుండుకై వడి, నాత్మ యప్పరమాత్మయని యెఱుంగరు. వారి కయ్యెఱుంగమివలనసకలప్రపంచంబులుగలిగితోఁచు; నాత్మ యప్పరమాత్మయని యెవ్వ రెఱుంగుదురు, వారి కయ్యెఱుకవలనఁ బ్రపంచంబు లేకుండు; నజ్ఞానసంభావితనామకంబులైన సంసారబంధమోక్షంబులు జ్ఞానవిజ్ఞానంబులలోనివి కావు; కావునఁ [3]గమలమిత్రునకహోరాత్రంబులు లేని తెఱంగునఁ బరిపూర్ణజ్ఞానమూర్తి యగునాత్మయందు జ్ఞానంబులేమి మోక్షంబులే; దాత్మవైన నిన్ను దేహాదికంబని తలంచియు నాత్మ వెలినుండునంచు మూఢులు మూఢత్వంబున వెదకుచుందురు. వారిమూఢత్వంబుఁ జెప్పనేల? బుద్ధిమంతులై పరతత్త్వంబు కాని జడంబును నిషేధించుచున్న సత్పురుషులు తమతమ శరీరంబులయంద ని న్నరయుచుందు, రది గావున. ద॥ 569

22 వ॥ మఱియు శ్రీహరియాజ్ఞ జీవుండు దపోవిద్యలను [4]యోగవీర్యజ్ఞానార్థధర్మంబులను దనచేత నొరులచేతఁ దప్పింప సమర్థుండుగాఁ; డుత్పత్తి[5]నాశంబులకు శోకమోహాభయ సుఖదుఃఖంబులకు నీశ్వరాధీనుండ కాని జీవుండు స్వతంత్రుండుగాఁడు. శ్రీహరివాగూపం

1 నిరస్తాశయమలుండ నైతి. 2 యెఱుఁగుచుండ.
3 సవిత్రు. 4 యోగజ్ఞానార్థ. 5 స్థితినాశంబు.

బులైన శ్రుతులందు గుణత్రయం బనురజ్జువునం బంధింపఁబడిన యస్మ దాదులము ముకుదాఁటిచేఁ బశువు మనుష్యుల వశంబైనచందంబున నీశ్వరాజ్ఞం బ్రవర్తించుచుందుము. నరుండు సుఖదుఃఖానుభవంబులకు నీశ్వరాధీనుండు. నేత్రంబులు గలవానిచేతఁ దివియంబడిన యంధుండునుం బోలె నీశ్వరుం డిచ్చిన సుఖదుఃఖంబు లనుభవించుచున్నవారము. స్వప్నంబునంగన్న పదార్థంబు మేల్కాంచి మిథ్యగాఁ దలంచిన కరణి మోక్షార్థియైన సుజ్ఞానవంతుండు ప్రాప్తసుఖదుఃఖంబు లనుభవించుచు దేహారబ్ధకర్మంబులం బాయనొల్లఁడు. వనవాసియైనను జితేంద్రియుండు గాకుండెనేనిఁ గామాదిసహితుం డగుటంజేసి సంసారబంధంబులు గలుగు. గృహస్థాశ్రమంబందు జితేంద్రియుండై యాత్మజ్ఞానంబుగల పురుషునకు మోక్షంబు సిద్ధించు. శత్రువుల గెలువ నిచ్ఛయించినపురుషుండు దుర్గం బాశ్రయించి శత్రువుల గెలిచినమాడ్కి మోక్షార్థి యగు నీవు గృహాశ్రయుండవగుచు శ్రీహరిచరణారవిందంబు లను దుర్గం బాశ్రయించి యరిషడ్వర్గంబులం జయించి ముక్తసంగుండవై యీశ్వరకల్పితంబులగు భోగంబుల ననుభవించి ముక్తిం జెందుము.

స్కం. 11

## ౨ విరక్తి.

1 సీ॥ నరనాథ! వినుము స్వ♦ప్నంబుచందంబున
సజ్ఞానవిలసితం ♦ బగుటఁజేసి
తివిరి మిథ్యాభూత♦ దేహాదికమునకు
నరయ నివర్తనా♦యాస మేటి
కని యంటివేనియు ♦ నర్థంబు లేకున్న
నర్థి సోపాధికం♦బైన మనము
వాంఛతో స్వప్నము ♦ వర్తింపఁ బురుషునిఁ
బూని జాగ్రద్బోధ♦చే నుపాధి

1 సిద్ధి గలుగు

తే॥ గీ॥ చెడక స్వాప్నికసంసృతి ♦ విడువనట్లు
దత్త్వవిజ్ఞానమున నవి♦ద్యానివృత్తి
ద్వార దేహాదికనివృత్తి ♦ దగులకున్నఁ
దివుట సంసృతి దాని వ♦ర్తింపకుండు. చ. 864

2 సీ॥ పాంచభౌతికమైన ♦ భవనంబు దేహంబు
పురుషుండు దీనిలోఁ ♦ బూర్వకర్మ
వశమున నొకవేళ ♦ వర్తించు దీపించుఁ
దఱియైన నొకవేళఁ ♦ దలఁగిపోవుఁ
జెడునేని దేహంబు ♦ చెడుఁగాని పురుషుండు
చెడఁ డాతనికి నింత ♦ చేటు లేదు
పురుషునికిని దేహ♦పుంజంబునకు వేఱు
గాని యేకత్వంబు ♦ గానరాదు
ఆ॥ వె॥ దారువుల వెలుంగు ♦ దహనునికై వడిఁ
గాయములఁ జరించు♦గాలిభంగి
నాళలీనమైన ♦ నభముచాడ్పున వేఱుఁ
దెలియవలయు దేహి♦దేహములకు. స 51

3 క॥ మలమునఁ గ్రిమియును బడుక్రియ
నిలఁబడు నొడ లాత్మగాదు ♦ హేయం బనుచుం
దలఁతురు తద్జ్ఞులు వొగడుదు
రలసత నొడ లాత్మ యనుచు ♦ నజ్ఞు లిలేశా! స. 462

4 వ॥ విను మూఢుండు శబ్దమయవేదమార్గంబైన కర్మఫల బోధన ప్రకారంబున వ్యర్థంబులైన స్వర్గాదినానాలోకసుఖంబుల నిచ్ఛయించు; మాయామయమార్గవాసనామూలంబు సుఖం బని తలంచి నిద్రించువాఁడు గలలు గను తెఱంగునం బరిభ్రమించు, నిరవద్యసుఖ లాభంబుం జెందఁడు. తన్నిమిత్తంబున విద్వాంసుండు నామమాత్రసారంబులగు భోగ్యంబులలోన నెంతట దేహనిస్పృహంబు సిద్ధించు నంతియ కైకొనుచు నప్రమత్తుండై సంసారంబు సుఖమని నిశ్చయింపక యొండు మార్గంబున సిద్ధి గలదని చూచి పరిభ్రమంబు నొందుచుండు. ద్వా. 20

5 చ॥ అనఘ జితేంద్రియస్ఫురణ ♦ లయ్యును జంచలమైనమానసం
బను తురగంబు బోధమహి ♦ తాత్మవివేకపునూలిత్రాట న
ల్లనఁ గదియంగఁబట్టను ద ♦ లంచుచు ముక్తి కుపాయలాభ మే
యనువున లేమికి న్వగల ♦ నొందెదు నాత్మలు వో తలంపఁగన్.
ద. 1226

6 ఆ॥ వె॥ మానసంబు గట్టి ♦ మహితభోగంబులు
మాని యింద్రియముల ♦ మదము లడఁచి
తపముచేసి యింద్రి ♦ తయుఁ గోరుఁగాని నీ
యమృతపదముఁ గోరఁ ♦ డజ్ఞుఁ డీశ! ద. 1664

7 తే॥ గీ॥ పుత్రదారగృహక్షేత్ర ♦ భూరివిషయ
ఘనసుఖాసక్తుఁడగుచు నే ♦ మనుజుఁడేని
నర్థి భజియించువాఁడు భ ♦ వాబ్ధిలోనఁ
జెంది యెన్నాళ్లకును దరిఁ ♦ జేరలేఁడు. ద. 1228

8 సీ॥ జనయిత్రి సత్యంబు ♦ శౌచంబు దయయును
ధృతియు మానంబు బు ♦ ద్ధియును సిగ్గు
క్షమయును యశమును ♦ శమదమభగములు
మొదలుగాఁగల గుణం ♦ బులు నశించు
జనుల కసత్సంగ ♦ మున నని యెఱిఁగించి
వెండియు నిట్లను ♦ వినుము మూఢ
హృదయులు శాంతివి ♦ హీనులు దేహాత్మ
బుద్ధులు నంగనా ♦ మోహపాశ
తే॥ గీ॥ బద్ధకేళీమృగంబుల ♦ పగిదిఁ దగిలి
పరవశస్వాంతముల శోచ్య ♦ భావులయిన
వారిసంగతి విడువంగ ♦ వలయు నందు
నంగనాసంగమము దోష ♦ మండ్రు గాన. తృ. 1006

9 క॥ చిరకాలతపమునైనను
హరియింపఁగనోపుఁ జిత్త ♦ మని పెద్దలు న
మ్మరు జారులకును జారిణి
కరణిని నడరించు మనసు ♦ కామాదులకున్. పం. 85

10 చ॥ నరులకు నేతపంబున న♦నంతసుఖంబులఁ బొందనౌను శ్రీ
కరమతి నాతపంబుఁ దగఁ ♦ గైకొని చేసిన బ్రహ్మసౌఖ్యముం
దిరముగఁ గల్గువృద్ధులను ♦ దీనులఁ బ్రోవుఁడు దుష్టవర్తనన్
జరుగుచునుండు కాముకుల♦సంగతిఁ బోకుఁడు మీఁద మేలగున్.
పం. 67

11 ఆ॥ వె॥ తనయులార వినుఁడు ♦ ధరలోనఁ బుట్టిన
పురుషులకును శునక♦ములకు లేని
కష్టములను దెచ్చుఁ ♦ గానఁ గామంబుల
వలన బుద్ధి సేయ♦వలదు మీరు. పం. 66

12 క॥ కామోపభోగసుఖములు
వేమాఱును బురుషుఁ డనుభ♦వించుచు నున్నం
గామంబు శాంతిఁ బొందదు
ధూమధ్వజుఁ డాజ్యవృష్టిఁ ♦ ద్రుంగుడువడునే. న. 582

13 క॥ ధర శునకభోగ్యమును నిహ
పరదూరమునైన తనువుఁ ♦ బాథేయముగా
నెరి నమ్మి వస్త్రమాల్యా
భరణంబు లలంకరించు ♦ పామరజనులన్. తృ. 469

14 ఆ॥ వె॥ వివిధకామలోభ♦విషయలాలసు మత్తు
నపరిమత్తవృత్తి ♦ నంతకుండ
వైన నీవు వేళ ♦ నరసి త్రుంతువు సర్ప
మొదిగి మూషకంబు ♦ నోడియునట్లు. ద. 1661

15 క॥ హరిమాయావిరచితమై
తరుణీరూపంబుఁ దాల్చి ♦ ధరఁ బర్విన బం
ధురతృణపరివృతకూపము
కరణి నదియు మృత్యురూప♦కం బగు మఱియున్.
తృ. 1019

16 క॥ ధీరతతో మత్పదసర
సీరుహసేవానురక్తిఁ ♦ జెందినవార

ల్లాదీసంగము నిరయ
ద్వారముగా మనములందుఁ ♦ దలఁపుదు రెందున్. తృ.1009

17 తే॥ గీ॥ రత్నములు హేమములు నను♦రాగలీల
నమ్మకంబుల నీవల ♦ నావ లయిన
భంగి నరులందు జీవుండు ♦ ప్రాప్తుఁడగుచు
నెలమిఁ దిరుగుచునుండుఁ దా ♦ నెందుఁ జెడఁడు. ష. 464

18 క॥ కలుగును మఱి లేకుండును
గల భూతము లెల్లఁ గాల♦కర్మవశములై
నిలువఁడు ప్రకృతిం దద్గుణ
కలితుఁడుగాఁ డాత్మమయుఁ డ♦గమ్యుఁడు దలఁపన్. న. 50

19 క॥ పతు లెవ్వరు సతు లెవ్వరు
సుతు లెవ్వరు మిత్రశత్రు♦సుజనప్రియసం
గతు లెవ్వరు సర్వాత్మక
గతుఁడై గుణసాక్షియైన ♦ ఘనుఁ డొక్కనికిన్. ష. 466

20 క॥ పరు లెవ్వరు దా మెవ్వరు
పరికింపఁగ నేకమగుట ♦ భావిపరు త
త్పరమజ్ఞానము లేమిని
బరులును మే మనుచుఁ దోఁచుఁ ♦ బ్రాణులకెల్లన్. స. 69

21 క॥ పగతురఁ జెరిచితి ననియును
బగతురచేఁ జెడితి ననియు ♦ బాలుఁడు దలఁచున్
బగచెలుములు లే వాత్మకుఁ
బగచెలుములు కీలుకర్మ♦బంధమునుండీ. ద. 160

22 క॥ ఎవ్వఁడు సృజించుఁ బ్రాణుల
నెవ్వఁడు రక్షించుఁ దుంచు ♦ నెవ్వఁ డనంతుం
డెవ్వఁడు విభుఁ డెవ్వఁడు వాఁ డి
వ్విధమున [1] మనుచుఁ బెనుచు ♦ హేలారతుఁడై. స. 48

1మనువుజనుపు

23 ఉ॥ కర్మవశంబునన్ జగము ♦ గల్గును హెచ్చు నడంగు [1]నన్న-చోఁ
గర్మము బుద్ధిఁ జూడ జడ♦కార్యము గాని ప్రపంచకల్పనా
కర్మమునందుఁ గర్త యనఁ♦గా విలసిల్లఁగఁ జాల దీ జగ
త్కర్మకకార్యకారణము ♦ గావున నీశుఁడు విష్ణుఁ డారయన్.
చ. 581

24 ఉ॥ మచ్చిక వీరికెల్ల బహు♦మాత్రము చోద్యము దేహి పుట్టుచు
న్జచ్చుచునుండఁ జూచెదరు ♦ చావక మానెడువారిభంగి నీ
చచ్చినవారి కేడ్చెదరు ♦ చావుకు నొల్లక డాఁగవచ్చునే
యెచ్చటఁ బుట్టె [2]నచ్చటికి ♦ నేఁగుట నైజము ప్రాణికోటికిన్.
స. 46

25 ఉ॥ ఏను మృతుండ నౌదునని ♦ యింతభయంబు మనంబులోపల
న్మానుము సంభవంబుగల ♦ మానవకోట్లకుఁ జావు నిత్యమౌఁ
గాన హరిం దలంపు మిఁకఁ ♦ గల్గదు జన్మము నీకు ధాత్రిపై
మానవనాథ! పొందెదవు ♦ మాధవలోకనివాససౌఖ్యముల్.
ద్వా. 25

26 తే॥ గీ॥ కాన వచ్చిన ఫలములు ♦ గర్మమూల
ము లగుటనుఁ జేసి సంసార♦ములనుఁ జిత్త
మెపుడు వర్తించుచుండఁగా ♦ నెఱుఁగలేవు
తత్త్వయోగంబు మిగుల ని♦త్యం బటంచు. పం. 158

27 క॥ చెడుఁ గరులు హరులు ధనములు
చెడుదురు నిజసతులు సుతులు ♦ చెడు చెనటులకున్
జెడక మను నెరసుగుణులకుఁ
జెడనిపదార్థములు విష్ణు♦సేవానిరతుల్. అ. 127

28 క॥ పలుపాటులఁ బడుజనులకు
నిల నొకచో నుండఁగలదె ♦ యేరులవెంటన్
గలసి చను మ్రాఁకు లన్నియుఁ
బలుపెంటలఁ బోవుఁగాక ♦ పాయకయున్నే. ద. 203

1 నందులో 2 నయ్యెడల కేఁగుట

29 క॥ తన పుత్త్రమిత్త్రముఖరులఁ
దనుపక చూడకయ వారు ♦ దరిగి నశింప
న్మనుచు గృహమేధియాశ్రిమ
మున నుండెడివాని కొక్క ♦ మోదము గలదే. ద. 205

30 ఆ॥ వె॥ ధనము వీథిఁ బడిన ♦ దైవవశంబున
నుండుఁ బోవు మూల ♦ నున్ననైన;
నడవి రక్షలేని ♦ యబలుండు వర్ధిల్లు
రక్షితుండు మంది♦రమునఁ జచ్చు. స. 49

31 క॥ జననీజనకులఁ బాసియు
ఘనవృకములబాధ బడకఁ ♦ గడుఁబిన్నలమై
మనిమెద మెవ్వఁడు గర్భం
బున [1] మునుఁ బోషించె వాఁడె ♦ పోషకుఁ డడవిన్. స. 47

32 క॥ రక్షకులు లేనివారల
రక్షించెద ననుచుఁ జక్రి ♦ రాజై యుండన్
రక్షింపు మనుచు నొకనరు
నక్షముఁ బ్రార్థింపనేల ♦ యాత్మజ్ఞులకున్. ద్వి. 22

33 క॥ అజగరమును జూంటీఁగయు
నిజగురువులఁగాఁ దలంచి ♦ నిశ్చింతుఁడనై
విజనస్థలిఁ గర్మంబుల
గజిబిజి లేకున్నవాఁడ ♦ గౌరవవృత్తిన్. స. 437

34 మ॥ నరఘుల్గూర్చిన తేనె మానవులకు ♦ న్సంప్రాప్తమైనట్లు లో
భరతుల్గూర్చినవిత్తము ల్పరులకుం ♦ బ్రాపించుఁ బ్రాప్తాశిమై
తిరుగంబోనిమహోరగంబు బ్రదుకున్ ♦ దీర్ఘాంగమైయుండియున్
జిరకాలంబును వానివర్తనములం ♦ జింతించి యేకాంతినై.
స. 436

35 క॥ నిందింపఁ బరుల నెన్నఁడు
వందింప ననేకపీడ ♦ వచ్చిన మది నా

1 మము 2 చిరకాలంబగు,

క్రిందింప విభవముల కా
నందింపఁ బ్రకామవర్త♦నంబున నధిపా. స. 440

37 సీ॥ అజినవల్కలదుకూ♦లాంబరంబులు గట్టి [1]
యొండెఁ గట్టకయొండె ♦ నుండుచుండు
నాందోళికారథ♦హయనాగముల నెక్కి
యైన నెక్కకయైన ♦ నరుగుచుండుఁ
గర్పూరచందన♦కస్తూరికాలేప
మైన భూరజమైన ♦ నలఁదికొందు
భర్మశయ్యలనైనఁ ♦ బర్ణశిలాతృణ
భస్మంబులందైనఁ ♦ [2]బడుచునుండు

ఆ॥ వె॥ మానయుక్తమైన ♦ మానహీనంబైనఁ
దీయనైన మిగులఁ ♦ దిక్తమైనఁ
గుడుతు సగుణమైన ♦ గుణవర్జితంబైన
నల్పమైనఁ జాల ♦ నధికమైన. స. 438

37 క॥ లేదని యెవ్వరి నడుగను
రాదని చింతింపఁ బరులు ♦ రప్పించినచోఁ
గాదని యెద్దియు మానను
ఖేదము మోదమును లేక ♦ క్రీడింతు మదిన్. స. 439

38 క॥ వ్యాప్తింబొందక వగవక
ప్రాప్తంబగు లేశమైనఁ ♦ బదివేలనుచుం
దృప్తింజెందని మనుజుఁడు
సప్తద్వీపములనైనఁ ♦ జక్కంబడునే. అ. 578

39 క॥ దేహము నిత్యము గాదని
మోహముఁ దెగఁగోసి సిద్ధ♦మునివర్తనుఁడై
గేహము వెలువడు నరుఁడు
త్సాహముతోఁ జెందు ముక్తి♦సంపద ననఘా. ప్ర. 315

---

1 యైనఁ గట్టకయైన నలరుచుండు 2 బండుచుండు

40 ఆ॥ వె॥ విషయసక్తులయిన ♦ విబుధాహితులతోడి
మనికి వలదు ముక్తి♦మార్గవాంఛ
నాదిదేవు విష్ణు ♦ నాశ్రయింపుఁడు ముక్త
సంగజనులఁ గూడి ♦ శైశవమున. స. 216

41 మత్త॥ ఎండమావులవంటి భద్రము♦లెల్ల సార్థము లంచు మ
ర్త్యుండు రోగనిధాన దేహము♦తో విరక్తుఁడు గాక యు
ద్దండమన్మథవహ్ని నెప్పుడుఁ ♦ దప్తుఁడై యొకనాఁడుఁ జే
రండు పారము దుష్టసౌఖ్యప♦రంపరాక్రమణంబునన్. స 58

42 క॥ విత్తము సంసృతిపటలము
వ్రిత్తము కామాదివైరి♦వర్గంబుల నేఁ
డిత్తము చిత్తము హరికినిఁ
జొత్తము నిర్వాణపదము ♦ శుభ మగు మనకున్. స. ప. 249

43 చ॥ ఎల్లశరీరధారులకు ♦ నిల్లను చీఁకటినూఁతిలోపలం
దెల్లక వీరు నే మను మ♦తిభ్రమణంబున భిన్నులై పరి
త్రిల్లక సర్వము న్నతని♦దివ్యకళామయ మంచు విష్ణునం
దుల్లముఁ జేర్చి తా రడవి ♦ నుండుట మేలు నిశాచరాగ్రణీ.
స. 142

---

## 3. భక్తి.

1 సీ॥ మహితాత్మ మఱి జన్మ♦మరణపరిణాశన
హేతుభూతుండవు ♦ నిద్ధకల్ప
తరువవు నగునిన్నుఁ ♦ దగ నెవ్వరే నేమి
పూని నీమాయావి♦మోహితాత్ము
లగుచు ధర్మార్థ[1]కా♦మంబులకొఱకుఁ దా
మర్చింపుచుం దిరుగు♦ణాభమైన
దేహోపభోగ్యమై ♦ దీపించు సుఖముల
నెనయంగ మది[2] నిచ్ఛ♦యింతు రట్టి

(1) కామాదులకొఱకుఁగా భజియించుచును గుణపరిభవమైన (2) లోననెంతు రట్టి

తే॥ గీ॥ విషయసంబంధజన్యమై ♦ వెలయుసుఖము
వారికి నిరయమందును ♦ వరలు దేవ
భూరిసంసారతాపని♦వారగుణక
థామృతాపూర్ణ యీశ మా♦ధవ ముకుంద! చ. 283

2 సీ॥ యజ్ఞాదికములందు ♦ నామ్నాయములయందుఁ
దఱచుగాఁ దత్త్వవా♦దంబు లేదు
స్వప్నంబులందుల ♦ సౌఖ్య మాకారంబు
నందుల నిత్యమై ♦ యంత లేని
యట్టిచందమున వే♦దాంతవాక్యంబులు
దత్త్వంబు నెఱిఁగించి ♦ తలఁగుఁగాని
నిత్యంబులై యుండ♦నేరవు పురుషుని
చిత్తంబు గుణములఁ ♦ జెంది యెంత
తే॥ గీ॥ కాల ముందును మఱి యంత♦కాలమందు
నరయ విజ్ఞానకర్మేంద్రి♦యములచేత
మఱిగి ధర్మంబు మఱి యధ♦ర్మంబునట్లు
దరిలి పుట్టించుచుండు న♦త్యంతమహిమ. పం. 152

3 క॥ ఏరీతిఁ గడవ నేర్తురు
కూరులు బహుదుఃఖరోగ♦కుత్సితబుద్ధు
ల్నీరసులు నరులు గావున
నారయ సుజ్ఞానబుద్ధి ♦ నానతియీరే. ఏ. 40

4 క॥ ఏభక్తి భవద్గుణపర
మై భవపాపప్రణాశ ♦ మై ముక్తిశ్రీ
లాభము రయమునఁ జేయునో
యాభక్తివిధంబుఁ దెలియ ♦ నానతియీవే. తృ. 876

5 ఉ॥ వేదవధూశిరోమహిత♦వీథులఁ జాల నలంకరించు మీ
పాదసరోజయుగ్మము శు♦భస్థితి మాహృదయంబులందు ని
త్యోదితభక్తిమైఁ దగిలి♦యుండునుపాయ మెఱుంగఁబల్కు దా
మోదర! భక్తదుర్భరమ♦హోదధితారణ! సృష్టికారణా!
ద. 753

6 సీ॥ అరయంగ నెవ్వని • కలవిగానట్టి యీ
సలలితమానుష • జాతిఁ బుట్టి
యాత్మతత్త్వజ్ఞాన • హాతుఁ డైనవానికిఁ
గలుగునే యందు సు • ఖంబు గొంత
వెలయఁ బ్రవృత్తినివృ • త్తిమార్గంబుల
[1]సుఖదుఃఖచయముల • సొరిదిఁ దెలిసి
పని చెడి సంకల్ప • ఫలమూలమునఁ బాఱు
కడు సుఖదుఃఖ మో • క్షములకొఱకు

ఆ॥ వె॥ దంపతీక్రియామ • తంబు వర్తింతురు
గాన మోక్ష మేల • తక్కియుండు
నఖిలదుఃఖహేతు • వైన యీకర్మంబు
నెఱిఁగి నన్నుఁ దలఁప • రిచ్ఛలోన. ష. 483

7 క॥ సమధికనిష్ఠం గృతయో
గమున నన్నన్యస్తసకల • కర్ముఁడవై మో
హముఁ బాసి భక్తిచే మో
క్షమునకు [2] భజియింపు నను వి • కారరహితుఁడై. త్రృ. 861

8 తే॥ గీ॥ వనతటాకోపనయనవి • వాహ దేవ
భవననిర్మాణభూమ్యాది • వివిధదాన
జపతపోవ్రత యోగయ • జ్ఞములఫలము
మామక స్తవఫలము స • మంబు గావు. త్రృ. 329

9 తే॥ గీ॥ ఏది జపియింప నమృతమై • యొసఁగుచుండు
నేది సద్ధర్మపథమని • [3] యెఱుఁగఁ దగిన
దదియె సద్భక్తియోగంబు • [4]నావహించు
మూర్తిమంతంబులో హరి • కీర్తనంబు. ష. 180

---

(1) సుఖమును దుఃఖంబు (2) భజియింపు వివిక్తకాననమందు
(3) యొన్నఁబడునో (4) నలవరించు

10 క॥ ఇంతయును దథ్యమని మది
నెంతయుఁ దెలియంగలేరు ♦ హీనాత్ములు దు
ర్దాంతతరఘటితమాయా
క్రాంతాత్యంతప్రకాశ♦గౌరవజడులై. ప. 183



11 క॥ హరిభక్తిచేతఁ గొందఱు
బరిమార్తురు మొదలుముట్ట ♦ పాపంబుల ని
ష్ఠురతరకరముల సూర్యుం
డరుదుగఁ బెనుమంచు పించ ♦ మడఁచిన భంగిన్. ష. 53



12 ఉ॥ కొందఱు పుణ్యవర్తనులు ♦ గోపకుమారపదారవిందజా
నందమరందపానకల♦నారత షట్పదచిత్తులౌచు గో
విందపరాయణుల్ విమల♦వేషులు దోష మడంతు రాత్మలం
జెందిన భక్తిచేత రవి ♦ చేకొని మంచు నడంచు కైవడిన్.
ష. 52

13 మ॥ ఒకమా ఱెవ్వనిపేరు కర్ణములలో ♦ నొయ్యారమై సోకిన
న్సకలాఘంబులు పల్లటిల్లి తొలఁగు ♦ న్సభ్రాంతితో నట్టి స
త్సుకరు న్మంగళతీర్థపాదు హరి వి♦ష్ణు న్దేవదేవేశుఁ దా
నకలంకస్థితిఁ గొల్చు భక్తులకు లే ♦ దడ్డంబు రాజాగ్రణీ! న. 142

14 క॥ జ్ఞానులచే మానులచే
దానులచే యోగసంవి♦ధానులచేత
న్బాని నిబద్ధుం డగునే
శ్రీనాథుఁడు భక్తియుతుల♦చేతం బోలెన్. ద. 391

15 క॥ ఘనదుఃఖహేతుకర్మం
బును దత్ప్రతికారకర్మ♦ము నివియు మాయా
జననము లగుటను బురుషుఁడు
గనుఁ గలలోఁ దోఁచినట్టి♦కలచందమునన్. చ. 862

16 క॥ జగదేకనాథుగుణములు
మిగులఁగ సంస్మరణశౌడ ♦ మీఱినభక్తిన్

బగలును రాత్రియు సంధ్యలు
దగిలి జితేంద్రియులునైన • తపసులు ధాత్రిన్. ఏ. 36

17 చ॥ అమలినభక్తిఁగొందఱు మ•హాత్ములు మచ్చరణారవిందయు
గ్మము హృదయంబున న్నిలిపి • కౌతుకులై యితరేతరానులా
పముల మదీయదివ్యతను•పౌరుషము ల్గొనియాడుచుండి మో
క్షము మదిఁ గోరనొల్ల రని•శంబు మదర్పితసర్వకర్ములై. తృ. 879

18 సీ॥ పరికింపఁ గొందఱు•భాగవతోత్తముల్
ఘనతకెక్కిన పురా•తనములైన
చారుప్రసన్నవ•క్త్రారుణలోచన
ములు గల్గి వరదాన•కలితములుగఁ
దనరు మద్దివ్యావ•తారవైభవములు
మది నొప్పఁ దనుయోగ•మహిమఁ జేసి
యనుభవింపుచుఁ దదీ•యాలాపముల సన్ను
తింపుచుఁ దివుటఁ ద•ద్దివ్యవిలస
తే॥ గీ॥ దవయవోదార సుందర•నవవిలాస
మందహాసమనోహర•మధురవచన
రచనచే నపహృతమనః•ప్రాణు లగుచు
నెలమి నుందురు నిశ్శ్రేయ•సేచ్ఛ లేక. తృ. 880

19 మ॥ కణక న్వారలు వెండి మోక్షనిరపే•క్షస్వాంతులై యుండి తా
మణిమాద్యష్టవిభూతిసేవితము ని•త్యానందసంధాయుముల్
గణనాతీతము నప్రమేయము నమ•గ్రశ్రీకము న్సర్వల
[1]క్షణసంయుక్త వికుంఠలోకపదవిం • గైకొందు రత్యున్నతిన్. తృ. 881

20 క॥ తనరుదు రప్పుణ్యాత్ములు
జనయిత్రి మదీయకాల•చక్రగ్రసనం
బును బొందక నిత్యంబగు
ననుపమసుఖవృత్తినుందు • రది యెట్లనినన్. తృ. 883

(1) క్షణయుక్తంబునసైన మోక్షపదవిం

21 మ॥ సముఁడై స్నేహముచే సుతత్త్వమును వి♦శ్వాసంబుచేత న్సఖి
త్వముచాలన్ హితవృత్తిచేతను సుహృ♦త్త్వంబు న్సుమంత్రోపదే
శముచేత న్నిజదేశికుండనఁగ ని♦చ్చ ల్పూజ్యుఁడౌ నిష్టదై
వమునై వారికిఁ గాలచక్రభయము ♦ ల్వారింపుదుం గావునన్
తృ. 884

22 క॥ హేయగుణరహితుఁ డనఁగల
నాయందలి భక్తిలక్ష♦ణముఁ దెలిపితి న
న్నాయక నిర్హేతుకముగఁ
జేయు మదీయప్రైక♦చిరతరభక్తిన్. తృ. 957

23 చ॥ మనుసుత మద్గుణశ్రవణ♦మాత్ర లభించినయట్టి భక్తిచే
ననఘుఁడ సర్వశోభనగు♦ణాశ్రయుఁడ న్పరమేశ్వరుండనై
తనరిన నన్నుఁజెందిన యు♦దాత్తమనోగతు లవ్యయంబులై
వననిధిగామియైన సుర♦వాహినిఁబోలి ఫలించు నిమ్మలన్.
తృ. 956

24 వ॥ నిష్కాములైన మదీయ భక్తులకు నట్టిభక్తియోగంబుసాలోక్య సార్ష్టి సామీప్య సారూప్య సాయుజ్యంబులకు సాధనంబు గావున మహాత్ములగువారు దమ మనోరథఫలదాయకంబులైనను మదీయ సేవావిరహితంబులైన యితరకర్మంబుల నాచరింప నొల్లరు దీని నాత్యంతికభక్తియోగంబని చెప్పుదురు సత్త్వరజస్తమోగుణ విహీనుండైన జనుండు [1]మత్స్వరూపంబుఁ బొందునని చెప్పి మఱియు నిట్లనియె.
తృ. 958

25 తే॥ గీ॥ గురుతరానేకకల్యాణ♦గుణ విశిష్టుఁ
డనఁగనొప్పిన నన్నుఁబొందు ♦ నండఁగొనక
పవనవశమునఁ బువ్వుల ♦ పరిమళంబు
ఘ్రాణమున నావరించిన♦కరణి మెఱసి. తృ. 963

26 ఆ॥ వె॥ నాకు మేలుఁగోరు ♦ [2]నాభక్తుఁడగువాఁడు
భక్తజనుల కేను ♦ పరమగతియు

(1) మత్సమానాకారతం (2) నాభక్తులకుఁగాను

భక్తుఁ డెందుఁజనినఁ ♦ బఱతెంతు వెనువెంట
గోవువెంటఁ దగులు ♦ కోడె భంగి. స. 119

27 చ॥ చలమున బుద్ధిమంతులగు ♦ సాధులు నాహృదయంబులీల దొం
గిలి కొనిపోవుచుండుదు ర♦కల్బిషభక్తిలతాచయంబుల
న్నిలువఁగఁ బట్టికొట్టుదురు ♦ నేరుపుతో మదకుంభికైవడి
న్వలలకుఁజిక్కి భక్తజన♦వత్సలతం జనుచుండుఁ దాపసా!
స. 118

28 క॥ హరిభక్తులతో మాటలు
ధర నెన్నఁడుఁ జెడని పుణ్య♦ధనములమూట
ల్వరముక్తికాంత తేటలు
నరిషడ్వర్గంబు చొరని ♦ [1]యరుగులకోటల్. ష. 153

29 క॥ భగవద్భక్తులు సుజనులు
దగ వెఱిఁగి పరోపకార♦తాత్పర్య వివే
కగరిష్ఠులై చరింతురు
జగతిం బెంపొంది వృష్ణి♦సత్తమ! యెందుఁ. తృ. 165

30 సీ॥ శుభ్రత్యంత విశ్రాంత ♦ మత్యనుక్రమణీయ
భగవత్ప్రసంగతు ♦ ల్భాగవతులు
సకలసన్ముఖయోగి♦జనసదానందైక
పరమభాగ్యోదయు ♦ ల్భాగవతులు
కృష్ణపదధ్యాన♦ కేవలామృతపాన
పరిణామయుతులు శ్రీ♦భాగవతులు
బహుపాతకానీక♦పరిభవప్రక్రియా
పరుషాగ్ర్యమూర్తులు ♦ భాగవతులు
తే॥ గీ॥ భావతత్త్వార్థవేదులు ♦ భాగవతులు
బ్రహ్మవాదానువాదులు ♦ భాగవతులు
సిరులు దనరంగ నెన్నఁడుఁ ♦ జేటులేని
పదవి నొప్పారువారు వో ♦ భాగవతులు. ష. 186

1 యరుదగుకోటల్

31 క॥ వర్ణాశ్రమధర్మంబుల
నిర్ణయకర్మములఁ జెడక ♦ నిఖిలజగత్సం
పూర్ణుఁడు హరి యను నాతఁడె
వర్ణింపఁగ భాగవతుఁడు ♦ వసుధాధీశా! ఏ. 47

32 తే॥ గీ॥ సర్వభూతమయుండైన ♦ సరసిజాక్షుఁ
డతఁడె తన యాత్మయందుండు ♦ ననెడివాఁడు
శంఖచక్రధరుండంచుఁ ♦ జనెడువాఁడు
భక్తిభావాభిరతుఁడు వో ♦ భాగవతుఁడు. ఏ. 46

33 సీ॥ ధరలోన బ్రహ్మంబు ♦ దపమున దానంబు
లను గృహధర్మంబు♦లను జలాగ్ని
సోమసూర్యులచేత ♦ శ్రుతులచేనైనను
బరమభాగవతుల ♦ పాద సేవఁ
బొందినమాడ్కిని ♦ బొందంగరా దని
పలుకుదు రార్యులు ♦ పరమమునులు
ఘనతపోబాహ్యసౌ♦ఖ్యములకు విముఖులు
నైపుణ్యులు హరిగు♦ణానువాద
తే॥ గీ॥ మోదితాత్ములు నగు బుధ♦పాద సేవ
ననుదినంబును జేసిన ♦ నంతమీఁద
మోక్షమార్గంబునకును బ♦ద్మాక్షునందుఁ
[1]బట్టువడియుండు నెప్పుడు ♦ పరఁగ బుద్ధి. ప. 160

34 మ॥ కమలాధీశ్వర [2]తావకీనవరభ♦క్తవ్రాత సంసర్గలే
శముతోఁ డక్క సరిగాఁ దలంప మెలమిన్ ♦ స్వర్గాపవర్గాది సౌ
ఖ్యములన్నన్నియు మానుషంబు లగు నీ ♦ కామంబులం జెప్పనే
ల [3]మునీంద్రస్తుతపాదపద్మసుజనా♦లాపానుమోదాత్మకా!
చ. 929

35 చ॥ హరివిముఖాత్ము లన్య[4]విష♦యాదృతచిత్తులుఁ బాపవర్తులు
న్నిరయనిపాతహేతువున ♦ నింద్యచరిత్రములైన దుష్కథా

(1) బట్టుబుద్ధి నెపుడు - భక్తిగలిగి (2) తావకీనపద (3) మునిప్రస్తుత
(4) విషయస్పృహచిత్తులు

నిరతిఁజరించువారలును ♦ నేరరు పొందఁగ నిందిరామనో
హరచరణారవిందభజ♦నాత్మకు లుండెడు గొండె నారయన్.
తృ. 509

36 చ॥ వనముల ముక్తసంగు లగు♦వారు నుతింపఁ దనర్తు నీవు గా
వున నిల పుణ్యతీర్థముల ♦ నొప్పఁ బునీతము సేయుఁబూని య
ర్థిని బదచారులై ధరఁ జ♦రించు భవత్పదభక్తసంగమం
బనుపమభూరిసంసృతిభ♦యఘ్నని బుద్ధి రుచింపకుండునే!
చ. 931

37 సీ॥ దనుజారిలీలావ♦తారంబులందలి
శౌర్యకర్మంబులు ♦ సద్గుణములు
విని భక్తుఁడగువాఁడు ♦ వేడ్కతోఁ బులకించుఁ
గన్నుల హర్షాశ్రు♦కణము లొలుక
గద్గదస్వరముతోఁ ♦ గమలాక్ష వైకుంఠ
వరద నారాయణ ♦ వాసుదేవ
యనుచు నొత్తిలి పాడు ♦ నాడు నాక్రోశించు
నగుఁ జింతనము సేయు ♦ నతియొనర్చు
తే॥ గీ॥ మఱలుకొనియుండుఁ దనలోన ♦ మాటలాడు
వేల్పు సోకిన పురుషుని ♦ వృత్తిఁ దిరుగు
బంధములు వాసి యజ్ఞాన♦పటలిఁ గాల్చి
విష్ణుఁ బ్రాపించుఁ దుది భక్తి♦వివశుఁ డగుచు. స. 240

38 చ॥ నిరతముఁ దావకీనభజ♦నీయపదాబ్జసుగంధ [1]లబ్ధి నె
వ్వరి మదినొందఁగాఁ గలుగు ♦ వారలు దత్ప్రియ మర్త్యదేహము
న్గరముఁ దదీయదారసుత♦కామసుహృద్గృహబంధువర్గము
న్మఱతురు విశ్వతోముఖ ర♦మాహృదయేశ ముకుంద మాధవా!
చ. 286

39 ఉ॥ కాననివాని నూఁతగొని ♦ కాననివాఁడు నభీష్టవస్తువు
ల్గాననిభంగిఁ గర్మములు ♦ గైకొని కొందఱు కర్మబద్ధులై

(1) లబ్ధులెవ్వరికి

కానరు విష్ణుఁ బొందరఁట ♦ గందు రకించనవైష్ణవాంఘ్రిసం
స్థానరజోభిషిక్తులగు ♦ సంహృతకర్ములు దానవేశ్వరా! స.182

40 చ॥ హరిఁ బరమేశుఁ గేశవు న♦నంతు భజింపఁగ ధర్మతత్త్వధీ
పరిణతి సాధనంబగు స్వ♦భావముఁ దాల్చిన యట్టి మర్త్యు లా
సరసిజనేత్రుమాయను భృ♦శంబుగ మోహితులై తదంఘ్రిపం
కరుహము లర్థిమైఁ గొలువఁ ♦ గానమిఁబొందరుతత్పదంబునర్
తృ. 511

41 చ॥ పురుషభవంబునొందుట య♦పూర్వముజన్మములందు నందు భూ
సురకులమందుఁ బుట్టుటది ♦చోద్యము లిట్లగుట న్మనుష్యు ల
స్థిరమగు కార్యదుర్దశల ♦ చేత నశింపక విష్ణుసేవనా
పరతఁదనర్చి నిత్యమగు♦భవ్యపథంబునునొందు టొప్ప దే. ద్వి.215

42 క॥ అరుదుగ నరహరి భక్తిం
బొరయని యాపురుషసుకృత♦పుంజంబులు వే
మఱుఁ బుణ్యుఁ జేయనేరవు
నరవర! మధుఘటముఁ బెక్కు ♦ నదులుం బోలెన్. ష. 57

43 చ॥ జగదధినాథుఁడైన హరి♦సంతతలీలల నామరూపముల్
దగిలి మనోవచోగతులఁ ♦ దార్కికచాతురి యెంతగల్గినన్
మిగిలి కుతర్కవాది దగ ♦ [1]మేరలుచేసి యెఱుంగనేర్చునే
యగణిత నర్తనక్రమము ♦ నజ్ఞుఁ డెఱింగి నుతింపనోపునే ప్ర.70

44 క॥ యుక్తిం దలఁప భవద్వ్యతి
రిక్తములైనట్టి యితర♦దృఢ కర్మంబుల్
ముక్తిదములైన మీపద
భక్తులు దత్కర్మములను ♦ బాటింప రిలన్. తృ. 548

45 సీ॥ చర్చింప నరుల కీ♦ జన్మకర్మాయుర్మ
నోవచనంబుల ♦ దేవదేవుఁ
డఖిలవిశ్వాత్మకుం♦డైన గోవిందుండు
విలసిల్లు భక్తిసే♦వింపఁబడిన

(1) మేలులు

నవియపో జన్మ క♦ర్మాయుర్మనో వచ
నములను ధరణి నె♦న్నంగఁదగును
వనరుహనాభ సే♦వా రహితములైన
జననోపనయనదీ♦క్షాకృతంబు
తే॥ గీ॥ లయిన జన్మంబు లేల దీ♦ర్ఘాయు వేల
వేదచోదితయగు కర్మ♦వితతి యేల
జపతపశ్శ్రుతవాగ్విలా♦సంబు లేల
మహిత నానావధాన సా♦మర్థ్యమేల? చ. 952

46 వ॥ మఱియు హరివిరహితంబైన యింద్రియపాటవంబు నిపుణమైన బుద్ధియుఁ బ్రాణాయామాది యోగంబు దేహాదివ్యతిరిక్తాత్మజ్ఞానంబు సన్న్యాసాధ్యయనంబులు దక్షిణవ్రతవైరాగ్యాది శ్రేయస్సాధనంబులు నేల? సర్వేశ్వరుండు సమస్తశ్రేయస్స్వరూపుండు సమస్తశ్రేయోవధి భూతుండు సర్వభూతావాసుండు సర్వభూతాత్మప్రదుండు సర్వభూత ప్రియుండు సర్వవ్యాపకుండును గావున, చ. 953

47 చ॥ అకుటిలభక్తిఁ గేశవస♦మర్పణబుద్ధిఁ గ్రతుక్రియ ల్సొన
ర్పక విపరీతులై యుమక♦రాసులు దంచి ఫలంబు నందఁగా
నక చెడురీతి నూరక ధ♦నవ్యయమౌటయెకాని మోక్షదా
యక మగుచున్న తత్ఫలము♦ నందరు విష్ణుపరాఙ్ముఖక్రియల్.
తృ. 401

48 ఉ॥ కావునఁ గీర్తనీయగత♦కల్మషమంగళతీర్థకీర్తి సు
శ్రీవిభవప్రశస్తసుచ♦రిత్రుఁడవైన భవత్పదాబ్జసే
వావిమలాంతరంగ బుధ♦వర్గ మనర్గళభంగి నన్యము
న్భావమునం దలంచునె కృ♦పాగుణభూషణ పాపశోషణా!
తృ. 549

49 మ॥ తనుహృద్భాషలసఖ్యము న్శ్రవణముం♦ దాసత్వముం వందనా
ర్చనము ల్సేవయు నాత్మలో నెఱుకయుం♦ సంకీర్తన ల్చింతనం
బను నీతొమ్మిదిభక్తిమార్గముల స♦ర్వాత్ముఁ హరి న్నమ్మి స
జ్జనుఁడై యుండుటభద్రమంచుఁదలఁతున్♦సత్యంబు దైత్యోత్తమా
స. 167

50 క॥ పూనిన తద్భక్తి సమీ
చీనగతిం దెలియ ననఘ ♦ చిరవైరాగ్య
జ్ఞానజనకమగు భక్తిని
ధానము గోవిందవరక♦థాశ్రియ మగుటన్. చ. 866

51 చ॥ అనుపమభక్తి నెవ్వనిప♦దాంబుజమూలము మందిరంబుగా
ననయముఁ బొందు వాఁడు నిహి♦తాఖిలభూరిమనోమలుండు స
ద్వినుతవిరక్తిబోధధృతి♦వీర్యవిశేష[1]సమన్వితుండు దా
ననఁదగి భూరిసంసృతిమ♦హాత్తరదుఃఖము నందఁ డెన్నఁడున్.
చ. 578

52 చ॥ నరునకు నాత్మదేహజగు♦ణంబులఁ బాపఁగనోపు పంకజో
దరచరణారవిందమహి♦తస్ఫుటభక్తియ యింద్రియంబు లీ
శ్వరవిషయంబులైన మది ♦ సంచితనిశ్చలతత్త్వమైనచో
సరసిజనేత్రుకీర్తనమె ♦ చాలు విపద్దశలం జయింపఁగన్.
త్రి. 243

53 మ॥ అరిషడ్వర్గమహోర్మినక్రనికర♦వ్యాకీర్ణసంసారసా
గర మజ్ఞోదర[2]కీర్తనాద్యుడుపసాం♦గత్యంబునం బాసి తా
మరుదారంగ నఘాపహాప్రకట యో♦గాదిక్రియాయుక్తిచేఁ
దరియింప న్మదిఁ గోరువారలకు దు♦ర్దాంతంబగున్ గావునన్.
చ. 630

54 శా॥ అంధేందూదయము ల్మహాబధిరశం♦ఖారావము ల్మూకస
ద్గ్రంథాఖ్యాపనము ల్నపుంసకవధూ♦కాంక్షల్ కృతఘ్నావలీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లు♦బ్ధద్రవ్యము ల్క్రోడస
ద్గంధంబుల్ హరిభక్తివర్జితుల రి♦క్తవ్యర్థసంచారముల్.
స. 168

55 శా॥ అజ్ఞుల్ గొందఱు మేము దా మనుచు మా♦యం జెంది సర్వాత్మకుం
[3]బ్రజ్ఞాలభ్యు వరాన్వయక్రమముల ♦ న్భాషింపఁగా నేర రా

(1) మనీషవంతుఁడున్ (2) కీర్తనాదరణ, (3) లబ్ధదురన్వయ

జిజ్ఞాసాపథమందు మూఢులుగదా ♦ చింతింప బ్రహ్మాదివే
దజ్ఞు ల్దత్పరమాత్ము విష్ణు నితరు ♦ల్దర్శింపఁగా నేర్తురే? స. 148

56 మ॥ తపము న్వంశము తేజముం శ్రుతము సౌం♦దర్యంబు నుద్యోగము
న్నిపుణత్వంబుఁ బ్రతాపపౌరుషములు ♦ న్నిష్ఠాబలప్రజ్ఞలుం
జప[1]హోమంబులు చాల వీశ్వర భవ♦త్సంతుష్టికై దంతియూ
థపుఁజందంబున భక్తి సేయవలయుం ♦ దాత్పర్యసంయుక్తుఁడై.
స. 350

57 క॥ చాలదు భూదేవత్వము
చాలదు దేవత్వ మధిక♦శాంతత్వంబుం
జాలదు హరి మెప్పింప వి
శాలోద్యములార! భక్తి ♦ చాలినభంగిన్. స. 244

58 క॥ చిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ
జిక్కఁడు దానముల శౌచ♦శీలతపములం
జిక్కఁడు వృత్తిని భక్తినిఁ
జిక్కినక్రియ నచ్యుతుండు ♦ సిద్ధము సుండీ. స. 245

59 క॥ దంతిపురనాథ! విను మొక
మంతన మెఱిఁగింతు శమద♦మంబులు నంహా
వంతు శుభవంతుఁ జేయవు
కంతునిగురుభక్తి ముక్తిఁ ♦ గలిగించుగతిన్. ష. 54

60 మ॥ ఉపవాసవ్రతశౌచశీలమఖసం♦ధ్యోపాసనాగ్నిక్రియా
జపదానాధ్యయనాదికర్మముల మో♦క్షప్రాప్తి సేకూర ద
చ్చపుభక్తిన్ హరిఁ బుండరీకనయనున్ ♦ సర్వాతిశాయిన్ రమా
ధిపుఁ బాపఘ్నుఁ బరేశు నచ్యుతుని న♦ర్థిన్ గొల్వలేకుండినన్.
ద్వా. 216

61 మ॥ క్రతుదానోగ్రతపస్సమాధిజపస♦త్కర్మాగ్నిహోత్రాఖిల
వ్రతచర్యాదుల నాదరింప వఖిల♦వ్యాపారపారాయణ

(1) యాగంబులు

స్థితి నొప్పారెడు [1]పాదపద్మయుగళీ • సేవాభిపూజాసమ
ర్పితధర్మం బగువానిభంగి నసురా • రీ! దేవచూడామణీ!
తృ. 302

62 క॥ ధీమహిత భగవన్మంగళ
నామస్మరణానుకీర్తనము [2]గలవారల్
శ్రీమంతు లగుదు రగ్ని
ష్టోమాదిక్రతువాళికంటె • శుద్ధులు దలఁపన్. తృ. 1035

63 మ॥ అమలజ్ఞానసదానధర్మరతి స • త్యక్షాంతి నిర్మత్సర
త్వముల న్యజ్ఞతపోనసూయలఁ గడున్ • దర్పించు ధాత్రీసురో
త్తముకంటెన్ శ్వపచుండు ముఖ్యుఁడు మనో • ర్థప్రాణవాక్కర్మము
ల్సమత న్నిన్ను నయించెనేని [3]భగవ • త్సంతోషకుండౌఁ దుదిన్.
స. 351

64 క॥ ధర సాధులు విమలాంతః
కరణులు భగవద్గుణాను • కథనశ్రవణ
స్ఫురితస్వాంతులు ననఘులు
[4]వరధిషణులునైన భాగ • వతజనసభలన్. చ. 868

65 క॥ సరసోదారమహాత్మ్య ము
ఖరితములగు మధువిరోధి • కమనీయగుణో
త్కరసురుచిరచరితామృత
పరిపూరితవాహినులను • బరమప్రీతిన్. చ. 869

66 క॥ మన మలరఁగ శ్రోత్రాంజలు
లను బానము సేయు పుణ్యు • లకు క్షుత్తృష్ణా
ఘనభయశోకవిమోహము
లనయంబును సోకకుండు • నవనీనాథా! చ. 870

67 సీ॥ సీగృహాంగణభూమి • నిటలంబు మోవంగ
మోదించి నిత్యంబు • మ్రొక్కఁడేని

---

(1) నీపదాబ్జయుగళీ (2) గలహీనుల్ (3) నిజవంశశ్రీకరుండౌఁదుదిన్
(4) వరమతులున్నయిన భాగవతనిలయములన్.

నీమంగళ స్తవ♦నికరవర్ణంబులు
పలుమాఱు నాలుకఁ ♦ బలుకఁడేని
నీయధీనములుగా ♦ నిఖిలకృత్యంబులు
ప్రియభావమున సమ♦ర్పింపఁడేని
నీపదాంబుజముల♦నిర్మలహృదయుఁడై
చింతించి మక్కువఁ ♦ జిక్కఁడేని
తే॥ గీ॥ నిన్నుఁ జెవులార వినఁడేని ♦ నీకు సేవఁ
జేయరాఁడేని బ్రహ్మంబుఁ ♦ జెందఁగలఁడె
యోగియైనఁ దపోవ్రత♦యోగియైన
వేదియైన మహాతత్త్వ♦వేదియైన. స. 367

68 ఉ॥ ఎవ్వరు నీపదాంబుజము ♦ లెప్పుడు గొల్తురు భక్తినిష్ఠులై
యెవ్వరు నిన్నుఁ బ్రేమ నుతి♦యింతురు భూరివివేకశాలురై
యవ్విమలాత్ము లందుదు రు♦దంచితశోభననిత్యసౌఖ్యముల్
నివ్వటిలంగఁ గృష్ణ! నిను ♦ నేర్చి భజించిన రిత్తవోవునే? ద. 699

69 మ॥ చెలివై చుట్టమవై మనఃస్థితుఁడవై ♦ చిన్మూర్తివై యాత్మవై
వలనై కోర్కులపంటవై విభుఁడవై ♦ వర్తిల్లు ని న్నొల్ల కీ
పలువెంటంబడి లోకు లక్కట వృథా ♦ బద్ధాశులై పోయెడి
న్నిలువన్నేర్చునె హేమరాశిఁగనియు♦న్నిర్భాగ్యుఁడంభశ్శయా! అ. 733

70 క॥ దేహము కారాగేహము
మోహము నిగళంబు రాగ♦ముఖరములు రిపు
వ్యూహములు భక్తితో ని
న్నూహింపఁగ నెంతదడవు ♦ నో కమలాక్షా! ద. 576

71 మ॥ ధరణీశోత్తమ! నీవు గేవల సము♦ద్యద్భక్తి ధీయుక్తమై
వరగోవిందపదారవిందయుగభా♦స్వన్నావ సంధించి దు
స్తరభూరివ్యసనాకరోల్లసిత దు♦ర్దాంతోగ్రగంభీరసం
సరణాంభోధిఁ దరింపుమయ్య పరమో♦త్సాహంబు దీపింపఁగన్. చ. 631

72 సీ॥ హరికి నర్థముఁ బ్రాణ ♦ మర్పితంబుగ నుండు
వాని కైవల్య మె♦వ్వనికి లేదు
వనజలోచనుభక్త♦వరుల సేవించిన
వాని కైవల్య మె♦వ్వనికి లేదు
వైకుంఠనిర్మల♦వ్రతపరుండైనట్టి
వాని కైవల్య మె♦వ్వనికి లేదు
సరసిజోదరుకథా♦శ్రవణలోలుండైన
వాని కైవల్య మె♦వ్వనికి లేదు
తే॥ గీ॥ లేదు తపముల బ్రహ్మచ♦ర్యాదినియతి
శమదమాదుల సత్యశౌ♦చముల దాన
ధర్మముఖముల సుస్థిర♦స్థానమైన
వైష్ణవజ్ఞానజనితని♦ర్వాణపదము. ప. 55

73 చ॥ మఱియు సరోరుహోదరుని♦మంగళదివ్యకథానులాప ని
ర్భరపరితోషబాష్పకణ♦బంధురచారుకపోలగద్గద
స్వరపులకీకృతాంగులగు♦వారలు నిస్పృహచిత్తు లత్యహం
కరణవిదూరు లుందురు సు♦కర్ములు నుండెడు పుణ్యభూములన్.
తృ. 512

74 చ॥ ఎనసిన భక్తియోగమున♦నే భవదీయ పదాబ్జ మొందఁగా
ననయముఁ గోరువాఁడు చటు♦లాగ్రహభీషణవీర్యశౌర్యత
ర్జనములచే ననూనగతి ♦ సర్వజగంబులు సంహరించు న
య్యనుపముఁడైన కాలునిభ♦యంబును బొందఁడుసుమ్ము కావునన్.
చ. 713

75 చ॥ సరసిజనాభ! సత్పురుష♦సంగ సమంచిత భక్తియోగవి
స్ఫురణ ననుగ్రహింపఁబడి ♦ శుద్ధము నొందినవానిచిత్త మ
స్థిర[1]బహిరంగముం గనదు ♦ చెందదు భూరితమస్స్వరూపసం
సరణ[2]గుహన్ జిరంబు గనఁ♦జాలు భవన్మహనీయతత్త్వమున్.
చ. 718

(1) బహిరర్థమున్ (2) గుహాగతంబు

76 చ॥ హరిచరణారవిందయుగ♦శార్చనసన్నుతిభక్తియోగముల్
నిరతముఁ గల్గువారు భవ♦నీరజగర్భుల కందరాని భా
సురపదమందుఁ జేరుదురు ♦ సూరిజనస్తవనీయ! యట్టి స
త్పురుషులపూర్వజన్మఫల♦ము స్గణుతింపఁ దరంబె యేరికిన్.
త్రృ. 244

77 క॥ మురహర! దివసాగమదర
దరవిందదళాక్ష! తలఁప ♦ నది [1]యెట్టి దగు
న్నిరవధికవిమలతేజో
వరమూర్తివి నీవ భక్త♦వత్సల! యెందున్. ద. 296

78 ఆ॥ వె॥ బాంధవమునవైనఁ ♦ బగనైన వగనైనఁ
బ్రీతినైనఁ బ్రాణ♦భీతినైన
భక్తినైన హరికిఁ ♦ బరతంత్రులై యుండు
జనులె మోక్షమునకుఁ ♦ జనుదు రధిప! ద. 975

79 తే॥ గీ॥ అరయ నిష్కామధర్ములై ♦నట్టిభక్తు
లందు నీవు ప్రసన్నుండ ♦ వైనరీతి
హృదయముల బద్ధకాములై ♦యున్న దేవ
గణములందుఁ బ్రసన్నతఁ ♦ గలుగ వీవు. త్రృ. 300

80 క॥ అజితుఁడవై భక్తులచే
విజితుఁడవై [2]నాఁడ వెపుడు ♦ వేడుక వారున్
విజితుల నీచేఁ గోర్కుల
భజియింపనివారు నిన్నుఁ ♦ బడయుదురె హరీ! ష. 472

81 చ॥ హరి నిజదాసకోటికిఁ ద♦[3]దాశ్రయులై రమియించునట్టిస
త్పురుషుల కిష్టవస్తుపరి♦పూర్ణమనోరథసిద్ధి గల్గు సు
స్థిర మగుచున్న [4]ముక్తియును ♦ సిద్ధముగాఁ జెలువారునన్న న
స్థిరతరతుచ్ఛసౌఖ్యములు ♦ నేకురుట ల్మఱిఁ జెప్ప నేటికిన్.
త్రృ. 442

---

(1) యెట్టిదఁటే 1 నిర (2) నై యుంటి విపుడు వేడుకతోడన్ విజితాత్ములగుచు
(3) గుహాశయుఁడై (4) మోక్ష మఱి చేతిదియై

82 చ॥ హరి భజనీయమార్గనియ♦తాత్మకులై భవదీయమూర్తిపై
పరలిన భక్తియుక్తులగు♦వారల సంగతిఁ గల్గఁజేయు స
త్పురుషసుసంగతిన్ వ్యసన♦దుర్భవసాగర మప్రియత్నత
న్సరసభవత్కథామృతర♦సంబున మత్తుఁడనై తరించెదన్.
చ. 285

83 మ॥ హరపంకేజభవామరాదులు మరీ♦చ్యాదిప్రజానాథు లో
యరవిందాక్ష! రమాహృదీశ! భవదీ♦యాంశాంశసంభూతులై
పరగం దావకలీలకై నెగడు నీ♦బ్రహ్మాండముల్ దేవ! యీ
శ్వర! నీకే మది భక్తిమ్రొక్కెదము [1]దే♦వాధీశ! రక్షింపుమా.
చ. 201

84 సీ॥ సతతంబు నర్థార్థి♦జనశిరోలంకార
పదరేణువులుగల ♦ పద్మ మనెడు
జలజకింజల్కని♦ష్యందమరందలో
భాగతభ్రమరనా♦యకునిపగిది
ధన్యజనార్పితో♦దంచితతులసికా
దామంబునకు నిజ♦ధామ మగుచు
భాసిల్లుభవదీయ♦పాదారవిందము
ల్విలసితభక్తి సే♦వించుచుండి
తే॥ గీ॥ కమలనయన కృపావలో♦కనము లొలయ
నర్థిఁ [2]బోడఁజూపు భాగవ♦తానురక్తిఁ
జేసి భవదీయమహిమంబు ♦ చిత్ర మరయఁ
జిరశుభాకార! యిందిరా♦చిత్తచోర!
త్రృ. 574

84 చ॥ అరయఁగ భక్తపాలనము ♦ లైన భవద్గుణజాల మాత్మ సం
స్మరణముసేయ వాక్కు నిను ♦ సన్నుతిసేయ శరీర మెల్లఁ గిం
కరపరివృత్తి సేయ మదిఁ ♦ గాంక్ష యొనర్చెదఁగాని యొల్ల నే
నరిది ధ్రువోన్నతస్థలము ♦ నబ్జజుపట్టణ మింద్రభోగముల్.
ష. 4[illegible]0

(1) దేవాదేవచూడామణీ (2) బోడఁజూడవో

86 మ॥ ఘనలీలాగుణచాతురి న్భువనము ♦ ల్గల్పించి రక్షించి భే
దనముం జేయుదురంతశక్తికి ననం♦తజ్యోతికిం జితవి
ద్యునికి న్నిత్యపవిత్రకర్మునికి నే ♦ నుత్కంఠతో నవ్యయా
త్మునికి న్వందనమాచరించెదఁ గృపా♦ముఖ్యప్రసాదార్థినై.
స. 306



## ౮. నిర్గుణతత్త్వము.

1 సీ॥ నరవర విను జగ♦న్నాథునిచారిత్రి
మెఱఁగింతు నీమది ♦ కింపు మిగుల
లనదుద్భవస్థితి♦లయకారణంబైన
[1] దేహేంద్రియాదులఁ ♦ దిరముగాఁగ
జొనుపు [2]నెప్పుడు పరం♦జ్యోతిస్స్వరూపంబు
జ్వాల లనలునందుఁ ♦ జననిపగిది
నింద్రియంబులు నాత్మ ♦ నెనయవు శబ్దంబు
పొరయక సుషిరంబుఁ ♦ బొందు నట్లు
తే॥ గీ॥ మనఁగ సత్వరజస్తమో♦మయగుణంబు
మహదహంకారరూపమై ♦ మహిమ నెలయుఁ
జేతనత్వంబు గల దీని ♦ జీవ మందు
రిదియు సదసత్స్వరూపమై ♦ యెన్నఁబడును. ఏ. 57

2వ॥ దేవా! కర్మమూలంబులైన పాణిపాదంబులు లేనివాఁడవయ్యును స్వతంత్రుండవు, బ్రహ్మాదులు భవత్పరతంత్రులై యుండుదురు. స్థిరచరరూపంబులుగల చేతనకోటికి నీవు సర్వవిధినియంతవు. కావున నీకృపావలోకనంబు గలవారికి మోక్షంబు కరస్థితంబై యుండు. భవత్కృపావలోకనంబు లేని కష్టాత్ములు నష్టాత్ములై దుర్గతిం గూలుదు; రట్టిజీవులు దేవతిర్యఙ్మనుష్యస్థావరాది శరీరంబులు సొచ్చి యణురూపులై యుందు; రందు నీవుందువు; తదంతరాత్మవగుచు మఱియును
ద. 1223

(1) దేహిప్రాణంబులు (2) జొనుపువస్తువు

3 సీ॥ ఆదిత్యచంద్రాగ్ని • మేదినీతారాంబు
మారుతాకాశవా • ఙ్మనము లోలిఁ
బరికింపఁ దత్తదు • పాసనంబులఁ బూని
తపములచే సమ • ర్థములు గావు
సకలార్థగోచర • జ్ఞానంబుగల మహా
త్ములు ముహూర్తమా • త్రమున సేవఁ
జేసి పావనములు • సేయుదు రదియు న
ట్లుండె ధాతుత్రయ • యుక్తమైన
తే॥ గీ॥ కాయమం దాత్మబుద్ధియుఁ • గామినీ కు
మారులందు స్వకీయాభి • మానములను
దివిరి జలమునఁ దీర్థబు • ద్ధియును జేయు
నట్టి మూఢుండు పశుమార్గుఁ • డనఁగఁ బరఁగు. ద. 1121

4 వ॥ మఱియును, దేవా! భూలోకంబునందును నిత్యనివాసంబులందును సకలప్రదేశంబులందును జగదీశ్వరుండవైన నిన్ను నభిమతంబులైన కామరూపంబులు గైకొని వరియింతురు. భవదీయ చరణారవింద మకరందాస్వాదన చాతుర్యభృంగియైన కామిని యతిహేయంబైన త్వక్ శ్మశ్రురోమనఖకేశంబులచేతఁ గప్పంబడి యంతర్గతంబైనమాంసాస్థిరక్తక్రిమివిట్కఫపిత్తవాతంబుల [1] బీభత్సంబైననరాధముని మూఢాత్మయై కామించునే? యదియునుంగాక. ద. 256

5 సీ॥ సంసారమార్గసం • చారుఁడై యధిక ప్ర
యాసంబునను గూర్చు • నర్థములను
విహరింపుచును గొంద • ఱిహలోకఫలములఁ
గోరి మోక్షంబును • గోర కంతఁ
జెడిపోవుచుందు రెప్పుడుగాని యందుకుఁ
గడపటియోగంబుఁ • గానలేరు
మానవంతులు సస • మానశౌర్యులు నగు
వారు మిక్కిలియైన • వైరబుద్ధి

(1) జీవచ్ఛవంబైన

తే॥ గీ॥ నాహవంబున మడియుదు ♦ రంతెకాని
మోక్షమార్గంబు గానరు ♦ మూఢవృత్తి
ననుచు సంసారగహనవి♦హార మెల్లఁ
దెలిపి క్రిమ్మఱ ననియె ధా♦త్రీసురుండు. పం. 172

6 వ॥ మఱియుం గాలచక్రనియంత్రితుండై చక్రాయుధునిం గొల్వక కాక గృధ్ర బక సమానులైన పాషండసఖ్యంబునం జేసి వారలచేత వంచితుండై బ్రాహ్మణకులంబునం జేసి శ్రౌతస్మార్త కర్మానుష్ఠాన పరుండై [1]విషయసుఖంబులందుఁ దగులంబడి కాలంబుతుద నెఱుంగక వృక్షంబులుంబోలె నైహికార్థంబులయందుఁ దృష్ణగలిగి మైథుననిమిత్తం బు సుతదారాదులయందు స్నేహంబు సేయుచు పథికుండు మాతంగం బులయందుభయంబున దీర్ఘనిమ్నకూపంబునం బడినతెఱంగున సంసార మృత్యుగజభయంబున గిరికంధరప్రాయంబైన యజ్ఞానతమంబునం బడుం గావున మాయచేత సంసారమార్గంబైనరాజభావంబు విడిచి సర్వ భూతమైత్రిగలిగి జితేంద్రియుండవై జ్ఞానాసిచే మార్గంబుకడపఁ గనుమని పలికిన భూపాలుం డిట్లనియె. పం. 173

7 క॥ అక్కట మానుషజన్మం
బెక్కువమైయుండు నెపు డ♦భేదమతిం బెం
పెక్కినయోగిసమాగమ
మక్కజముగఁ గలిగెనేని ♦ యఖిలాత్ములకున్. పం. 174

8 తే॥ గీ॥ అట్టి యపవర్గసాధన♦మైన మనుజ
భావ మొందియు విషయసం♦బద్ధుఁ డగుచు
వసుధ నెవ్వఁడు వర్తించు ♦ వాఁడు ధరణి
ననయము నిజాత్మవంచకుఁ ♦ డనఁగఁ బరఁగు. చ. 664

9 వ॥ అదియును గాక 'యాత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి' యను వేదవచనంబునం జేసి విషయంబులకుం బ్రియతమత్వంబై యా త్మోపాధికంబు నొంది యాత్మాపహ్నవంబునం బొటిల్లు స్వార్థనాశం బెద్దిగలుగు దానికంటె లోకంబున నధికంబైన స్వార్థనాశంబులే; దది

(1) పర్వతంబున భగవదారాధనంబు చేయక

యెట్లనిన సర్వార్థనాశంబునకు స్థైర్యంబు నొందించునట్టి యర్థకామాభి ధ్యానంబునం దద్ధేతుకంబైన స్వార్థనాశంబునం బరోక్షాపరోక్షరూప జ్ఞానంబునంజేసి నశించుం గావున నాత్మాపహ్నవంబునకంటె నధికతరంబైన సర్వార్థనాశంబు లేదని వెండియు నిట్లనియె. చ. 624

10 సీ॥ అనఘ! యీసంసార ♦ మతిశయంబునఁ దరి
యింపఁగఁ మది నిశ్చ♦యించువాఁడు
గైకొని ధర్మార్థ♦కామమోక్షములకు
నతివిఘాతుక మెద్ది ♦ యట్టిదాని
వలన సంగము సేయ ♦ వలవదు ధర్మాదు
లందుఁద్రివర్గంబు ♦ నంతకోగ్ర
భయకారి యగుటను ♦ బరమమోక్షంబె ము
ఖ్యార్థమై విలసిల్లు ♦ నందురు బుధులు
తే॥ గీ॥ భువి గుణవ్యతికరమునఁ ♦ బుట్టినట్టి
యబ్జజాతాదులకు నస్మ♦దాదులకును
గాలవిధ్వంసితాఖిల♦క్రమము కల్గుఁ
గలుగ దెన్నఁడు సేమంబు ♦ గాన వినుము. చ. 625

11వ॥ కావున మోక్షంబె పరమపురుషార్థంబని చెప్పి వెండియు నిట్లనియె నరేంద్రా! దేహేంద్రియ ప్రాణేంద్రియ బుద్ధ్యహంకార పరివృతంబులైన యీస్థావరజంగమంబులహృదయంబులందు వ్యాపకుండు, ప్రత్యక్షభూతుండు, ప్రత్యగ్రూపుండు, భగవంతుఁడునైన యీశ్వరుం డంతర్యామిరూపంబునం బ్రకాశింపుచుండు; నది నారాయణునిసద్రూపంబుగాఁ దెలియుమని వెండియు నిట్లనియె. చ. 626

12 సీ॥ కలలోన జీవుండు ♦ గౌతూహలంబునఁ
బెక్కు దేహంబులఁ ♦ బేరు వడసి
యింద్రియంబులవెంట ♦ నెల్లవృత్తంబులు
నీక్షించి మఱి తన్ను ♦ నెఱుఁగుకరణి
నఖిలాంతరాత్మకుఁ ♦ డగు పరమేశ్వరుఁ
డఖిలజీవులహృద♦యములనుండి

బుద్ధివృత్తులనెల్ల ♦ బోధియై వీక్షించు
[1]బద్ధుండు గాఁడు ప్రా♦భవమువలన
తే॥ గీ॥ సత్యుఁ డానందబహుళవి♦జ్ఞానమూర్తి
యతని సేవింప నగుఁ గాక ♦ యన్యసేవఁ
గలుగనేరవు కైవల్య♦గౌరవములు
పాయ దెన్నఁడు సంసార♦బంధ మధిప! ద్వి. 18

13 చ॥ హరిఁ బరమాత్ము నచ్యుతు న♦నంతునిఁ జిత్తములోఁ దలంచి సు
స్థిరత విశోక[2]సౌఖ్యములఁ ♦ జెందిసధీనిధు లన్యకృత్యముల్
[3]మరులునఁ జేయ నొల్లరు త♦లంచిన నట్టిదయా సురేంద్రుఁడుం
బరువడి నుయ్యిఁ [4]ద్రవ్వెడు ని♦పానఖనిత్రము మానుకైవడిన్.
ద్వి. 211

14 తే॥ గీ॥ అరసి నిర్గుణబ్రహ్మంబు ♦ నాశ్రయించి
విధినిషేధనివృత్త స♦ద్విమలమతులు
సేయుచుందురు హరిగుణ♦చింతనములు
మానసంబునఁ దలఁచుచు ♦ మానవేంద్ర! ద్వి. 6

15 తే॥ గీ॥ అరయ నెన్నఁడుఁ జేటు లే♦నట్టి ముక్తి
వర్త్మ మీలోకమందు నె♦వ్వనికిఁ గలదు
సాధులును బుణ్యశీలురు ♦ సజ్జనులును
హరిపరాయణతత్పరు ♦ లగుటగాక. ష. 56

16 ఉ॥ భూవర! యేమహాపురుష♦భూషణునందున నీసమస్తవి
శ్వావళి లీలమై సదస♦దాత్మకభావము నొంది భూరిమా
యావిభవంబులం దగి స♦మగ్రవివేకవిరోధిసద్ఘనా
శివిమబుద్ధిఁ దోఁపుచు వి♦శేషగతి న్వెలుఁగొందు నెప్పుడున్.
చ. 627

17 చ॥ సుమహిత నిత్యముక్త పరి♦శుద్ధ విబుద్ధ సుతత్త్వుఁడై యురు
క్రముఁ డభిభూత సత్ప్రకృతి♦[5]కర్మకళంకుఁడు నైనయట్టి యు

(1) బంధబద్ధుఁడుగాఁడు ప్రాభవమున (2) రాజ్యముల (3) మఱచియు
(4) ద్రవ్వునె పిపాసితుఁడై సలిలాభిలాషచేఁ (5) కర్మకలుండును

త్తమచరితుం గృపాకరు నుదా త్తగుణోన్నతు నీశ్వరేశుఁ జి
త్తమునఁ దలంపుమయ్య జనతాపరిరక్షణ! దుష్టశిక్షణా!

చ. 628

18 మ॥ అమరేంద్రాదులుఁగొల్చు భంగి జనుఁ డాయజ్ఞాత్ము సేవింపఁగా
విమలజ్ఞానవిర క్తి ము క్తు లొదవుఁ వేయేల భూనాథ! త
త్కమలాధీశకథాసుధారసనదీకల్లోలమాలావళీ
భ్రమ నెవ్వారికి నైనఁ గర్ణయుగళీపర్వంబు గాకుండు నే!

ద్వి. 40

19 సీ॥ [1]ఉర్వరఁగల రేణువులకన్న దట్టమై
కడు నొప్పుజీవ సంఘములు గలవు
ఆజీవములలోన నరయ ధర్మాయత
మతి వసించినవారు మనుజజాతి
యామనుష్యులలోనఁ గామంబు లెడవాసి
మోక్షార్థు లగువారు మొదల నరిది
మోక్షమార్గం బాత్మమూలంబుగా నుండు
వారిలో ము క్తులు లేరు తరుచు

తే॥ గీ॥ ము క్తులైనట్టివారిలో యు క్తిఁ దలఁపఁ
జాలదుర్లభుఁ డమితప్రశాంతిపరుఁడు
పరమసుజ్ఞాననిరతుండు భద్రగుణుఁడు
రమణ శ్రీవాసుదేవ పరాయణుండు.

ష. 442

20 వ॥ మఱియును సమస్తదేహులకు నాత్మయ (నిమిత్తభూతుండు)నద్వి
తీయుండు శశ్వత్ప్రకాశుండు ప్రధానపురుషుండు స్వతేజోవిధ్వస్త
గుణప్రవాహుండు మానస బుద్ధి సుఖేచ్ఛాద్వేషాదివికల్పరహితుండు
సగుణుండు దేహాత్మభ్రమనివృత్త్యుపలభ్యుండు నాదిమధ్యాంత రహి
తుండు నిత్యానందస్వరూపుండు సర్వజ్ఞుండు పరమేశ్వరుండు నైన
నారాయణు నభేదబుద్ధిం జేసి భజింపుం డతండు సర్వభూతదయాళువులు
నెంతమాత్రంబు సంభవించు నంతమాత్రంబున సంతుష్టచిత్తులు స

1 భూస్థలిగల రేణువుల

ర్వేంద్రియోపశాంతులు నగు పురుషులయెడ సంతుష్టుం డగునని వెండి
యు నిట్లనియె. చ. 659

21 చ॥ చతురత నట్టి యీశ్వరుఁడు ♦ సజ్జనలోకనిరస్తసర్వకా
మితవిమలాంతరంగమున ♦ మిశ్రితభావనఁజేసి సన్నిధా
పితుఁ డగుచు న్దయాకరగ♦భీరగుణంబులఁ జాల నొప్పి యా
శ్రితజనపారతంత్ర్యమును ♦ జేకొని పాయక యుండు నిచ్చలున్. చ. 960

22 సీ॥ పురుషుఁడు చరమమై ♦ భువి యన్యవిషయ ని
వృత్తమై తగ నివ♦ర్తించు చిత్త
వృత్త్యాదులును గల్గి ♦ వెలయంగ నాత్మీయ
మగు మహిమను నిష్ఠుఁ♦డై లభించు
సుఖదుఃఖముల మన♦స్సునఁ దలంపక యహం
కారధర్మంబులు♦గాఁ దలంచి
యనయంబు సాక్షాత్కృ♦తాత్మ తత్త్వము గల్గు
నతఁడు జీవన్ముక్తుఁ ♦డందురు ధీరు
తే॥ గీ॥ లతఁడు నేచందమున నుండు ♦నవిన వినుము
తనశరీరంబు నిలుచుట♦యును జరించు
టయును గూర్చుండుటయు నిఁకే♦మియు నెఱుంగ
కర్థి వర్తించు విను తల్లి ♦ యతఁడు మఱియు. తృ. 944

23 వ॥ మదిరాపానంబునంజేసి మత్తుండగువాఁడు దనకుఁ బరిధానంబగు
నంబరంబు మఱచి వర్తించుచందంబున దనశరీరంబు దైవాధీనంబున
నశ్వరంబని తలంచి యాత్మతత్త్వనిష్ఠుండై యుపేక్షించు; నదియుఁగాక
సమాధియోగంబునంజేసి సాక్షాత్కృతాత్మతత్త్వంబుగలవాఁడై స్వా
ప్నికశరీరంబుచందంబున యావత్కర్మఫలానుభవపర్యంతంబు పుత్ర
దార సమేతంబగు ప్రపంచంబు ననుభవించి యటమీఁదఁ బుత్రదా
రాదిసంబంధంబువలనం బాసి వర్తించు. తృ. 945

24 సీ॥ సుతదారమిత్రాను♦జులకంటె మర్త్యుండు
భిన్నుఁడై వర్తించు♦చున్నరీతి

విస్ఫులింగోల్ముక♦విపులధూమములచే
హవ్యవాహనుఁడు వే♦ఱైనరీతి
వల నొప్ప దేహంబు♦వలన నీ జీవాత్మ
పరికింప భిన్నరూ♦పమున నుండుఁ
దవిలి భూతేంద్రియాం♦తఃకరణంబుల
భాసిల్లుచున్న యా ♦ ప్రకృతిరూప

తే॥ గీ॥ బ్రహ్మమున [1] కాత్మ దా బృహ♦ద్భావ మగుచు
ద్రష్టయగు బ్రహ్మసంజ్ఞచేఁ ♦ దనరుచుండు
నఖిలభూరిప్రపంచంబు♦లందుఁ దన్నుఁ
దవిలి తనయందు నఖిలభూ♦తములఁ గనుచు. తృ. 946

5 సీ॥ వరుసన నన్యభా♦వంబులఁజేసి భూ
తావళియందుఁ ద♦దాత్మకత్వ
మునఁ జూచు నాత్మీయ♦ఘనతరోపాదాన
ములయందుఁ దవిలి యు♦మ్మల వెలుంగు
నిట్టి దివ్యజ్యోతి ♦ యేకమయ్యును బహు
భావంబులను దోఁచుఁ ♦ బ్రకృతిగతుఁడు
నగుచున్న యాత్మయుఁ ♦ మెం డందు దేవతి
ర్యఙ్మనుష్య స్థావ♦రాది వివిధ

తే॥ గీ॥ యోనులను భిన్నభావంబు ♦ నొందుటయును
జాలఁ గల్గు నిజగుణవై♦షమ్యమునను
భిన్నుఁడై వెల్గుఁ గావునఁ ♦ బేర్చి యదియు
దేహసంబంధి యగుచు వ♦ర్తింపుచుండు. తృ. 948

6 క॥ భావింప సదసదాత్మక
మై వెలయుచు దుర్విభావ్య ♦ మగుచు స్వకీయం
బై వర్తింపుచుఁ బ్రకృతిని
భావమునఁ దిరస్కరించు ♦ భవ్యస్ఫూర్తిన్. తృ. 949

---

1 కాత్మ దా పృథగ్భావ

27 సీ॥ అనఘ! మునీంద్ర! మ♦హాభాగ ! యేను గ
ర్మాపహతజ్ఞాని ♦నగుచు మోక్ష
మెఱుఁగంగ లేనైతి ♦ నిట్టి నా కిప్పుడు
గడు విమలంబును ♦ గర్మబంధ
[1]నాశకంబైన వి♦జ్ఞానోపదేశంబు
గావింపు మతిదరా♦కార కూట
ధర్మంబులగు గేహా♦తతులందుఁ జెంది జా
యాతనుజాతధ♦నాదికములు

తే॥ గీ॥ భూరిపురుషార్థములు గాఁగ ♦ బుద్ధిఁ దలఁచు
మతివిహీనుండు సంసార♦మార్గములను
దగఁ బరిభ్రామ్యమాణుఁడై ♦[2] యొగిని మోక్ష
పదము నొందంగఁ జాలఁడు ♦ భవ్యచరిత! చ. 739

28 సీ॥ అనవాంద స్మష్టి న♦వ్యయముగఁ జేయుచుఁ
బ్రచురప్రవాహసం♦పతితమైన
నెఱయఁ గూలం బను ♦ నిర్గమస్థానంబు
నందు వేగముగల♦క్రిందు మాయ
కడఁగి యహంకార ♦ గతివశంబునఁ జాల
[3]వివశుఁడై బోధకు ♦ విపరిణ్యైన
వానికి నీరీతి ♦ వలవంత కర్మప్ర
చారంబులను మీఁదఁ ♦ జక్కనైన

ఆ॥ వె॥ జన్మమరణ ముఖ్య♦జాడ్యంబుతోఁ బాసి
యఖిలసౌఖ్యపదవి ♦ నరసి కమ్రి
మార్గమైనయట్టి ♦ మహనీయధామంబు
చిత్తమార నెట్లు ♦ చేరఁగలఁడు? ష. 232

29 సీ॥ విమలాత్మ యీపృథి♦వికిని గంధమునకు
సలిలంబునకును ర♦సంబునకును

---

1 నాశకంబును నగు (2) నొగిలి (3) విముఖుఁడై

నన్యోన్య మగు నవి♦నాభావ సంబంధ
మైన సంగతిఁ బ్రకృ♦త్యాత్మలకును
సతతంబు నన్యోన్య♦సంబంధ మైయుండు
ప్రకృతి దా నయ్యాత్మఁ ♦ బాయు టెట్లు
దలపోయ నొకమాటు ♦ తత్త్వబోధముచేత
భవభయంబుల నెల్లఁ ♦ బాయుటెట్లు

తే॥ గీ॥ చచ్చి క్రమ్మఱఁ బుట్టని ♦ జాడ యేది
యిన్నియుఁ దెలియ నానతి ♦ యిచ్చి నన్నుఁ
గరుణ రక్షింపవే దేవ♦గణసుసేవ్య
భక్తలోకానుగంతవ్య ♦ పరమపురుష! తృ. 913

30 వ॥ అనిన భగవంతుఁ డిట్లనియె; ననివృత్తంబైన స్వధర్మంబున నిర్మలాంతఃకరణంబునను నిశ్చితంబైన మద్భక్తియోగంబున సత్కథాశ్రవణసంపాదితంబైన వైరాగ్యంబున దృష్ట ప్రకృతిపురుషయాథాత్మ్యంబగు జ్ఞానంబున బలిష్ఠంబై కామానభిష్వంగంబగు విరక్తివలనఁ దపోయుక్తంబైన యోగంబున సుతీవ్రంబైన చిత్తైకాగ్రతం జేసి పురుషునిదగు ప్రకృతి దందహ్యమానంబై తిరోధానంబును బొందు నది యెట్లనిన; నరణిగతంబైనవహ్నిచే నరణి దహింపఁబడుచందంబున జ్ఞానంబునం దత్త్వదర్శనంబునం జేసి నిరంతరంబు దృష్ట[1]దోషయగు ప్రకృతి జీవునిచేత భుక్తభోగయై విడువంబడు నని చెప్పి. తృ. 914

31 క॥ విను ప్రకృతి నైజమహిమం
బునఁ దనలో నున్నయట్టి ♦ పురుషునకు మహే
శునకు నశుభవిస్ఫురణం
బనయముఁ గావింపఁజాల ♦ దది యెట్లనినన్. తృ. 915

32 చ॥ పురుషుఁడు నిద్రవోఁ గలలఁ ♦ బొందు ననర్థకముల్ ప్రబోధమం
దరయఁగ మిథ్యలై పురుషు♦నందు ఘటింపనికైవడి న్బరే
శ్వరునకు నాత్మనాథునకు ♦ సర్వశరీరికిఁ గర్మసాక్షికి
న్బరువడిఁ బొంద వెన్నఁటికిఁ ♦ బ్రాకృతదోషము లంగనామణీ!
తృ. 916

(1) దోషంబులం గల

33 క॥ గురుమతులు దపసు లంతః
కరణంబుల శుద్ధిసేయ ♦ ఘనతరభక్తిన్
హరియందు సమర్పింతురు
పరమానందమున భిన్న♦భవబంధనులై. ప్ర. 59

34 సీ॥ అనఘ! సాక్షాత్కార♦మగు భక్తి యోగాగ్ని
గడఁగి జీవాధార♦కమును బంధ
భూతాత్మకంబునై ♦ పొలుచు హృద్గ్రంథినిఁ
బూని స్వకారణ♦భూతమైన
యరణి దహించు హు♦తాశనుకై వడి
నిర్దహించిన నిట్లు ♦ నెఱసి దగ్ధ
చిత్తుఁడై ముక్తని♦శ్శేషాత్మగుణుఁడు[1] స
ద్ధర్ముఁడునైన య♦తండు మిగుల
తే॥ గీ॥ నర్థిబాహ్యంబులైన ఘ♦టాదికములు
నాంతరములైన సౌఖ్యదుః♦ఖాదికములు
నను విభేదము [2] లాత్మభే♦దకము లగుట
నయ్యుపాధి వినాశంబు ♦ నందఁగలఁడు. చ. 619

35 తే॥ గీ॥ పూని మోక్షార్థి యగువాఁడు ♦ దీనిఁ దీవ్ర
భక్తియోగంబుచేత వి♦రక్తిఁ బొంది
మనము వశముగఁ జేసి య♦మనియమాది
యోగమార్గక్రియాభ్యాస♦యుక్తిఁ జేసి. తృ. 908

36 సీ॥ శ్రద్ధాగరిష్ఠుఁడై ♦ సత్యమైనట్టి మ
ద్భావంబు మత్పాద♦సేవనంబు
వర్ణితమత్కథా♦వర్ణనంబును సర్వ
భూతసమత్వ మ♦జాతవైర
మును బ్రహ్మచర్యంబు ♦ ఘనమౌన మాదిగాఁ
గల నిజధర్మసం♦గతులఁ జేసి
సంతుష్టుఁడును మితా♦శనుఁడు నేకాంతియు
మననశీలుఁడు వీత♦మత్సరుండు

---

(1) సహృదయుఁడు (2) లాత్మసాధకము లగుట

తే॥ గీ॥ నగుచు మిత్రత్వమునఁ గృపఁ ♦ దగిలి యాత్మ
కలితవిజ్ఞానియై బంధ♦కరములైన
ఘనశరీరపరిగ్రహో♦త్కంఠయందు
నాగ్రహము చేసి వర్తింప♦నగును మఱియు. తృ. 909

37 వ॥ జీవేశ్వరతత్త్వజ్ఞానంబునం జేసి నివృత్తంబైన బుద్ధి తదవస్థానంబునం గలిగి దూరీభూతేతరగర్వునుండై జీవాత్మజ్ఞానంబునం జేసి చక్షురింద్రియంబున సూర్యుని దర్శించుచందంబున నాత్మనాయకుండైన శ్రీమన్నారాయణుని దర్శించి నిరుపాధికంబై మిథ్యాభూతంబగు నహంకారంబున సద్రూపంబుచేఁ బ్రకాశమానంబగుచుఁ బ్రధానకారణంబునకు నధిష్ఠానంబుఁ గార్యంబునకుఁ జక్షువుంబోలి ప్రకాశకంబు సమస్తకార్యకారణానుస్యూతంబుఁ బరిపూర్ణంబు సర్వవ్యాపకంబునగు బ్రహ్మంబుఁ బొందు నని చెప్పి వెండియు నిట్లనియె. తృ. 910

38 సీ॥ విను మాత్మవేత్తకు ♦ విష్ణుస్వరూపంబు
నెఱుఁగంగఁబడు నది ♦ యెట్లటన్న
గగనస్థుఁడగు దిన♦కరుకిరణచ్ఛాయ
జలముల గృహకుడ్య♦జాలకముల
వలనఁ దోఁచినఁ బ్రతి♦ఫలితంబుచేతఁ దా
నూహింపఁబడిన య♦య్యినునిపగిది
నర్థి మనోబుద్ధ్యహం[1]కారత్రితయనా
డీప్రకాశముచేత ♦ లీలనెఱుఁగ
తే॥ గీ॥ వచ్చు నాత్మస్వరూపంబు ♦ వలతిగాఁగఁ
జిత్తమునఁ దోఁచు నంచిత♦శ్రీఁ దనర్చి
యమ్మహామూర్తి సర్వభూ♦తాంతరాత్ముఁ
డగుట నాత్మజ్ఞులకుఁ గాన♦నగును మఱియు. తృ. 911

39 చ॥ పురుషుఁడు నిద్ర వోఁ గలలఁ♦బొందిన యాత్మసుఖైకహేతువై
పరఁగిన రాజభృత్యజన♦భావగుణంబులు సంప్రబోధమం

---

1 కరణత్రయ

దరయఁగ మిథ్యయైన గతి ♦ నాంతరబాహ్యగుణప్రభేదము
ల్పరువడిఁ గానకుండు జన♦పాలనశీలన! నిత్యఖేలనా! చ. 621

40 వ॥ మఱియును ద్రష్టయైన యాత్మయు దృశ్యంబైన యింద్రియార్థంబు నను వీనికి నహంకారంబు సంబంధహేతువగుటంజేసి యది యంతఃకరణంబునం గలుగుచుండు. జాగ్రత్స్వప్నంబులయందు నీభేదంబు గనుంగొనుచుండు; నట్టి యంతఃకరణంబు లేనిదియగు సుషుప్తికాలంబునం బురుషుండు జలదర్పణాదినిమిత్తాభావం బగునప్పుడు బింబ ప్రతిబింబ భేదంబు గనుంగొనని చందంబున దృశ్యభేదంబు గనుంగొనకుండుం గావున నంతఃకరణవిలయంబు నొందిన బాహ్యాంతర భేదంబు గనకుండుట నిశ్చయం బని వెండియు నిట్లనియె. చ. 622

41 సీ॥ ఘ్రాని నారూపంబు ♦ భూతజాలంబులు
భూతపావనుఁ డని ♦ పొందుపడఁగ
బ్రహ్మంబు మఱియు శ♦బ్దబ్రహ్మమును శాశ్వ
తంబైన తనువులు ♦ దగిలె నాకు
నఖిలలోకంబులు ♦ ననుగతంబై యుండు
లోకంబు నాయందు ♦ జోకఁ జెందుఁ
నుభయంబు నాయందు ♦ నభిగతం బయ్యుండు
నది లీనమయ్యె న♦య్యుభయమందు
తే॥ గీ॥ వెలయ నిద్రించువాఁ డాత్మ ♦ విశ్వమెల్లఁ
జూచి మేల్కాంచి తా నొక్క♦చోటువానిఁ
గా వివేకించుమాడ్కి నీ ♦ జీవదేశ
మాయదిగ నాడి పరమధ♦ర్మంబుఁ దెలియ. వ. 480

42 ఆ॥ వె॥ నిద్రఁ బోవువేళ ♦ నిరతుఁడై దేహి దా
నెట్టిగుణముచేత ♦ నింద్రియములఁ
గడచినట్టి సుఖముఁ ♦ గను నట్టి బ్రహ్మంబు
కడిమి మెఱయ నన్నుఁ♦గా నెఱుంగు. వ. 481

43 ఆ॥ వె॥ స్వప్నమందు నెట్టు ♦ సంచార మొనరించు
మేలుకాంచి ద్రష్ట ♦ మోాలి నెఱుఁగు

నుభయ మెఱుఁగునట్టి • యుత్తమజ్ఞానంబు
తత్త్వ మట్టిదైన•తలఁపు నేను. ప. 482

44 క॥ సరసుఁడ నగు సనుఁ బొందిన
పురుషులు ఘనశోక మోహ • మోదంబులఁ బొం
దరు గావున [1] నెనయఁగను ద్రి
పురుషాధీశ్వరుఁడ బ్రహ్మ•భూతుఁడ నగుదుర్. చ. 915

45 క॥ ననుఁ బరమేశుఁ బరంజ్యో
తిని ననఘు ననంతు దేవ•దేవు సకలభూ
తనికాయగుహాశయు నా
ద్యుని నజు నాద్యంతశూన్యు • దురితవిదూరుర్. తృ. 862

46 క॥ తిరముగ భవదీయాంతః
కరణసరోజాతకర్ణి•కాతలమున సు
స్థిరుఁ జేసి యింద్రియంబుల
నిరసించి మనోంబకమున • నెఱిఁ గను మనఘా! తృ. 863

47 క॥ పంచేంద్రియముల తెఱవుల
వంచించి మనంబునందు • వరమతులు ప్రతి
ష్ఠించి వహింతురు నన్నును
మంచివరు న్యన్యాసతులు • మఱిఁగినభంగిర్. న. 122

48 క॥ ఏకాగ్రచిత్తులును సు
శ్లోకులునై జపము సేయు•చును ఘనతపముం
గైకొని చేసిన మీకును
జేకురు మహి తేప్సితార్థ•సిద్ధి గడంకర్. చ. 73

49 సీ॥ అధ్యాత్మతత్పరుం • డగువాఁడు పెక్కుజ
న్మంబులఁ బెక్కు కా•లంబులందు
బ్రహ్మపద ప్రాప్తి•పర్యంతమును బుట్టు
సర్వార్థవైరాగ్య•శాలి యగుచుఁ

(1 (నేనింద్రియ

బూని నాభక్తుల • చే నుపదేశింపఁ
బడిన విజ్ఞానసం • పత్తిచేతఁ
బరఁగఁ బ్రబుద్ధుఁడై • బహువారములు భూరి
మత్ప్రసాదప్రాప్తి • మతిఁ దనర్చు
తే॥ గీ॥ నిజపరిజ్ఞాన విచ్ఛిన్న • నిఖిల సంచ
యుండు నిర్ముక్తలింగ దే • హుండు నగుచు
ననఘ! యోగీంద్ర! హృద్గేయ • మగు మదీయ
దివ్యధామంబు నొందు సం • దీప్తుఁ డగుచు. తృ. 918

50 సీ॥ అంబ నారాయణుం • డఖిలశాస్త్రములను
సమధికానుష్ఠిత • సవన తీర్థ
దర్శనజపతపో • ధ్యయనయోగక్రియా
దానకర్మంబులఁ • గానఁబడక
యేచిన మనము బా • హ్యేంద్రియంబుల గెల్చి
సకలకర్మత్యాగ • సరణి నొప్పి
తలకొని యాత్మత • త్త్వజ్ఞానమున మించి
యుదుగక వైరాగ్య • యుక్తిఁ దనరి
తే॥ గీ॥ మహితఫలసంగరహిత ధ • ర్మమునఁ దనరు
నట్టి పురుషుండు దలపోయ • నఖిలహేయ
గుణములను బాసి కల్యాణ • గుణవిశిష్టుఁ
డయినహరి నొందుఁ బరమాత్మ • ననఘుఁడగుచు. తృ. 1026

51 సీ॥ అఖిలభూతములందు • నాత్మరూపంబున
నీశుండు హరి యుండు • నెల్లప్రొద్దు
[1]బుద్ధ్యాది లక్షణం • బులఁ గానఁబడును [2]మ
హాసేవనీయుఁ డ • హర్నిశంబు
వందనీయుఁడు భక్త • [3] వాత్సల్య సంతతి
నియతుఁడై సతతంబు • నియతబుద్ధి

(1) బుద్ధివిశేషణంబుల (2) మహత్సేవనీయు (3) వత్సలుఁ డత్యంత

నాత్మరూపకుఁ డగు ♦ హరికథామృతములు
గర్ణపుటంబులఁ ♦ గాంక్ష దీరఁ
తే॥ గీ॥ గ్రోలుచుండెడు ధన్యులు ♦ గుటిలబహుళ
విషయములనీకృతాంగము ♦ ల్వేగ విడిచి
విష్ణుదేవుని చరణార♦విందయుగము
కడకుఁ జనుదురు సిద్ధంబు ♦ గౌరవేంద్ర! ద్వి. 36

52 సీ॥ దేవ! కొందఱు సూక్ష్మ♦దృక్కులై నట్టిమ
హాత్మకు లుదరస్థు♦డైన వహ్నిఁ
గా మదిఁ దలఁతురు ♦ గైకొని మఱికొంద
ఱారుణు లను పేర ♦ నమరు ఋషులు
లీల సుషుమ్నా నా♦డీమార్గ గతుఁడవై
హృత్ప్రదేశమునఁ జ♦రించుచున్న
రుచిర దేహాకాశ♦రూపిగా భావింతు
రట్టిహృత్పద్మంబు♦నందు వెడలి
తే॥ గీ॥ వితతమూర్ధన్య[1]నాసికా♦గతుల నోలి
బ్రహ్మరంధ్రంబుఁ బ్రాపించి ♦ పరమపురుష
సుమహితానందమయపరం♦జ్యోతియైన
యీశు నినుఁ బొంది మఱి పుట్ట ♦ రిల మహీశ! ద. 1214

53 సీ॥ అంఘ్రిమూలమున మూ♦లాధారచక్రంబుఁ
బీడించి ప్రాణంబు ♦ బిగియఁబట్టి
నాభీతలముఁ జేర్చి ♦ నయముతో మెల్లన
హృత్సరోజము మీఁది ♦ కెగయఁబట్టి
యటమీఁద నురమందు ♦ హత్తించి క్రమ్మఱఁ
దాలుమూలమునకుఁ ♦ దఱిమి నిలిపి
మతముతో భ్రూయుగ్మ♦మధ్యముఁ జేర్చి దృ
క్కర్ణనాసాస్యమా♦ర్గములు మూసి

(1) నాడికా

ఆ॥ వె॥ యిచ్ఛలేనియోగి ♦ యొక్క ముహూర్తార్ధ
మింద్రియానుషంగ ♦ మింత లేక
ప్రాణములను వంచి ♦ బ్రహ్మరంధ్రము చించి
బ్రహ్మమందుఁ గలయుఁ ♦ బౌరవేంద్ర! ద్వి. 29

54 క॥ కామింపకయును సర్వముఁ
గామించియునైన ముక్తిఁ ♦ గామించి తగన్
లోమించి పరమపురుషుని
నేమించి భజించుఁ దత్త్వ♦నిపుణుం డధిపా! ద్వి. 39

55 చ॥ అనఘ! జితేంద్రియు ల్సుమహి♦తాత్ములు నైనసనందనాదు లిం
దనయ మనేకజన్మసము♦పార్జితయోగసమాధిఁజేసి యె
వ్వనిచరణారవిందములు ♦ వారక భక్తి నెఱుంగుచుండు రా
ఘనుఁ బరమేశు నీశు నవి♦కారు నమేయు నజేయు నాద్యునిన్.
చ. 299

56 మ॥ భగవంతు న్పురుషోత్తముణ్ హరిఁ గృపా♦పాథోధి లక్ష్మీశ్వరు
న్సుగుణభ్రాజితు నచ్యుతుం బరుఁబరం♦జ్యోతిణ్ బ్రభు న్సర్వభూ
త[1]గణావాసు నధోక్షజు న్శ్రితజన♦త్రాణైకపారీణు నా
జగదాత్ము న్గనుచుండు రార్యులు దప♦శ్శక్తిణ్ స్ఫుటజ్ఞానులై.
తృ. 374

57 తే॥ గీ॥ కలఁడు జగదేకసన్నుత♦కారణుండు
స్వామి భగవంతుఁ డభవుండు ♦ స్వాశ్రయుండు
పరముఁ డాతనిఁ జూడక ♦ బ్రహ్మకైనఁ
గలుగునే ముక్తపదము దు♦ష్కర్మగతుల. ష. 229

58 తే॥ గీ॥ సారిది క్షేత్రజ్ఞుఁ డన నతి ♦ సూక్ష్మమంది
యరయ నజ్ఞానబంధనం ♦ బగుచు లింగ
దేహమున నెద్ది గల దది ♦ దెలియకున్నఁ
గలదె మోక్షంబు దుష్కర్మ♦గతులచేత. ష. 228

---

1 గుహావాసు

59 మత్త॥ పంచవింశతితత్త్వరాశి క•పారదర్పణ మయ్యుఁ దాఁ
గొంచమై పురుషుండు తత్త్వముఁ • గోరి పట్టఁగ నేర కే
[1]మంచు నెంచుచునుండి హేయకు•మార్గకర్మము సేయఁగా
మంచిలోకము వాని కేటికి • మానుగా సమకూరెడిన్. ప.234

60 క॥ బంధానుమోక్షణక్రియ
సంధానైశ్వర్యధుర్య•శాస్త్రసమగ్ర
గ్రంథంబు మాను చిద్రూ
పాంధునకు సుకర్మగతుల • నగునే శుభముల్. ప. 235

61 తే॥ గీ॥ దాని సంసర్గగుణములు • దప్పి నడుచుఁ
గుచ్ఛితపుభార్యఁ జేకొన్న • కుమతివోలెఁ
గివిరి సుఖదుఃఖములఁగూడి • తిఱుగు జీవ
రూప మెఱుఁగనివారికిఁ • బ్రాపు గలదె. ప. 233

62 శా॥ తన్నిష్ఠాగతిలేనివానికి నస•త్కర్మప్రచారంబుచే
మున్నే మయ్యెడి నాత్మబుద్ధి గుణస•మ్మోహంబునం దోఁచుచు
న్వన్నెల్వెట్టుక వింతబాగులతటి • న్వర్తించు దార్గణ్య సం
పన్నస్త్రీయనుబోలె నెల్లగతులం • బ్రఖ్యాతిమై యుండఁగన్.
ప. 231

63 ఆ॥ వె॥ పురుషుఁ డెట్లయేనిఁ • బూని బిలస్వర్గ
గతుఁడువోలె వర్త•కంబు మాను
నట్టి బ్రహ్మ మెఱుఁగు•నయ్యకు స్వర్భోగ
కర్మగతుల నేమి • కానఁబడును? ప. 230

64 మ॥ పరికింప న్నిజ[2]భక్తియుక్తిగరిమం • బాటిల్లు పంకేరుహో
దరవిన్యస్తసమస్తధర్ములు శాం•తస్వాంతులై సంగముం
బరివర్జించి విశుద్ధచిత్తు లగుచు • న్బంకేజపత్రేక్షణో
తరధర్మైకనివృత్తులై సతతముల్ • దైత్యారిఁ జింతింపుచున్.
తృ. 1016

---

(1) మంచుగించు దలంచువారమ (2) వర్ణధర్మ.

65 ఆ॥ వె॥ వితతరాజ్యగరిమ • విడిచి కాననముల
నాత్మలందు మీఁప•దాజ్ఞయుగము
వలఁతిగాఁగ నిలిపి • వాతాంబుపర్ణాశ
నోగ్రనియతు లగుచు • నుందు రభవ! ద. 254

66 క॥ ధృతచిత్తుఁడు శాంతుండు ని
యతపరిభాషణుఁడు సుమహి•తాచారుఁడు వ
ర్ణితహరిమంగళగుణుఁడును
మితవన్యాశనుఁడు నగుచు • [1]మెలఁగఁగవలయున్. చ. 256

67 ఆ॥ వె॥ పవనము [2]నియమించి • పరిహృతసంగుఁడై
యింద్రియముల గర్వ • మెల్ల మాపి
హరివిశాలరూప•మందుఁ జిత్తము సేర్చి
నిలుపవలయు బుద్ధి • నెఱపి బుధుఁడు. ద్వి. 115

68 క॥ నారాయణరూపామృత
పారావారమునఁ [3]దేలు • భక్తుఁడు దా భూ
దారకరఖాతకోదక
పూరంబుల నేల తృప్తిఁ • బొందు మహాత్మా! ష. 424

69 క॥ హరిచరణాంబుజమకరం
దరసావేశితమనఃప్ర•ధానుండగు స
త్పురుషుఁ డొకవేళ విఘ్నము
బొరసినఁ దనపూర్వమార్గ•మును విడువఁ డిలన్. పం. 5

70 చ॥ తన కులధర్మము న్విడిచి • దానవవైరిపదారవిందము
ల్పనివడి సేవఁజేసి పరి•పాకము వొందక యెవ్వఁడేనిఁ జ
చ్చిన మఱుమేననైన నది • సిద్ధి వహించుఁ దదీయసేవఁ బా
సినఁ గులధర్మగౌరవము • సిద్ధి వహించునె యెన్ని మేనులన్?
ప్ర. 100

(1) మెలఁగుచు మఱియున్ (2) లలయించి (3) నొనరుపడు భక్తి
యుడే యూరి త్తఖాత.

71 చ॥ అభవు నమేయు నవ్యయు న♦నంతు ననారతుఁ బూని మేనిలో
నుభయమునై వెలుంగు పురు♦షోత్తముఁ గాఁ నరు చిత్తకర్మ వా
గ్విభవగరిష్ఠులై వెదకి ♦ వీఱడి ప్రాణులు సర్వవస్తువు
లుభగతిఁ జూడనేర్చి తనుఁ ♦ జూడఁగ నేరని కంటిపోలికన్.
ప. 172

72 సీ. మతి చిక్కఁబట్టి స♦మాధి గౌరవమున
వాసిగాఁ దనకు న♦వ్వల వెలుంగు
[1] నిను నొక్కనాఁడైన ♦ నెఱుఁగునే యాబ్రహ్మ
యజుని మనంబున ♦ నవయవములఁ
బుట్టి జన్మించిన ♦ భూరిజంతువులందు
హీనులమైన మా ♦ కెఱుఁగవశమె
తమలోన నీ వుండఁ ♦ దా మెఱుంగరు నిన్ను
గుణములఁ జూతురు ♦ గుణములైనఁ
తే॥ గీ॥ గాన నొకచోటఁ జీకటిఁ ♦ గందు రాత్మ
లందుఁ దెలియరు వేలుపు ♦ లరయఁ బొందు
లరయుదురు దేహధారు ల♦త్యంధులగుచుఁ
గడిఁది నీమాయ నెన్నఁడు ♦ గడువలేక. స. 213

73 వ॥ మఱియు వివిధకాష్ఠాంతర్గతుండైన వాయుసఖుండు దగ్ధతదోషంబునం బొరయక నిత్యశుద్ధుండై తరతమ భావంబున వర్తించు చందంబున స్వసంకల్ప కృతంబులైన విచిత్రశరీరంబులందు నంతర్యామివై ప్రవేశించి తత్తద్వైచిత్ర్యయోగ నియతంబైన హేయంబునం బొరయక సకలాత్మకంబై యేకరసంబై బ్రహ్మంబైన నిన్ను నైహికాముష్మిక ఫలసంగమంబు లేక విగత రజోగుణంబులం దగిలి కొందఱు భజియించుచుండుదు; రదియునుంగాక దేవా, భవదీయ సంకల్పాధీనంబులైన శరీరంబులం బ్రవేశించియున్న జీవసమూహంబు నీకు శేషభూతంబని తెలిసి కొందఱు భవనివారకంబైన శ్రీమత్త్వచ్చరణారవిందంబులు సేవించి కృతార్థులగుదురు. మఱియును.
ద. 1214

---

(1) నినుఁగావఁడొకనాఁడు నిను నెఱుంగునె బ్రహ్మ.

74 మ. అరవిందాక్ష! భవత్స్వరూప మిలఁ బ్ర♦త్యక్షంబునం గాన నె
వ్వారికింబోలదు శాస్త్రగోచరుఁడవై ♦ వర్తింతు వీసృష్టి మున్
ధర సద్రూప్యుఁడవైన నీవలన నీ♦ ధాత్రాద్యమర్త్యుల్ జనిం
చిరి నిన్నంతక మున్నెఱుంగఁగలమే ♦ చింతింప నే మచ్యుతా!
ద. 1219

75 ఉ. కొందఱు నీ శరీరము ల♦కుంఠిత భక్తి భవద్వశంబులై
పొందఁగ నీ పదాబ్జములు ♦ సేరి భజించుచుఁ దత్సుఖాత్ములై
యుందురు కొంద ఱీతనువు ♦ లోలి ధరించి భవత్పదాబ్జము
ల్పొందఁగఁగోల్వలేక యిలఁ♦బుట్టుచుఁజచ్చుచునుందురవ్యయా!
ద. 1217

76 క॥ ఆలింపుము విన్నప మిదె
వేలుపుగమిఱేఁడ! నిన్ను ♦ వేడికొనియెదన్
నాలోని చిక్కు మానిచి
నీలోనికిఁ గొంచుపొమ్ము ♦ నిఖిలాధీశా! అ. 735

77 క॥ నీదెసఁ దమ చిత్తము లిడి
యేదెసలం బోక గడుతు ♦ రెఱుక గలుగు వా
రాదూ డయడుగుకిరియ నీ
పాదం బను నావకతన ♦ భవసాగరమున్. ద. 92

78 క॥ విడిచితి భవబంధంబుల
[1]నడిచితి మాయావి[2]మోహ♦మైన తమంబు
న్నొడిచితి నరివర్గంబులఁ
గడిచితి నాజన్మదుఃఖ♦కర్మార్ణవమున్. ష. 149

79 క॥ రోషిదూప్యంబున నను
నీషణముఖగహ్వరమున ♦ నెగమ్రింగి [3]కడున్
ద్వేషమునఁ గోఁతఁ జేసిన
దోషదయగు నాత్మమాయ ♦ తొలఁగం గంటిన్. ష. 150

80 ఆ॥ వె॥ నీరరాశిలోన ♦ నిజకర్మబద్ధమై
యుచితనిద్రఁ బొంది ♦ యున్న లోక

(1) జడిసితి (2) మోహసంతమసంబున్ (3) ఒత్వేషమున

మేమహాత్మ్మచేత ♦ నెప్పటి మేల్కాంచు
నట్టి నీవు గురుఁడ ♦ వధిప మాకు. ఆ. 734

81 క॥ పెఱవాఁడు గురుఁ డటంచును
గొఱగాని పదంబు సూపఁ ♦ గుజనుండును నీ
నెఱతోవ నడువనేర్చిన
[1]నఱమఱలేనట్టి పదము♦నందు దయాబ్ధీ! అ. 732

82 చ॥ మది నొకయింతమాత్రము స♦మంబుగఁజేయుచు బాహ్యవర్తనం
గదిసిన యింద్రియంబుల [2]నొ♦కంతకుఁదెచ్చిమనంబు వాక్కునుం
గుదురుగఁద్రోచి తత్త్వమునఁ♦గూర్చుచు[3]శాశ్వతవిగ్రహంబునా
సదయుఁ బ్రశాంతలోకగురు♦సన్నుతిఁజేయఁదొడంగెనిమ్మలన్. మ. 471

83 ఉ॥ కాలము దేశమున్ గ్రతువుఁ ♦ గర్మముఁగర్తయుభోక్తయున్ జగ
జ్జాలముదైవమున్గురువు ♦ సాంఖ్యము మంత్రముయజ్ఞమావహుతు
ల్వేళలు విప్రులున్ జనన♦వృద్ధిలయంబులు హేతుభూతము
ల్లీలలఁ దానయై తగ వె♦లింగెడి నెక్కటి తేజ మీశుఁడున్. ద. 778

84 వ॥ దేవా నీసచ్చరిత్రంబులు కర్ణరసాయనంబులుగా నాకర్ణించుచు
నీకుం బూజలొనర్చుచు నీచరణారవిందంబులకు వందనంబులు సేయుచు
నీదివ్యనామసంకీర్తనంబు సేయుచుం దమ శరీరంబులు భవదధీనంబులుగా
మెలంగునిర్మలబోధాత్ములగువారి చిత్తంబు లను దర్పణంబులం గానం
బడుచుందువు. కర్మవిక్షిప్తచిత్తులైనవారి హృదయంబులనుండియు దూ
రగుండ వగుదు వని మఱియు నిట్లనియె. ద. 1196

85 సీ॥ జయ జయ హరి! దేవ! ♦ సకలజంతువులకు
జ్ఞానప్రదుండవు ♦ గాన వారి
వలన దోషంబులు ♦ గలిగిన సుగుణాసం
తానంబుగాఁ బరి♦జ్ఞానశక్తి

(1) గఱగొఱలే నట్టిపదముగల్గు (2) వికారముమాన్చి (3) సాత్వత

ముఖ్యషడ్గుణపరి♦పూర్ణతఁ జేసి మా
యాత్మావిశిష్టుఁడ ♦ వగుచుఁ గార్య
కారణాత్మకుఁడవై ♦ కడఁగి చరించుచు
నున్న నీయందుఁ బ♦యోరుహాక్ష!
తే॥ గీ॥ తివిరి యామ్నాయములు ప్రవ♦ర్తించుఁగానఁ
బ్రకటత్రిగుణాత్మకంబైన ♦ ప్రకృతితోడ
యోగ మింతయు మాన్పవే ♦ యోగిమాన
సాంబుజాతమధువ్రత ♦ యని నుతించి. ద. 1204

86 సీ॥ పరమవిజ్ఞానసం♦పన్నులైనట్టి యో
గీంద్రులు మహితని♦స్తంద్రలీలఁ
బరిదృశ్యమానమై ♦ భాసిల్లు నిమ్మహీ
పర్వతముఖరప్ర♦పంచ మెల్లఁ
బ్రకటబ్రహ్మస్వరూ♦పముగాఁగఁ దెలియుదు
రెలమి నీవును జగ♦ద్విలయవేళ
నవశిష్టుఁడవుగాన ♦ ననఘ! నీ యందు నీ
విపుల విశ్వోదయ ♦ విలయము లగు
తే॥ గీ॥ ఘటశరావాదులగు మృద్వి♦కారములు మృ
దాత్మకంబైనయట్లు ప♦ద్మాయతాక్ష!
తవిలి కారణరూపంబుఁ ♦ దాల్చి లీలఁ
గడఁగి నీయందు బుద్ధివా♦క్కర్మములను. ద. 1206

87 క॥ అలవడఁజేయుచు నుందురు
బలుకొని యిలఁ బెట్టఁబడిన ♦ పదవిన్యాసం
బుల పతనకారణములుగ
నలవుల సేవించుచును గృ♦తార్థుల రగుచున్. ద. 1207

88 సీ॥ అనఘ దుర్గమమైన ♦ యాత్మతత్త్వంబుఁ బ్ర
వర్తించుకొఱకు ది♦వ్యంబులైన
యంచితరామకృ♦ష్ణాద్యవతారము
ల్భజియించియున్న నీ♦భవ్యచరిత

మను సుధాంభోనిధి ♦ నవగాహనముచేసి
విశ్రాంతచిత్తులై ♦ వెలయుచుండి
మోక్షంబు బుద్ధి స♦పేక్షింప నొల్లరు
మఱియుఁ గొందఱు భవ♦చ్చరణపంక
ఆ॥ వె॥ జములు దగిలి పుణ్య♦తములైన హంసల
వడువు నొంది భాగ♦వతజనముల
నొనరువారు ప్రకట♦యోగిజనాప్తమై
నట్టి ముక్తిఁ గోర ♦ రాత్మలందు. ద. 1216

89 వ॥ అట్టి నిన్నుం బరమాణుకారణవాదులైన కణ్వగౌతమాదులును బ్రకృతికారణవాదులైన సాంఖ్యులును దేహాత్మవాదులైన బౌద్ధులును వివిధంబులైన కుతర్కంబులచేతం బరస్పరావ్యాహతంబులైన మతంబులు దమ తమ కుతర్కవాదంబుల సమర్థించుచు నిన్నుం దెలియ లేరు; మహాభాగ్యవంతులైన యోగీంద్రులకు నీవు ప్రత్యక్షంబైన నివి యన్నియు నసత్యంబులని కానవచ్చు; వెండియుఁ గొందఱు సచరాచర వస్తుజాతంబులకు నంతర్యామివై సర్వంబు నీవయగుటం దెలియక యనిత్యం బనియును విపరీతబుద్ధిం దెలియుదురుగాని భవదీయదివ్యతత్త్వంబు నిక్కంబుగఁ దెలియనేరరు. కొందఱు జగద్భరితుండవుగాన జగ ద్రూపకుండవైన నిన్నుం గటక మకుట కర్ణికాది వివిధభూషణ భేదం బులం గనకంబు నిజస్వరూపంబు విడువక వర్తించు చందంబున జగద్వి కారానుగతుండ వయ్యును నిఖిలహేయప్రత్యనీకకల్యాణగుణాత్మకుం డవై యుండుదువని యాత్మవిదులైనవారు దెలియుదు రదియునుం గాక. ద. 1220

90 చ॥ గురుపదపంకజాతములు ♦ గొల్వనివారలు వో మహాబ్ధిని
స్తరణకుఁ గర్ణధారరహి♦తంబగు నావ ననుగ్రహించు బే
హారిగతి భూరిదుస్తర భ♦వాంబుధిలోన మునుంగుచుందు రం
బురుహదళాక్ష! నిత్యపరి♦పూర్ణుఁడవై తనరారు నిన్నొగిన్. ద. 1227

91 సీ॥ జగతిపైఁ గల తీర్థ♦సాధనంబులనెల్లఁ
బుణ్యానువర్తన♦స్ఫురితులగుచుఁ

బాటించు నీయందు ♦ బద్ధమత్సరములు
లేక భక్తామరా♦నోకహంబు
నగు భవత్పాదాబ్జ♦యుగళంబు సేవించి
భవపాశముల నెల్లఁ ♦ బాఱఁదోలి
సమమతులై యదృ♦చ్ఛాలాభతుష్టి మీరు
సమముగాఁ గైకొని ♦ సాధులగుచుఁ
తే॥ గీ॥ బాదతీర్థంబుగల మహా♦భాగవతజ
నోత్తమోత్తములైనట్టి ♦ యోగివరుల
వారలకెప్పుడు సేవించు♦వాఁడు పొందుఁ
బ్రవిమలానందమయ మోక్ష♦పదము మఱియు. ద. 1229

92 క॥ విశ్వేశ విశ్వభావన
విశ్వాకృతి యోగివంద్య ♦ విను నీచేతఁ
శాశ్వతులమైతి మిప్పుడు
శాశ్వతముగఁ గంటి మధిక♦సౌఖ్యంబు హరీ! ద. 950

93 సీ॥ వికిృయాశూన్యమై ♦ విషయత్వమును లేని
దగుచు నాత్మాకార♦మై తనర్చు
నంతఃకరణ మొక్క ♦ యధికసాక్షాత్కార
విజ్ఞానమునఁబట్టి ♦ వేఱొరులకు
నెఱుఁగంగరానిదై ♦ యేపారియుండుటఁ
జేసి నీనిర్గుణ♦శ్రీవిభూతి
బహిరంగవీథులఁ ♦ బాఱక తిరములై
యమలంబులగు నింద్రి♦యములచేత
ఆ॥ వె॥ నెట్టకేలకైన ♦ నెఱుఁగంగ నగుఁగాని
గుణవిలాసివగుచుఁ ♦ గొమరు మిగుల
నీగుణవ్రజంబు ♦ నేరరా దెఱుఁగంగ
నొక్కమితము లేక ♦ యుంట నీశ! ద. 554

94 క॥ ఎఱుఁగనివారికిఁ దోఁపవు
నెఱిఁ బ్రకృతిఁ జేరి జగము ♦ నిర్మింపఁగ నా

తెలుఁగున రక్షింపఁగ నీ
తెలుఁగునఁ బ్రహరింప రుద్రు♦ తెలుఁగున నీశా! ద. 565

95 ఆ॥ వె॥ సర్వగతుఁడ వయ్యు ♦ సమదర్శనుఁడ వయ్యు
నొకట విషమవృత్తి ♦ నుండు దరయ
నిచ్ఛలేనివారి ♦ కీవు భక్తులు గోరు
తలఁపు లిత్తు కల్ప♦తరువుమాడ్కి. అ. 678

96 సీ॥ భావించి కొందఱు ♦ బ్రహ్మంబు నీ వని
తలపోసి కొందఱు ♦ ధర్మ మనియుఁ
జర్చించి కొందఱు ♦ సదసదీశ్వరుఁ డని
సరవిఁ గొందఱు శక్తి♦సహితుఁ డనియుఁ
జింతించి కొందఱు ♦ చిరతరుం డవ్యయుఁ
డాత్మతంత్రుఁడు పరుం ♦ డధికుఁ డనియుఁ
దొడరి యూహింతురు ♦ తుది నద్వయద్వయ
సదసద్విశిష్టసం♦శ్రియుఁడ వీవు
తే॥ గీ॥ తలఁప నొక్కంత వస్తుభే♦దంబు గలదె
కంకణాదులు పసిఁడి యొ♦క్కటియె కాదె
కడలు పెక్కైన వార్ధి యొ♦క్కటియె కాదె
భేద మనుచును నిను వికల్పింపవలదు. అ. 389

97 మత్త॥ పట్టు లేక బహుప్రకారవి♦పన్నచిత్తుల మైతి మే
మెట్టకేలకు నిన్నుఁ గంటి మ♦భీప్సితార్థము వచ్చుఁ బె
న్వెట్టయైనదవానలంబున ♦ నేఁగు నేనుఁగు మొత్తము
న్నెట్ట లేచిన గంగలోపల♦నీరుఁ గాంచినచాడ్పునన్. అ.168

98 క॥ హృదయేశ! నీప్రసన్నత
పదివేలవపాలిలేశ♦భాగముకతనం
ద్రిదశేంద్రత్వము గలదఁట
తుది నిను మెప్పింప నేది ♦ దొరకదు శ్రీశా! అ. 731

99 ఉ॥ ఒల్లరు నిర్జరేంద్రపద ♦ మొల్లరు బ్రహ్మపదంబు నొందఁగా
నొల్లరు చక్రవర్తిపద ♦ మొల్లరు సర్వరసాధిపత్యము

న్నొల్లరు యోగసిద్ధి మఱి ♦ యొండుభవంబుల నొందనీని నీ
సల్లలితాంఘ్రిరేణువుల♦సంగతి నొందినధన్యు లెప్పుడున్.
ద. 680

100 మ॥ ఇలమీఁదన్ బ్రతుకేల వేల్పులవరం ♦ బేలా ధనం బేల చం
చలగంధర్వపురీవిడంబనము లై♦శ్వర్యంబు లేలా జగం
బులఁ బుట్టించుతలంపునం బ్రకృతితోఁ ♦ బొత్తై తుదిం బాసి ని
ర్మలమై వాఙ్మనసామితంబగు పర♦బ్రహ్మంబు నేఁ జెందెదన్.
న. 255

101 క॥ ఇంగలముతోడిసంగతి
బంగారము వన్నెగలుగు♦భంగిని నీ సే
వాంగీకృతులయఘంబులు
భంగంబులఁ బొందు ముక్తి ♦ ప్రాపించు హరీ. అ. 730

102 సీ॥ దేవ దుర్జనులకు ♦ భావింప హృదయసం
గతుఁడవై యుండియుఁ ♦ గానఁబడవు
కడఁగి మీదివ్యమం♦గళవిగ్రహంబునఁ
జేసి సమంచితా♦శ్రితుల నెల్లఁ
జేకొని సంప్రీత♦చిత్తులఁగాఁ జేయు
దతిశయకారుణ్య♦మతిఁ దనర్చి
కమలాక్ష సర్వ[1]లో♦కైకనాయక భవ
దనుసరణాభిలా♦షానులాప
తే॥ గీ॥ విదితదృఢభక్తియోగ ప్ర♦వీణు లగుచు
నర్థిమై వీతరాగులై ♦నట్టియోగి
జనమనఃపంకజాతని♦షణ్ణమూర్తి
వని యెఱుంగుదురయ్య ని ♦ న్నాత్మవిదులు. తృ. 547

103 సీ॥ అట్టిట్టి దనరాని♦దై మొదలై నిండు
కొన్నదై వెలుఁగుచు ♦ గుణములేని
దై యొక్కచందంబు ♦ దై కలదై నిర్వి
శేషమై క్రియలేక ♦ చెప్పరాని

(1) లోకప్రజాధిప భవదనుదర్శనా

దే రూపమని శ్రుతు • లెప్పుడు నొడివెడి
యారూప మగుచు న•ధ్యాత్మదీప
మై బ్రహ్మ రెండవ•యర్థంబు తుది జగం
బులు నశియింపంగ • భూతగణము
ఆ॥ వె॥ సూక్ష్మభూతమందుఁ • జొరఁగ నాభూతంబు
ప్రకృతిలోనఁ జొరఁగఁ • బ్రకృతి వోయి
వ్యక్తమందుఁ జొరఁగ • వ్యక్త మడంగను
శ్శేషసంజ్ఞ నీవు • చెలువ మగుదు. ద. 126

104 ఆ॥ వె॥ [1]మబ్బు గొలిపి యోగ•మాయ నిద్రించెద
వో పరాత్మభూమ • యోగరాజ
యే తెఱంగు లెన్ని • యెంత యెచ్చోట నీ
హేల లెవ్వఁ డెఱుఁగు • నీశ్వరేశ! ద. 567

105 క॥ నీలోన లేనిచోద్యము
లేలోకములందుఁ జెప్ప • రీశ్వర నీట
న్నేల న్నింగిని దిక్కుల
నీలోఁ జోద్యంబు లెల్ల • నెగడె మహాత్మా! ద. 1242

106 క॥ పరమాణువు మొదలుగఁ గొని
పరమము దుదిగాఁగ మధ్య•పరికీర్తనచే
స్థిరుఁడవు [2]ద్రిగుణహారుండవు
సరి సత్త్వాద్యంతమధ్య•[3]సర్వసుగతివై. ష. 474

107 క॥ పటుఘననీరంధ్రతమః
పటలపరీవృతజగత్ప్ర•పంచమునకు నె
క్కటిలోచనమై మహితో
త్కటరుచి వెలుఁగుదువు భాను•కైవడి ననఘా! త్రి. 869

108 క॥ పరతత్త్వజ్ఞులు గరుణా
కర నిను సంసారరహితుఁ•గాఁ దలపోయ

(1) బ్రమంపఁగొలిపియోగమాయఁగ్రీడింపవై (2) త్రియానిదుఁడవై (3) సద్రివగతివై

న్నరసి నినుఁ గాంచు కెట్లను
గరమరుదే దలఁచి చూడఁ ♦ గమలాధీశా! తృ. 156

109 చ॥ అరయ సమస్తజీవహృద♦యంబులయందు వసించి యేకమై
[1]పరఁగియు నంతరాత్మ సఖి♦భావసుధర్ముఁడవు న్పరాపరే
శ్వరుఁడవునై తనర్చుచును ♦ సజ్జనదుర్లభమైనయట్టి సు
స్థిరమగు సర్వభూతదయ♦ చేఁ బొడఁగానఁగ వత్తు రచ్యుతా!
తృ. 301

110. తే॥గీ॥ మానితవ్రత యోగస♦మాధినియతిఁ
జెంది భవదీయపాదార♦విందయుగము
డెందమునఁ జేర్చి శోకంబు♦లందుఁ ద్రోలఁగి
సంచరించెద సంచిత♦స్థలములందు. తృ. 858

111 ఉ॥ పూని భవత్పదాంబురుహ♦మూలనివాసులమైన మేము మే
ధానిధి నీవిలోకనముఁ ♦ దక్కఁగ నన్య మెఱుంగనేర్తుమే
మానితపారిజాతకుసు ♦ మస్ఫుటనవ్యమరంద[2]లుబ్ధ శో
భానయశాలియైన మధు♦పంబు భజించునె యన్యపుష్పముల్.
చ. 927

112 సీ॥ ఆత్మకుఁ బరిశుద్ధి ♦ సద్ధించువారికి
ధ్యేయమవస్తువు భవ♦ద్దివ్యమూర్తి
యంచితస్వర్గరా♦జ్యాభిషిక్తునకైన
సమధికస్పృహణీయ♦తముఁడ వీవు
సద్భక్తియుతభక్త♦జనసులభుండవు
దుష్టాత్ములకుఁ గడు ♦ దుర్లభుండ
వాత్మదర్శనులకు ♦ నరయఁ గమ్యుండవు
నై యుద్ధి విలసిల్లు ♦ దనఘచరిత
తే॥ గీ॥ యట్టి నిఖిలదురారాధ్య ♦ [3]యీశ దేవ
నెఱయ సుజనులకైన వ♦ర్ణింపరాదు

(1) పరఁగి సుహృత్ప్రియానుగుణ భాసితధర్మ (2) గంధ (3) యీశు నిన్ను

వరల నెవ్వఁడు పూజించు ♦ వాఁడు విడువఁ
జాలునే పద్మదళనేత్ర ♦ సచ్చరిత్ర. చ. 712

113 సీ॥ విశ్వాత్మ నీయందు ♦ వేఱుగా జీవులఁ
గని నెవ్వఁ డటు వాని♦కంటెఁ బ్రియుఁడు
నీకు లేఁ డైనను ♦ నిఖిలవిశ్వోద్భవ
స్థితివిలయంబుల♦కతన దైవ
సంగతనిర్భిన్న ♦సత్త్వాదిగుణవిశి
ష్టాత్మీయమాయచే ♦ నజభవాది
వివిధభేదము నొందు♦దువు స్వస్వరూపంబు
నం దుండుదువు విని♦హతవిమోహుఁ
తే॥ గీ॥ డగుచు నుందువు తగ ని న్న♦నన్యభక్తి
భృత్యభావంబుఁ దాల్చి సం♦ప్రీతిఁ గొల్చు
మమ్ము రక్షింపు మో కృపా♦మయ ! రమేశ !
పుండరీకాక్ష! సంతత♦భువనరక్ష ! చ. 193

114 చ॥ మహిఁ దలపోయ నెవ్వనిస♦మగ్రపరిగ్రహము న్లభింప ని
స్పృహమతులై మునీశ్వరులు♦మృత్యుభయంబునఁ బాతు రట్టిస
న్మహితవివేకశాలి గుణ♦మండన నీ కిల నన్యసత్పరి
గ్రహ మది యెట్టిచోద్యము జ♦గత్పరిపాలన నిత్యఖేలనా !
తృ. 578

115 ఆ॥ వె॥ అన్న మవనియందు ♦ నమృతంబు గోవుల
యందు వహ్ని సమిధ లందు [1]నమరు
యోగవశతఁ బొందు ♦ నోజను బుద్ధిచే
నగుణు నిన్నుఁ గాంతు ♦ [2]రధికగుణులు అ. 167

116 క॥ మునియోగిమానసస్ఫుట
వనజంబుల నెల్లప్రొద్దు ♦ వసియించు భవ
ద్ఘనదివ్యమూర్తి నాలో
చనగోచరమయ్యెఁ గాదె ♦ సర్వాత్మ! హరీ! ద. 1195

(1) నరులు (2) నాత్మఘనులు.

117 క॥ నాపుణ్య మరయ నెట్టిదొ
యాపుణ్యనిధిం బ్రశాంతు నచ్యుతు నఖిల
వ్యాపకు బ్రహ్మణ్యునిఁ జి
ద్రూపకుఁ బురుషోత్తమునిఁ బరుం గనుఁగొంటిన్. ద. 1016

118 చ॥ వనజదళాక్ష భక్తజనవత్సల దేవ భవత్సుతుండు మ
జ్జనకుఁడునైన పంకరుహజాతుఁడు మాకు రహస్య మొప్పఁజె
ప్పినభవదీయమంగళగభీరపరిగ్రహవిగ్రహంబు మే
మనయముఁజూడఁగంటిమి కృతార్థులమై తగ మంటి మీశ్వరా!
తృ 546

119 చ॥ మహితయశోవిలాసగుణమండన సర్వశరణ్య యింద్రియ
స్పృహలకుఁ గానరాక యతసీకుసుమద్యుతి నొప్పుచున్న మీ
సహజశరీర మిప్పుడు భృశంబుగఁ జూచి మదీయదృక్కు లిం
దహహా! కృతార్థతం బొరసె నచ్యుత మ్రొక్కెద మాదరింపవే.
తృ: 553

120 సీ॥ అబ్జాక్ష సకలభూతాంతరాత్ముఁడ వనఁ
దనరుచుండెడినీదుదర్శనంబుఁ
దలకొని సుకృతసత్ఫలభరితంబులై
నట్టి యనేకజన్మానుసరణిఁ
బ్రకటయోగక్రియాభ్యాసనిరూఢులై
నట్టియోగీశ్వరు [1]లాత్మఁ గోరి
యెంతురు యోగీశ్వరేశ్వర యే భవ
త్పాదార[2]విందము ల్పరఁగ నిపుడు
తే॥ గీ॥ గంటి భవవార్ధిఁ గడువఁగఁ గంటి మంటిఁ
గడఁగి నాలోచనంబుల కలిమి నేఁడు
దవిలి సఫలతనొందె మాధవ ముకుంద
చిరదయాకార! నిత్యలక్ష్మీవిహార! తృ. 754

(1) లాత్మ నిశ్చయింతురు (2) విందసందర్శనం

121 ఉ॥ పూని మనంబులు న్దనువు • భూతములు న్మఱి యింద్రియంబులుం
బ్రాణములు న్వివేకగతిఁ • బాయక యన్యముదంబు నెమ్మెయిం
గానఁగనేర వాగుణని • కాయములం బరికించునట్టి స
ర్వానుగతు న్సమస్తహితు • నాదిమపూరుషు నాశ్రయించెదన్.
ష. 216

122 ఆ॥వె॥ ఎల్లతనువులందు • నిరవొంది తనకోడఁ
బొందుసేసినట్టి • పొందుకాని
పొందు వొందలేఁడు • పురుషుండు గుణము[1]దా
గుణిని బోలునట్టి • గుణి భజింతు. ష. 215

123 ఆ॥వె॥ తవిలి గుణముచేతఁ • దత్త్వబుద్ధులచేత
నిగిడి కానరాని • నెలవువాని
మొదలఁ దాన కలిగి • ముక్తిమానావధి
రూప మైనవాని • ప్రాపుఁ గొందు. ష. 214

124 తే॥గీ॥ సత్త్వగుణమున సద్భక్తి • సంభవించు
భక్తియుతముగఁ జిత్తంబు • భవ్యమగును
హృదయపద్మంబునం దోలి • నెఱుఁగఁబడిన
యట్టి నీకు నమస్కార • మయ్య వరద! తృ. 428

125 తే॥గీ॥ తవిలి శశ్వత్స్వరూపచై • తన్యభూరి
మహిమచేత నపాస్తస • మస్తభేద
మోహుఁడ వఖిలవిజ్ఞాన • మునకు నాశ్ర
యుండ వగు నీకు మ్రొక్కెద • నో రమేశ. తృ. 303

126 ఉ॥ హంసతురంగముం బరమ • హంసము నంచిత దేవతాకులో
త్తంసము నాగమాంతవిది • తధ్రువపుణ్యరమావతంసముం
గంసజిఘాంసునంశమును • గర్బురసూత్రసమావృతాంసముం
హింస నడంచు[2]బ్రహ్మము న • హీనశుభంబులకై భజించెదన్.
ష. 3

---

(1) గుణకర్తగుణము. (2) నబ్జభవు నెల్ల

127 శ్లో॥ హంసాయ సత్త్వనిలయాయ సమాశ్రియాయ
నారాయణాయ నిఖిలాయ నిరాశ్రియాయ
సత్సంగ్రహాయ సగుణాయ [1]నిరీశ్వరాయ
సంపూర్ణపుణ్యపతయే హరయే నమస్తే. ష. 20

128 తే॥గీ॥ సర్వసత్త్వాయ దేవాయ ♦ సన్నియామ
కాయ బహిరంతరాత్మనే ♦ కారణాత్మ
నే సమస్తార్థలింగాయ ♦ [2]నిర్గుణాయ
వేధసే జితాత్మకసాధవే నమోస్తు. చ. 704



(1) అనీశ్వరాయ (2) నిర్వికల్పమేధసేహం కృతాత్మనే

# ౫. స్తుతి ప్రకరణము

## ౧. నా రా య ణ స్తు తి.

1 సీ॥ విశ్వజన్మస్థితి♦విలయంబు లెవ్వని
వలన నేర్పడు ననువ♦ర్తనమున
వ్యావర్తనమునఁ గా♦ర్యములం దభిజ్ఞుఁడై
తాన రా జగుచుఁ జి♦త్తమునఁజేసి
వేదంబు లజునకు ♦ విదితము ల్గావించె
నెవ్వాఁడు బుధులు మో♦హింతు రెవ్వ
నికి నెండమావుల♦నీడఁ గాచాదుల
నన్యోన్యబుద్ధిగా ♦ నడరునట్లు
ఆ॥ వె॥ త్రిగుణసృష్టియందు ♦ దీపించు సత్యము
భంగిఁ దోఁచునట్టి ♦ ప్రభు నిరస్త
కుహకుఁ డెవ్వఁ డతనిఁ ♦ గోరి చింతించెద
[1] ననఘు సత్యుఁ బరుని ♦ ననుదినంబు. ప్ర. 34

2 సీ॥ పావకుం డర్చుల ♦ భానుండు దీప్తుల
నెబ్భంగి నిగుడింతు ♦ రెట్లడంతు
రాక్రియ నాత్మక♦రావళిచేత బ్ర
హ్మాదుల వేల్పుల ♦ నఖిలజంతు
గణముల జగముల ♦ ఘననామరూపభే
దములతో మెఱయించి ♦ తగనడంచు
నెవ్వాఁడు మనము బు♦ద్ధీంద్రియములు దాన
నై గుణసంప్రవా♦హంబుఁ [2]బరపు
తే॥ గీ॥ స్త్రీనపుంసకపురుషమూ♦ర్తియును గాక
తిర్యగమరనరాదిమూ♦ర్తియును గాక
కర్మగుణభేదసదసత్ప్ర♦కాశి గాక
వెనుక నన్నియుఁ దా నగు ♦ విభుఁ దలంతు. అ. 85

---

1 నాద్యుఁ బరుని సత్యు 2 నెరపు

3 క॥ జననస్థితిలయదూరుని
మునినుతు నిర్వాణసుఖస♦ముద్రుని సుగుణుం
దనుతనునిఁ బృథులపృథులుని
ననఘుఁ డగు మహానుభావు ♦ నభినందింతున్. అ. 163

4 ఉ॥ మానధనుల్ మహాత్ములు స♦మాధినిరూఢులు యన్ముఖాంబుజ
[1]జ్ఞానమరందపానమున ♦ [2]జన్మభయంబులఁ బాసి ముక్తులై
లూనతలొంద రట్టి ముని♦లోకశిఖామణికి న్విశంకటా
జ్ఞానతమోనభోమణికి ♦ సాధుజనాగ్రణి కేను మ్రొక్కెదన్.
ద్వి. 69

5 ఉ॥ ఏవిభు [3] వందనార్చనము ♦ లేవిభుచింతయు [4]నామకీర్తనం
బేవిభులీల లద్భుతము ♦ లెవ్వనిసంశ్రవణంబు సేయ దో
షావళిఁ బాసి లోకము శు♦భాయతవృత్తిఁ జెలంగు నండ్రు నే
నావిభు నాశ్రయించెద న♦ఘూఘని[5]వృత్తిదు భద్రకీర్తిదున్.
ద్వి. 60

6 ఉ॥ ఏ పరమేశుపాదయుగ ♦ మెప్పుడుఁ గోరి భజించి నేర్పరు
ల్లోపలిబుద్ధిలో నుభయ♦లోకములందులసక్తిఁ బాసి యే
తాపములేక బ్రహ్మగతిఁ ♦ దారు గతశ్రములై చరింతు రే
నా పరమేశు మ్రొక్కెద న♦ఘూఘనివృత్తిదు భద్రకీర్తిదున్.
ద్వి.61

7 చ॥ తపములు చేసినైన మఱి ♦ దానము లెన్నియుఁ జేసినైన నే
జపములు చేసినైన ఫల♦సంచయ మెవ్వనిఁ జేర్చకున్న హే
యపదములై దురంతవిప♦దంచితరీతిగ నొప్పుచుండు న
య్యపరిమితున్ భజించెద న♦ఘూఘనివృత్తిదు భద్రకీర్తిదున్.
ద్వి. 62

8 మ॥ యవన వ్యాళ పుళింద [6]హూణశక కం♦కాభీర చండాల సం
భవులుం దక్కిన పాపవర్తనులు నే♦భద్రాత్ము సేవించి భా

(1) ధ్యాన (2) నాత్మ (3) నామకీర్తనము (4) వందనార్చనం
(5) నివర్తను భద్రకీర్తనున్ (6) హూణకష.

గవత శ్రేష్ఠుల డాసి శుద్ధతనుల ♦ న్గల్యాణులై యుందు గా
యవికారుం బ్రభవిష్ణు నాదుమదిలో ♦నశ్రాంతము న్స్మేకెదన్.
ద్వి. 63

9 మ॥ తపము ల్సేసిననో మనోనియతినో ♦ [1]దానవ్రతప్రీతినో
జపమంత్రంబులనో శ్రుతిస్మృతులనో ♦ సద్భక్తినో యెట్లు ల
బ్ధపదుండౌ నని బ్రహ్మరుద్రముఖరుల్ ♦ భావింతు రెవ్వాని న
య్యపవర్గాధిపుడాత్మమూర్తి సులభుం♦డౌగాక నా కెప్పుడున్.
ద్వి. 64

10 మ॥ అణుడో కాక కడున్మహావిభవుడో♦యచ్ఛిన్నుడో [2]ఛిన్నుడో
గుణియో నిర్గుణియో యటంచు విబుధు ♦ ల్గుంఠీభవత్తత్త్వమా
ర్గణులై యేవిభుపాదపద్మభజనో♦త్కర్షంబుల న్దత్త్వవీ
క్షణముం జేసెద రట్టివిష్ణుఁ బరము ♦ న్సర్వాత్ము సేవించెదన్.
ద్వి. 66

11 సీ॥ సృష్టిచే నెవ్వఁడు ♦ [3]చేతనపడకుండు
సృష్టి యెవ్వనిచేత♦చే జనించు
జగములు నిద్రింప ♦ జాగరూకత నుండి
యెవ్వఁడు బ్రహ్మాండ ♦ మెఱుఁగుచుండు
నాత్మ కాధారంబు ♦ నఖిలంబు నెవ్వఁడు
నెవ్వనినిజధనం ♦ బింతవట్టు
పొడగానరాకుండుఁ ♦ బొడగను నెవ్వఁడు
నెవ్వనిసృష్టికి ♦ నెదురు లేదు
ఆ॥ వె॥ జననవృద్ధివిలయ♦సంగతిఁ జెందక
యెవ్వఁ డెడపకుండు ♦ నెల్లయెడలఁ
దనమహత్త్వసంజ్ఞ ♦ తత్త్వ మెవ్వఁడు దాన
విశ్వరూపుఁ డనఁగ ♦ విస్తరించు. అ. 10

12 క॥ వినుము వత్స నీవు న న్నడి
గిన ప్రశ్నకు నుత్తరంబు ♦ కేవలపరమం

---

(1) దానవ్రతావృత్తినో (2) భిన్నుడో (3) చేపడకుండును.

బును బ్రహ్మం బీ యఖిలం
బున కగు నాధారహేతు♦భూతమునుమీ్మా. ద్వి. 104

13 ఉ॥ సర్వఫలప్రదాతయును ♦ సర్వశరణ్యుఁడు సర్వశక్తుఁడు
న్సర్వజగత్ప్రసిద్ధుఁడును ♦ సర్వగతుం డగు చక్రపాణి యీ
సర్వశరీరులు న్నిగమ♦సంగతిఁ జెంది విశీర్యమాణులై
పర్వినచో [1]నభంబుగతి ♦ బ్రహ్మము దాఁ జెడకుండు నెప్పుడున్. ద్వి. 212

14 తరల॥ పరమపూరుషుఁ డొకఁ డాఢ్యుఁడు ♦ పాలనోద్భవనాశముల్
సొరిదిఁ జేయు ముకుంద పద్మజ ♦ శూలి సంజ్ఞలఁ బ్రాకృత
స్ఫురితసత్త్వరజస్తమంబులఁ ♦ బొందు నందు శుభస్థితుల్
హరి చరాచరకోటి కిచ్చు న♦నంతసత్త్వనిరూఢుఁడై. ప్ర 60

15 క॥ ఆయీశుఁ డనంతుఁడు హరి
నాయకుఁ డీ భువనములకు ♦ నాకు న్నీకు
న్నాయకుఁ [2]బ్రాణివ్రజమున
కేయెడలన్ లేదు నీశ్వ♦రేతరము సుతా! ద్వి. 85

16 క॥ హరిమయము విశ్వ మంతయు
హరివిశ్వమయుండు సంశ♦యము పనిలే దా
హరిమయముగాని ద్రవ్యము
పరమాణువు లేదు వంశ♦పావని వింటే! ద్వి. 17

17 క॥ విశ్వాత్ముఁడు విశ్వేశుఁడు
విశ్వమయుం డఖిలనేత ♦ విష్ణుఁ డజుం డీ
విశ్వములోఁ దా నుండును
విశ్వముఁ దనలోనఁ జాల ♦ వెలుఁగుచునుండున్. ద్వి. 102

18 క॥ ఇందుఁ గలఁ డందు లేఁడని
సందేహము వలదు చక్రి ♦ సర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన
నందందే గలఁడు దాన♦వాగ్రణి వింటే! స. 275

---

1 నభంగగతి. 2 బ్రాణివ్రాతము.

19 మ॥ కలఁ డంభోధిఁ గలండు గాలిఁ గలఁ డా♦కాశంబునం గుంభినిం
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ల నిశలన్ ♦ ఖద్యోతచంద్రాదులం
గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలిం♦గవ్యక్తులం దంతటం
గలఁ డీశుండు గలండు తండ్రి! వెదకం♦గా నేల నీ నా యెడన్.
స. 274

20 క॥ మండలములోన భాస్కరుఁ
డుండుచు జగములకు దీప్తి ♦ నొసఁగెడిక్రియ బ్ర
హ్మాండములోపల నచ్యుతుఁ
డుండుచు [1]బహిరంతరముల ♦ నొగి వెలిఁగించున్. ద్వి. 94

21 క॥ ఆతనికిని బ్రియుఁ డప్రియుఁ
డే తెఱఁగున లేఁడు సఖుల ♦ మెల్లను దానై
భూతముల కాత్మ యగుటయు
భూతప్రియుఁ డొక్కఁ డాది♦పురుషుఁడు దన్వీ! ష. 502

22 తే॥ గీ॥ ఉర్వి మొదలగు నేడు నొం♦డొంటికంటె
దశగుణాధిక మయ్యుండుఁ ♦ దాన [2] నండ
నాశ మొందెడు నాయంశ♦కోటు లెన్న
నందు నణుమానమగు ననం♦తాఖ్యుఁ డతఁడు. ష. 475

23 క॥ పరమబ్రహ్మ మనంగాఁ
బరతత్త్వ మనంగఁ బరమ♦పద మనఁగను నీ
శ్వరుఁ డనఁ గృష్ణుఁ డన జగ
ద్భరితుఁడు నారాయణుండు ♦ దా వెలుఁగొందున్. ఏ. 15

24 క॥ కొందఱు [3]స్వభావ మందురు
గొందఱు కర్మం బటండ్రు ♦ కొందఱు గాలం
బందురు కొందఱు దైవం
బందురు కొందఱును గామ ♦ మండ్రు మహాత్మా! చ. 357

25 క॥ నారాయణుండు జగదా
ధారుం డగు నీశ్వరుండు ♦ దలఁప నతనికిన్

---

1 నావరణగూఢి యొసఁగును దీప్తిన్. 2 నండకోశమందు రజాండంబు
3 కర్మంబందురు కొందరు స్వాభావ్య మండ్రు

లే రెండు సములు సధికులు
ధీరోత్తముఁ డతఁడు సద్వితీయుం డగుటన్. చ. 579

26 క॥ తారల నెన్నఁగవచ్చును
భూరేణుల లెక్కపెట్టఁ • బోలును ధాత్రి
న్నారాయణగుణకథనము
లారయ వర్ణింపలేరు • హరబ్రహ్మదుల్. ఏ. 61

27 క॥ అతిపాపకర్ము లైనను
సతతము నారాయణాఖ్య•శబ్దము మదిలో
వితతంబుగఁ బఠియించిన
చతురులఁ గొనియాడఁ గమల•సంభవువశమే! ఏ. 32

28 క॥ కులహీనుఁడు నారాయణ
విలసత్కథనములు దగిలి • వినిపించినఁ ద
త్కులహీనతఁ బాసి మహో
జ్జ్వలకులజత్వమును బొందు • సన్మునులారా! ప్ర. 450

29 క॥ ధీరులు నిరపేక్షులు నా
త్మారాములు నైన మునులు • హరిభజనము ని
ష్కారణము చేయుచుందురు
నారాయణుఁ డట్టివాఁడ • నవ్యచరిత్రా! ప్ర. 138

30 క॥ [1]ఆద్యుండు రక్షకుండు న
నాద్యుఁడు మాన్యుండు లోక•సర్గత్రాణాం
తాద్యాదు లొనర్చు నతం
డాద్యంతవిధానములకు • నర్హుఁడు మనకున్. అ. 152

31 మ॥ బహుపాదోరుభుజాననేక్షణశిరః•ఫాలశ్రవోయుక్తుఁడై
విహరించు న్బహు దేహి దేహగతుఁడై • విద్వాంసు లూహించి త
ద్బహురూపావయవంబులన్ భువనసం•పత్తి న్విచారింతు రా
మహనీయాద్భుతమూర్తి యోగిజనహృ•న్మాన్యుండు మేధానిధీ!
ద్వి. 88

---

1 వధ్యుండు రక్షణీయుఁడు సాధ్యుఁడు మాన్యుఁడని లోకసర్గత్రాణావధ్యాదు

32 సీ॥ యోగీశరూపుఁడై ♦ యోగంబుఁ జూపుచు
మానిరూపమునఁ గ♦ర్మంబు దాల్చి
సర్గంబు జేయుఁ బ్ర♦జాపతిరూపుఁడై
యింద్రుఁడై దైత్యుల ♦ నేపడంచు
జ్ఞానంబు నెఱిఁగించుఁ ♦ జతురసిద్ధాకృతిఁ
గాలరూపమునఁ బా♦కంబు సేయు
నానావిధాకార♦నామరూపంబులఁ
గర్మలోచనులకుఁ [1] ♦ గానఁబడఁడు

ఆ॥ వె॥ చనినరూపములను ♦ జనురూపముల నింకఁ
జనఁగనున్న రూప♦చయము నతఁడు
వివిధుఁడై యనేక♦వృత్తి వెలుంగును
విష్ణుఁ డవ్యయుండు ♦ విమలచరిత! అ. 438

33 సీ॥ సర్వజ్ఞుఁ డీశుండు ♦ సర్వాత్ముఁ డవ్యయుం
డమలుండు సత్యుం డ♦నంతుఁ డాద్యుఁ
డాత్మరూపంబున ♦ నశ్రాంతమును దన
మాయాప్రవర్తన♦మహిమవలన
గుణములఁ గల్పించి ♦ గుణసంగమంబున
లింగశరీరంబు ♦ లీలఁ దాల్చి
కంపితజలములోఁ ♦ గదలెడిక్రియఁదోఁచు
పాదపంబులభంగి ♦ భ్రామ్యమాణ

ఆ॥ వె॥ చక్షువున ధరిత్రి ♦ చలితమై కానంగఁ
బడినభంగి వికల♦భావరహితుఁ
డాత్మమయుఁడు కంపి♦తాంతరంగంబునఁ
గదలినట్లు తోఁచుఁ ♦ గదలఁ డతఁడు. స. 39

34 మ॥ పరమాత్ముం డజుఁ డీజగంబుఁ బ్రతిక♦ల్పంబందుఁ గల్పించుచున్
బరిరక్షించుచుఁద్రుంచుచున్న యనఘుం♦ బ్రహ్మాత్మునిత్యుం జగ

(1) గలఁడు లేఁడు

ద్భరితు న్గేవలు నద్వితీయుని విశు♦ద్ధజ్ఞాను సర్వాత్ము నీ
శ్వరు నాద్యంతవిహీను నిర్గుణుని శ♦శ్వన్మూర్తిఁ జింతించెదన్.
ద్వి. 112

35 సీ॥ కల్పాంతమున నంధ♦కారసంభృతమైన
జగము నెవ్వఁడు దన ♦ సంప్రకాశ
మున వెలిఁగించుచు ♦ మూఁడుభంగుల రజ
స్సత్త్వతమోగుణ♦సహితుఁ డగుచుఁ
గల్పించు రక్షించుఁ ♦ గడపటఁ బ్రహరించు
నెవ్వఁ డాద్యుఁడు సర్వ♦హేతు వగుచు
శోభితుండై స్వయం♦జ్యోతియై యొక్కఁట
విలసిల్లు నెవ్వఁడు ♦ విభుత మెరసి
ఆ॥ వె॥ సమయమైన మాన♦సప్రాణబుద్ధీంద్రి
యములతోడ నెవ్వఁ ♦ డలఘుమహిమ
నడరు నట్టి సచ్చి♦దానందమయునకు
మహితభక్తి నే న♦మస్కరింతు. స. 87

36 సీ॥ అంభోజనాభున ♦ కంభోజనేత్రున
[1]కంభోజనిలయాస♦మన్వితునకు
నంభోజపదున క♦నంతశక్తికి వాసు
దేవునకును దేవ♦దేవునకును
భక్తులు గోరిన♦భంగి నేరూపైనఁ
బొందువానికి నాది♦పురుషునకును
నఖిలనిధానమై ♦ యాపూర్ణవిజ్ఞాన
మైనవానికిఁ బర♦మాత్మునకును
ఆ॥ వె॥ ధాతఁ గన్నమేటి♦తండ్రికి నజునికి
నీకు వందనంబు ♦ లే నొనర్తు
నిఖిలభూతరూప ♦ నిరుపమ యీశ ప
రాపరాత్మ మహిత ♦ యమితచరిత. ద. 202

(1) కంభోజమాలా

37 సీ॥ సత్యవ్రతుని సత్య♦సంప్రాప్తసాధనుఁ
గాలత్రయమునందుఁ ♦ గలుగువాని
భూతంబు లైదును ♦ బుట్టుచోటగువాని
నైదుభూతంబులం ♦ దమరువాని
నైదుభూతంబులు ♦ నడఁగినపిమ్మటఁ
బరఁగువానిని సత్య♦భాషణంబు
సమదర్శనంబును ♦ జరిపెడువానిని
నిన్నాశ్రయింతుము ♦ నీయధీన

ఆ॥ వే॥ మాయచేత నెఱుక ♦ మానినవారలు
పెక్కుగతుల నిన్నుఁ ♦ బేరుకొందు
రెఱుఁగనేర్చువిబుధు ♦ లేకచిత్తంబున
నఖిలమూర్తు లెల్ల ♦ నీవ యందు. ద. 89

38 తే॥ గీ॥ ఉత్తమశ్లోకుఁ డన నెవ్వఁ ♦ డున్నవాఁడు
సన్నుతుం డగు నెవ్వఁడు ♦ సకలదిశల
నట్టి పరమేశ్వరునిఁ జిత్త♦మందు నిలిపి
తద్గుణంబులు వర్ణింప ♦ ధరణినాథ! ద్వా. 19

39 ఉ॥ ఎవ్వనిచే జనించు జగ ♦ మెవ్వనిలోపల నుండు లీనమై
యెవ్వనియందు డిందుఁ బర♦మేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ డనాదిమధ్యలయుఁ ♦ డెవ్వఁడు సర్వముఁ దాన యైనవాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు ♦ నీశ్వరు నే శరణంబు వేఁడెదన్. అ. 73

40 క॥ ఒకపరి జగములు వెలి నిడి
యొకపఱి లోపలికిఁ గొనుచు ♦ నుభయముఁ దానై
సకలార్థసాక్షియగు న
య్యకలంకుని నాత్మమూలు ♦ నర్థిఁ దలంతున్. అ. 74

41 క॥ లోకంబులు లోకేశులు
లోకస్థులుఁ దెగినతుది న♦లోకంబగు పెం
జీఁకటి కవ్వల నెవ్వఁడు
నేకాకృతి వెలుఁగు నతని ♦ నే సేవింతున్. అ. 75

42 క॥ నర్తకునిభంగిఁ బెక్కగు
మూర్తులలోఁ నెవ్వఁ డాడు ♦ మునులుఁ దివిజు
ల్కీర్తింపనేర రెవ్వని
వర్తన మొరు లెఱుఁగఁ గట్టి♦వాని నుతింతున్. అ. 76

43 ఆ॥ వె॥ ముక్తసంగులైన ♦ మునులు దిదృక్షులు
సర్వభూతహితులు ♦ సాధుచిత్తు
లసదృశవ్రతాఢ్యు ♦ లై కొల్తు రెవ్వని
దివ్యపదము వాఁడు ♦ దిక్కు నాకు. అ. 77

44 సీ॥ భవము దోషంబు రూ♦పంబు కర్మంబు నా
హ్వాయము గుణము లె♦వ్వానికి లేక
జగములఁ గలిగించు ♦ సమయించుకొఱకునై
నిజమాయ నెవ్వఁ డి♦న్నియును దాల్చు
[1]నాపరేశునకు న♦నంతశక్తికి బ్రహ్మ
కిద్ధరూపికి రూప♦హీనునకును
జిత్రచారునకు సా♦క్షికి నాత్మరుచికిని
బరమాత్మునకుఁ బర♦బ్రహ్మమునకు
ఆ॥ వె॥ మాటలను నెఱుకల ♦ మనముల న్జేరంగఁ
గాని శుచికి సత్త్వ♦గమ్యుఁ డగుచు
నిపుణుఁడైనవాని♦నిష్కర్మతకు మెచ్చు
వాని కే నొనర్తు ♦ వందనములు. అ. 78

45 సీ॥ శాంతున కపవర్గ♦సౌఖ్యసంవేదికి
నిర్వాణభర్తకు ♦ నిర్విశేషు
నకు ఘోరునకు గూఢు♦నకు గుణధర్మికి
సౌమ్యున కధికవి♦జ్ఞానమయున
కఖిలేంద్రియద్రష్ట ♦ కధ్యక్షునకు బహు
క్షేత్రజ్ఞునకు దయా♦సింధుమతికి
మూలప్రకృతి కాత్మ♦మూలునకు జితేంద్రి
యజ్ఞాపకునకు దుః♦ఖాంతకృతికి

1 నాపరమేశు కనంత

ఆ॥ వె॥ నెఱి నసత్యమనెడి ♦ నీడతో వెలుఁగుచు
నుండు నెక్కటికి మ♦హోత్తమునకు
నిఖిలకారణునకు ♦ నిష్కారణునకు న
మస్కరింతుఁ నన్ను ♦ మనుచుకొఱకు. అ. 79

46 క॥ యోగాగ్నిదగ్ధకర్ములు
యోగీశ్వరు లేమహాత్ము ♦ నొండెఱుఁగక స
ద్యోగ[1]విభాసితమనముల
బాగుగ నీక్షింతు రట్టి ♦ పరము భజింతున్. అ. 80

47 సీ॥ సర్వాగమామ్నాయ♦జలధికి నపవర్గ
మయునికి నుత్తమ♦మందిరునకు
సకలగుణారణి♦చ్ఛన్నబోధాగ్నికిఁ
దనయంత రాజిల్లు ♦ ధన్యమతికి
గుణలయోద్దీపిత♦గురుమానసునకు సం
వర్తితకర్మని♦ర్వర్తితునకు
దెసలేని నాబోటి♦పశువులపాపంబు
లడఁచువానికి సమ♦స్తాంతరాత్ముఁ
తే॥ గీ॥ డై వెలుంగువాని ♦ కచ్ఛిన్నునకు భగ
వంతునకుఁ [2]దనూజ ♦ వస్తు దేశ
దారసక్తులైన♦వారి కందఁగరాని
వాని కాచరింతు ♦ వందనములు. అ. 81

48 సీ॥ వరధర్మకామార్థ♦వర్జితకాములై
విబుధు లెవ్వాని సే♦వించి యిష్ట
గతిఁ బొందుదురు చేరి ♦ కాంక్షించువారి క
వ్యయదేహ మిచ్చు నె♦వ్వాఁడు గరుణ
ముక్తాత్ము లెవ్వని ♦ మునుకొని చింతింతు
రానందవార్ధిమ♦గ్నాంతరంగు
లేకాంతు లెవ్వని ♦ నేమియుఁ గోరక
భద్రచరిత్రంబుఁ ♦ బాడుచుండు

---

(1) విభావిత (2) దనూజపశుదేశ (3) నీశు దూఱు,

ఆ॥ వె॥ రామహేశు నాద్యు • నవ్యక్తు నధ్యాత్మ
యోగగమ్యుఁ బూర్ణు • నున్నతాత్ము
బ్రహ్మ మైనవానిఁ • బరుని నతీంద్రియు
నీశు [1]స్థూలసూక్ష్ము • నే భజింతు. అ. 83

49 క॥ కలఁ డందురు దీనులయెడఁ
గలఁ డందురు పరమయోగి•గణములపాలం
గలఁ డందు రన్నిదిశలను
గలఁడు గలం డనెడువాఁడు • గలఁడో లేఁడో? అ. 86

50 సీ॥ కలుగఁడే నాపాలి•కలిమి సందేహింప
కలిమిలేములు లేక • కలుగువాఁడు
నా కడ్డపడరాఁడె • నలి నసాధువులచేఁ
బడిన సాధుల కడ్డ•పడెడువాఁడు
చూడఁడే నాపాటుఁ • జూపులఁ జూడక
చూచువారలఁ గృపఁ • జూచువాఁడు
లీలతో నా మొ ఱా•లింపఁడే మొఱగుల
మొఱలెఱుంగుచుఁ దన్ను • మొఱఁగువాఁడు
తే॥ గీ॥ నఖిలరూపులు దనరూప• మైనవాఁడు
[1]నాదిమధ్యాంతములు లేక • నడరువాఁడు
భక్తజనముల దీనుల • పాలివాఁడు
వినఁడె చూడఁడె దలఁపఁడే • వేగ రాఁడె! అ. 87

51 క॥ విశ్వకరు విశ్వదూరుని
విశ్వాత్ముని విశ్వవేద్యు • విశ్వు నవిశ్వున్
శాశ్వతు నజు బ్రహ్మప్రభు
నీశ్వరునిం బరమపురుషు • నే భజియింతున్. అ. 88

52 శా॥ లావొక్కింతయులేదు ధైర్యము విలో•లంబయ్యెఁ బ్రాణంబులు
న్ఠావుల్దప్పెను మూర్ఛవచ్చెఁ దనువున్ • డస్సెన్ శ్రమంబయ్యెడి
న్నీవే తప్ప నితఃపరంబెఱుఁగ మ•న్నింపందగున్ దీనునిన్
రావే యీశ్వర! కావవే వరద సం•రక్షించు భద్రాత్మకా!
అ. 90

(1) ప్రథమ మధ్యాంతములు గానఁబడనివాఁడు.

53 క॥ వినుదఁట జీవులమాటలఁ
జనుదఁట చనరానిచోట్ల • శరణార్థుల కో
యనుదఁట పిలిచిన సర్వముఁ
గనుదఁట సందేహమయ్యెఁ • కరుణావార్థీ! అ. 91

54 ఉ॥ ఓ కమలాక్ష! యోవరద • యోప్రతిపక్షవిపక్షదూర కు
య్యోకవియోగివంద్య సుగు•ణోత్తమ యోశరణాగతామరా
నోకహ యోమునీశ్వరమ•నోహర యోవిమలప్రభావ రా
వే కరుణింపవే తలఁప•వే శరణార్థిని నన్నుఁ గావవే! అ. 92

55 ఉ॥ ఎక్కడనున్న వాఁడు జగ•దీశ్వరుఁ డాత్మమయుండు మాధవుం
డెక్కడి కేఁగి శాంతులు ము•నీశులు భిక్షులు రారు క్రమ్మఱం
దిక్కులు నెల్ల నెక్కడఁ దు•దిం జొర దిక్కగునట్టి దిక్కుకై
మ్రొక్కెద మేము హస్తయుగ•ముల్మకుళించిమదీయరక్షకున్.
స. 108

56 సీ॥ చండమై మహితవీ•క్షణదుస్సహంబై యు
దారమై వెలుఁగొందు • తావకీన
భూరిభాస్వత్తేజ•మునఁ దాప మొందితిఁ
గడుఁ గృశించితి నన్నుఁ • గరుణఁ జూడు
మితరదేవోపాస్తి•రతి మాని మీపాద
కమలము ల్సేవించు • విమలబుద్ధి
యొందాఁక మదిఁ దోఁప • దందాఁకనే కదా
ప్రాణులు నిఖలతా•పమునఁ బడుట
తే॥ గీ॥ యవిరళానన్యగతికుల • నరసి ప్రోచు
బిరుదుగల నీకు నసుఁ గాచు • టరుదె దేవ
ప్రవిమలాకార సంసార•భయవిదూర
భక్తజనపోష పరితోష • పరమపురుష! ద. 431

57 సీ॥ నళినాక్ష మాయాగు•ణవ్యతికరమునఁ
జేసి కార్యంబైన • సృష్టిరూప
మునఁ బ్రకాశించునీ•ఘనరూపవిభవంబు
రూపింప దేహధా•రులకు దుర్వి

భావ్యంబు దలపోయ • భగవంతుఁడవునైన
పద్మాక్ష నీస్వరూ•పంబుకంటె
నన్య మొక్కటి సత్య•మై బోధకంబైన
యది లేదు కాన నీ•యతులదివ్య

తే॥ గీ॥ మైనరూపంబు నాకుఁ బ్ర•త్యక్షమయ్యె
నదియుఁ గాన వివేకోద•యమునఁ జేసి
వరద నీరూప మజ్ఞాన•గురుతమోని
వారకం బయ్యె నాకు శ•శ్వత్ప్రదీప! తృ. 295

58 వ॥ దేవా! నిన్ను పురాణపురుషు నధీశ్వరుండైన విష్ణుం బ్రభ విష్ణుఁగా నెఱుంగుదు. సర్వభూతంబులకుం బ్రాణ పరితాప ధైర్య బలంబులు నీవ; విశ్వంబునకు సర్గస్థితిలయంబుల నెవ్వ రాచరింతురు వారికి సర్గస్థితిలయంబులఁ జేయ నీశ్వరుండవు నీవ; యాత్మకుం బరమాత్మవు నీవ యని మఱియును. ద. 67

59 వ॥ దేవా సకలపురుషాంతర్యామిరూపత్వంబువలనఁ బురుషుండ వయ్యు నపరిచ్ఛిన్నత్వంబు వలన మహాత్ముండవయ్యు నాకాశాది భూత సమాశ్రయత్వంబువలన భూతవాసుండ వయ్యు భూతమయ త్వంబువలన భూతశబ్ద వాచ్యుండవయ్యుఁ గారణాతీతత్వంబువలనఁ బరమాత్ముండవయ్యు జ్ఞాన విజ్ఞాన పరిపూర్ణత్వంబుగలిగి నిర్గుణ నిర్వి కారంబులవలన బ్రహ్మంబవయ్యు బ్రకృతిప్రవర్తకత్వంబువలన ననంత శక్తివై యప్రాకృతుండవయ్యుఁ గాలచక్రవర్తకత్వంబువలనఁ గాలుఁడ వయ్యుం గాలశక్తిసమాశ్రయత్వంబువలనం గాలనాభుండవయ్యు సృష్టిజీవన సంహారాది దర్శిత్వంబువలనం గాలావయవసాక్షివయ్యు నొప్పునీకు నమస్కరించెదము; మఱియును. ద. 682

60 వ॥ దేవా! నీవు ముఖ్యప్రాణంబగుటం జేసి ప్రజాపతివి; మనో బుద్ధి చిత్తేంద్రియంబులకు నధీశ్వరుండవు; మహాభూతగణంబులకు నాధారభూతుండవు; త్రియీతనువునం గ్రతువులు విస్తరింతువు; సకల విద్యలు నీతనువులు; సర్వార్థసాధకులకు సాధనీయుండవు; నీవ యాత్మ నిష్ఠాగరిష్ఠులకు ధ్యేయంబగు నాత్మకాల మయుండవై జనులకు

నాయుర్నాశంబుఁ జేయుదువు; జ్ఞానవిజ్ఞానమూర్తి; వాద్యంత రహితుండ; వంతరాత్మవు; మూఁడుమూర్తులకు మూలంబగు పరమాత్మవు; జీవలోకంబునకు జీవాత్మవు నీవ! సర్వంబును నీవ; నీవుగానిది లేశంబు లేదు. వ్యక్తుండవుగాన పరమాత్మవై పురాణపురుషుండవై యనంతుండవైననీవు ప్రాణేంద్రియమనోబుద్ధిగుణంబుల నంగీకరించి పరమేష్ఠిపద విశేషంబున నిలిచి స్థూలశరీరంబునం జేసి యింతయుం బ్రపంచింతువు. భగవంతుండవైన నీకు మ్రొక్కెద నని మఱియు నిట్లనియె. స. 88

61 సీ॥ విశ్వంబు నీవయై ♦ విశ్వముఁ జూపుచు
విశ్వంబు సేయుచు ♦ విశ్వమునకు
హేతువవై పంచ♦భూత మాత్రేంద్రియ
ములకు మనఃప్రాణ♦బుద్ధిచిత్త
ములకెల్ల నాత్మవై ♦ మొనసి గుణంబుల
నావృత మగుచు ని♦జాంశభూత
మగు నాత్మచయమున ♦ కనుభూతి సేయుచు
మూఁడహంకృతులచే ♦ మునుఁగువడక

తే॥ గీ॥ నెఱి ననంతుఁడవై దర్శ♦నీయరుచి వి
కారసూత్రుండవై నిర్వి♦కారమహిమఁ
దనరి కూటస్థుఁ డన సమ♦స్తంబు నెఱుఁగు
నీకు మ్రొక్కెద మాలింపు ♦ నిర్మలాత్మ! ద. 683

62 సీ. సుమహిత స్వప్న సు♦షుప్తిజాగ్రత లను
మూఁడవస్థలఁ బాసి ♦ వాఁడి మిగిలి
వెలి నుందు లో నుందు ♦ విశ్వమై యుందువు
విశ్వంబు నీయందు ♦ వెలుఁగుచుండు
భవదీయమహిమచేఁ ♦ బాటిల్లు భువనంబు
లుదయించు నొకవేళ ♦ నుడిగి మడఁగు
సంచితాఖండసద్♦జ్ఞానివై యొప్పుచు
నవిహతయోగమా♦యాత్మఁ దనరి

తే॥ గీ॥ దురితదూరులు నిత్యము♦క్తులకుఁ జెంద
నలవియై పెంపు దీపింతు ♦ వంబుజాక్ష
ఘనకృపాకర నిఖలవి♦కారదూర
నీకు మ్రొక్కెద సర్వలో♦కైకనాథ! ద. 1079

63 సీ॥ ఎవ్వనిమాయకు ♦ నింతయు మోహించుఁ
దరిమి యెవ్వనిమాయ ♦ దాఁటరాదు
తనమాయ నెవ్వఁ డిం♦తయుఁ గెల్చె నెవ్వాఁడు
నెవ్వనిఁ బొడగాన ♦ రెట్టిమునులు
సర్వభూతములకు ♦ సమవృత్తి నెవ్వాఁడు
చరియించు నతఁడె పో ♦ జనితమైన
ధరణిపాదములు చి♦త్తము సోముఁ డగ్ని [1]ము
ఖంబును గన్నులు ♦ కమలహితులు
తే॥ గీ॥ చెవులు దిక్కులు రేతంబు ♦ సిద్ధజలము
మూఁడుమూర్తులపుట్టిల్లు ♦ మొదలినెలవు
గర్భ మఖిలంబు మూర్ధంబు ♦ గగన మగుచు
మలయు నెవ్వని వాని న♦మస్కరింతు. అ. 155

64 మ॥ ఒకసూర్యుండు సమస్తజీవులకుఁ దా♦నొక్కొక్కఁడై తోఁచు పో
లిక నేదేవుఁడు సర్వకాలము మహా♦లీల న్నిజోత్పన్న జ
న్యకదంబంబులహృత్సరోరుహముల ♦ న్నానావిధానూన రూ
పకుఁడై యొప్పుచు నుండు నట్టిహరి నేఁ♦ బ్రార్థింతు శుద్ధుండనై. ప్ర. 226

65 ఉ॥ విశ్వభవస్థితిప్రళయ♦వేళలయందు వికారసత్త్వము
న్విశ్వము నీవ యీ నిఖల♦విశ్వము లోలి సృజింతు విందిరా
ధీశ్వర యీశ కేశవ త్ర♦యీమయ దివ్యశరీర దేవ నీ
శాశ్వతలీల లిట్టి వని ♦ సన్నుతిసేయఁగ మాకు శక్యమే? తృ. 437

66 క॥ సర్వము నీలోనిదిగా
సర్వాత్ముఁడ వాదివస్తు♦సంపన్నుఁడవై

---

(1) ముఖంబు చిత్తము సోమకమలహితులు

సర్వమయుఁడవగు నీకును
సర్వేశ్వర లేవు లోను • సంధులు వెలియున్. ద. 120

67 తే॥ గీ॥ అవ్యయుండవు సర్వభూ• తాత్మకుఁడవు
సర్వశక్తిధరుండవు • శాశ్వతుఁడవు
విశ్వకరుఁడవు గురుఁడవు • [1] విపులకీర్తి
వైన నిన్ను నుతింప బ్ర•హ్మకును దరమె? ద. 594

68 క॥ ఎఱిఁగినవార లెఱుంగుదు
రెఱుఁగ స్వభావభావ మేల • నీశ్వర నీ పెం
పెఱుఁగ మనోవాక్కులకున్
గుఱిసేయం గొలఁదిగాదు • గుణరత్ననిధీ! ద. 578

69 శా॥ నీ పాదాబ్జము బ్రహ్మపూజ్యముగదా • నీసేవ సంసార సం
తాపధ్వంసినియౌఁగదా సకలభ•ద్రశ్రేణులం బ్రీతితో
నాపాదింతుగదా ప్రపన్నులకుఁ గా•లాధీశ! కాలంబు ని
ర్వ్యాపారంబు గదయ్య చాలరు నిను•వ్వర్ణింప బ్రహ్మాదులున్.
ప్ర. 249

70 క॥ దీనుల కుయ్యాలింపను
దీనుల రక్షింప మేలు • దీవెనఁ బొందన్
దీనావన! నీకొప్పును
దీనపరాధీన! దేవ• దేవ! మహేశా! అ. 133

71 తే॥ గీ॥ అబ్జసంభవ! హర! దేవ•తార్చనీయ!
భూరిసంసారసాగరో•త్తారణంబు
నవ్యయానంద మోక్షదా•యకము నైన
నీపదధ్యాన మాత్మలో• నిలుపనీవె. ద. 611

72 సీ॥ స్వర్గాపవర్గను•ద్వారాయ సర్వర
సాత్మనే పరమహం•సాయ [2]ధర్మ
పాలాయ సద్ధిత•ఫలరూపకాయ కృ
ష్ణాయ ధర్మాత్మనే • సర్వశక్తి

(1) విమలకీర్తి 2 కర్మపాకాయ తదితర.

యుక్తాయ ఘనసాంఖ్య యోగీశ్వరాయ హి
రణ్యవీర్యాయ రుద్రాయ శిష్ట
నాథాయ దుష్టవినాశాయ శూన్యప్ర
వృత్తాయ కర్మణే మృత్యవే వి
తే॥ గీ॥ రాట్ఛరీరాయ నిఖిలధరాయ [1] వాగ్వి
భూతయే నివృతాయ సత్పుణ్యభూరి
వర్చసేఽఖిల ధర్మదేవాయ చాత్మ
నే నిరుద్ధాయ నిభృతాత్మనే నమోస్తు. చ. 703

73 సీ॥ పంకజనాభాయ సంకర్షణాయ శాం
తాయ విశ్వ ప్రబోధాయ భూత
సూక్ష్మేంద్రియాత్మనే సూక్ష్మాయ వాసుదే
వాయ పూర్ణాయ పుణ్యాయ నిర్వి
కారాయ కర్మనిస్తారకాయ త్రయీ
పాలాయ త్రైలోక్యపాలకాయ
సోమరూపాయ తేజోబలాఢ్యాయ స్వ
యంజ్యోతిషే దురంతాయ కర్మ
తే॥ గీ॥ సాధనాయ పురాపురుషాయ యజ్ఞ
రేతసే జీవతృప్తాయ పృథ్వీరూప
కాయ లోకాయ నభసేంతకాయ విశ్వ
మోనయే విష్ణవే జిష్ణవే నమోస్తు. చ. 702



1 భూతివర్చసే పితృదేవాయ వాగ్విభూతయే నివృత్తాయ వరహ్మాషీ కేంద్రియాత్మనే నిరుద్ధాయ నిభృతాత్మనే నమస్తే.

## ౨. శి వ స్తు తి.



1 సీ॥ భూతాత్మ భూతేశ ♦ భూతభావనరూప
దేవ మహాదేవ ♦ దేవవంద్య
యీ లోకములకెల్ల ♦ నీశ్వరుండవు నీవ
బంధమోక్షములకుఁ ♦ బ్రభుఁడ వీవ
యార్తశరణ్యుండ♦వగు గురుండవు నిన్నుఁ
గోరి భజింతురు ♦ కుశలమతులు
సకలసృష్టి స్థితి ♦ సంహారకర్తవై
బ్రహ్మ విష్ణు శివాఖ్యఁ ♦ బరఁగు దీవు
ఆ॥ వె॥ పరమగుహ్యమైన ♦ బ్రహ్మంబు సదసత్త
మంబు నీశ శక్తి♦మయుఁడ వీవ
శబ్దయోని వీవ ♦ జగదంతరాత్మవు
నీవ ప్రాణ మరయ ♦ నిఖిలమునకు. అ. 222

2 క॥ నీయంద సంభవించుచు
నీయంద వసించియుండు ♦ నిఖిలజగంబుల్
నీయంద లయముఁబొందును
నీ యుదరము స్వభూత♦నిలయము రుద్రా! అ. 224

3 సీ॥ అగ్నిముఖంబు ప♦రాపరాత్మక మాత్మ
కాలంబు గతి రత్న♦గర్భపదము
శ్వసనంబు నీయూర్పు ♦ రసన జలేశుండు
దిశలు కర్ణంబులు ♦ దివము నాభి
సూర్యుండు గన్నులు ♦ శుక్లంబు సలిలంబు
జఠరంబు [1]జలములు ♦ చదలు శిరము
సర్వౌషధులు రోమ♦చయములు శల్యంబు
లద్రులు మానస ♦ మమృతకరుఁడు
తే॥ గీ॥ ఛందములు ధాతువులు ధర్మ♦సమితి హృదయ
మాస్యపంచక ముపనిష♦దాహ్వయంబు

(1) జలధులు.

లైన నీరూపు పరతత్త్వ◆మై శివాఖ్య
మై స్వయంజ్యోతియై యొప్పు ◆ నాద్యమగుచు. అ. 225

4 క॥ కొందఱు గలఁడందురు నినుఁ
గొందఱు లేఁడందు రతఁడు ◆ గుణిగాఁ డనుచు
న్గొందఱు కలఁడని లేఁడని
కొందలమందుదురు నిన్నుఁ◆గూర్చి మహేశా! అ. 226

5 సీ॥ తలఁపఁ బ్రాణేంద్రియ ◆ ద్రవ్యగుణ స్వభా
వుఁడవు కాలక్రతు◆వులును నీవ
సత్యంబు ధర్మ మ◆క్షరము ఋతంబును
నీవ ముఖ్యుండవు ◆ నిఖిలమునకు
ఛందోమయుండవు ◆ సత్త్వరజస్తమ
శ్చక్షుఁడవై యుండు ◆ సర్వరూప
కామపురాధ్వర ◆ కాలగతాధిభూ
త[1]ద్రోహభయము చో◆ద్యంబుగాదు
తే॥ గీ॥ లీల లోచనవహ్నిస్ఫు◆లింగశిఖల
నంతకాదులఁ గాల్చిన◆యట్టి నీకు
రాజఖండావతంస పు◆రాణపురుష
దీనరక్షక కరుణాత్మ ◆ దేవదేవ! అ. 227

6 ఆ॥ వె॥ మూఁడుమూర్తులకును ◆ మూఁడులోకములకు
మూఁడుకాలములకు ◆ మూలమగుచు
భేదమగుచు దీన ◆ భేదమై యొప్పారు
బ్రహ్మ మనఁగ నీవ ◆ ఫాలనయన! అ. 228

7 తే॥ గీ॥ జగములకునెల్ల యోని బీ◆జంబులైన
శక్తి శివకారణుండవై ◆ జగతి నిర్వి
కార[2]బ్రహ్మంబవగు నిన్నుఁ ◆ గడఁగి విశ్వ
నాథుఁగా నెఱిఁగెద నామ◆నమున నభవ! చ. 145

8 తే॥ గీ॥ సమత నదిగానఁ దావకా◆శంబులైన
శక్తి శివరూపములఁ గ్రీడ◆సలుపు దూర్ణ

---

(1) ద్రోహిచయము (2) కారతత్త్వంబవగు

నాభిగతి విశ్వజనన వి♦నాశవృద్ధి
హేతుభూతుండవగుచుందు ♦ పీశ! రుద్ర! చ. 146

9 క॥ సదసత్తత్త్వచరాచర
సదనంబగు నిన్నుఁ బొగడ ♦ జలజభవాదుల్
పెదవులు గదలుప వెఱతురు
వదలక నినుఁ బొగడ నెంతి♦వారము దేవా! అ. 229

10 క॥ నీకంటె నొండెఱుంగము
నీకంటెం బరులు గావ♦నేరరు జగము
ల్నీకంటె నొడయఁ డెవ్వఁడు
లోకంబులకెల్ల నిఖిల♦లోకస్తుత్యా! అ. 232

11 సీ॥ అనఘ! లోకంబుల♦యందు వర్ణాశ్రమ
సేతువు లనఁగఁ బ్ర♦ఖ్యాతినొంది
బలిసి మహాజన♦పరిగృహీతంబులై
యఖిలధర్మార్థదా♦యకములైన
వేదంబులను మది ♦ వృద్ధినొందించుట
కొఱకునై నీవు ద♦క్షుని నిమిత్త
మాతృని జేసి య♦మ్మఖముఁ గావించితి
వటుగాన శుభమూర్తి ♦ వైన నీవు
తే॥ గీ॥ గడగి జనముల మంగళ♦కర్ములైన
వారిముక్తి నమంగళా♦చారులైన
వారి నరకంబు నొందింతు ♦ భూరిమహిమ
భక్తజనపోష! రాజిత♦ఫణివిభూష! చ. 147

12 సీ॥ మఱి భేదబుద్ధిఁ గ♦ర్మప్రవర్తనముల
మదయుతులై దుష్ట♦హృదయులగుచుఁ
బరవిభవాసహ్యా♦భవమనోవ్యాధులఁ
దగిలి మర్మాత్మభే♦దకములైన
బహుదురుక్తులచేతఁ ♦ బరులఁబీడించుచు
నుండు మూఢులను దై♦వోపహతులఁ

గాఁ దలపోసి యక్కపటచిత్తులకు నీ
వంటి సత్పురుషుఁ డే వలననైన
తే॥ గీ॥ హింసఁ గావింపకుండు సమిద్ధచరిత
నీలలోహిత మహితగుణాలవాల
లోకపాలనకలితగంగాకలాప
హార జగన్నుతచారిత్ర యదియుఁగాక. చ. 149

13 క॥ లంపటుల నివారింపను
సంపదఁ గృపఁజేయ జయము సంపాదింపన్
జంపెడివారి [1]వధింపను
సొంపారఁగ నీక చెల్లు సోమార్ధధరా! అ. 231

14 సీ॥ దేవ జగన్నాథ దేవేంద్రవందిత
వితతచారిత్ర సంతతపవిత్ర
హాలాహలాహార యహిరాజకేయూర
బాలేందుభూష సద్భక్తపోష
సర్వలోకాతీత సద్గుణసంఘాత
పార్వతీహృదయేశ భవవినాశ
రజతాచలస్థాన గజచర్మపరిధాన
సురవైరివిధ్వస్త శూలహస్త
తే॥ గీ॥ లోకనాయక సద్భక్తలోకవరద
సురుచిరాకార మునిజనస్తుతివిహార
భక్తజనమందిరాంగణపారిజాత
నిన్ను నెవ్వఁడు నుతిసేయ నేర్చు నభవ! ద. 320

15 ఉ॥ నిండుమతిం దలంతుఁ గమనీయ భుజంగమరాజనుండలీ
మండనుఁ జంద్రఖండపరిమండితమస్తకుఁ దారమల్లికా
పాండురవర్ణుఁ జండతరభండను హేమగిరీంద్రచారుకో
దండు మహేశు గంధగజదానవభంజను భక్తరంజనున్.
వ. 2

(1) హరింపను

16. ఉ॥ శంకర భక్తమానసవ♦శంకర దుష్టమదాసురేంద్రనా
శంకర పాంసునీలరుచి♦శంకరవర్ణ[1] నిజాంగభోగిరా
ట్కంకణ పార్వతీహృదయ♦కైరవకైరవమిత్ర యోగిహృ
త్పంకజపంకజాప్త సిజ♦తాండవఖేలన భక్తపాలనా!
ద. 315

---

## 3. విష్ణు స్తుతి.

1 సీ॥ హరినామకథనదా♦వానలజ్వాలలఁ
గాలవే ఘోరాఘ♦కాననములు
వైకుంఠదర్శన♦వాయుసంఘములచేఁ
దొలఁగవే బహుదుఃఖ♦తోయదములు
కమలనాభధ్యాన♦కంఠీరవములచేఁ
గూలవే సంతాప♦కుంజరములు
నారాయణస్మర♦ణ ప్రభాకరదీప్తిఁ
దీరవే షడ్వర్గ♦తిమిరతతులు
ఆ॥ వె॥ నలిననయనభక్తి♦నావచేఁగాక సం
సారజలధి దాఁటి ♦ చనఁగరాదు
వేయునేల మాకు ♦ విష్ణుప్రభావంబుఁ
దెలుపుయ్య సూత ♦ ధీనమేత! ప్ర. 50

2 ఆ॥ వె॥ కలసి పురుషమూర్తి ♦ కాలరూపములను
లోకజనుల వెలియు ♦ లోన నుండి
జన్మమృత్యువులను ♦ సంసారముక్తుల
నిచ్చునతనిచరిత♦మెల్లఁ జెప్పుమ. ద. 8

3 మ॥ యతచిత్తేంద్రియమారుచుండనగుచుఁ♦యత్నంబొనర్తుఁ హరి
ప్రతిసంపత్తికిఁ బుణ్యావృత్తికిఁ జిదా♦వాసోన్ముఖాసక్తికిఁ

---

1 నిభాంగ

యుత నిర్వాణపదానురక్తికి సుఖో♦ద్యోగక్రియాసక్తికిన్
ధృతిలబ్ధోత్తమమూర్తికి న్సకలధా♦త్రీధుర్యసద్భక్తికిన్.
ష. 148

4 క॥ ప్రియురాలివలని వార్తలు
ప్రియజనులకునెల్ల ప్రోద్దు ♦ ప్రియమగు భంగిన్
బ్రియుఁడగు హరిచరితంబులు
ప్రియభక్తుల కెల్లయెడలఁ ♦ బ్రియములుగావే! ద. 490

5 చ॥ మృదుగతిఁ బువ్వుతేనియ ర♦మించుచుఁ బానము సేయఁ బారు ష
[1]ట్పదమునుఁబోలి యార్తజన♦బాంధవు విశ్వ భవ స్థితి వ్యయా
స్పదమహిమావతారుఁడగు ♦ పంకరుహోదరు నిత్యమంగళ
ప్రదగుణకీర్తనామృతముఁ♦బాయక గ్రోలెదఁజెప్పవే దయన్.
తృ. 195

6 ఆ॥ వె॥ ఏమహాత్మువలన ♦ నీ[2]విశ్వరూపంబు
గానఁ బడిన బుద్ధి ♦ కంపమయ్యె
నా మహాత్ము విష్ణు ♦ నఖిలలోకాధారు
నార్తు లెల్లఁ బాయ ♦ నాశ్రయింతు. ద. 346

7 క॥ మందప్రజ్ఞుఁడనై గో
విందుని మురదైత్యహరుని ♦ విష్ణునిఁ బరమా
నందుని నందతనూజుని
మందరధరుఁ జిత్తమందు ♦ మఱతునె యెందున్. తృ. 97

8 క॥ గజరాజవరదు గుణములు
త్రిజగత్పావనములగుటఁ ♦ దేటపడంగా
సుజనమనోరంజకముగ
విజితేంద్రియ వినఁగ నాకు♦వేడుక పుట్టెన్. ఏ. 49

9 మ॥ భగవద్దివ్య [3]గుణానువర్ణన సుధా♦ప్రాప్త్యైకచిత్తుండనై
బెగడ న్సంసరణోగ్రవైతరణికిన్ ♦ భిన్నాత్ములై తావకీ
యగుణస్తోత్రపరాఙ్ముఖత్వమున మా♦యాసౌఖ్యభావంబుల
న్నగతింగాననిమూఢులన్గనిమది♦న్శోకింతు సర్వేశ్వరా! స. 365

---

1 షట్పదవిభుపోల్క—. 2 విశ్వమంతయు. 3 గుణానువర్ణన.

10 క॥ శ్రీనాయక నీ నామము
నానాభవరోగకర్మ♦నాశమునకు వి
న్నాణం బగు నౌషధ మిది
కానరు దుష్టాత్ము లకట ♦ కంజదళాక్షా. ఏ. 17

11 క॥ శ్రీవనితాధిపునామక
థావిముఖుల కిహము పరము ♦ దవ్వై పిదపం
బోవుదురు నరకమునకు
న్నావిరి నే వారిఁ జూచి ♦ వగతు మునీంద్రా. తృ. 193

12 క॥ ఎఱిఁగినవారం బనుచును
గొఱమాలిన మెఱుక లెఱిఁగి ♦ కొందఱు నీపే
రెఱిఁగియుఁ దలపఁగ నొల్లరు
పఱతు రధోగతులజాడఁ ♦ బద్మదళాక్షా. ద. 94

13 క॥ మందునకు మందబుద్ధికి
మందాయువునకు నిరర్థ♦మార్గములను గో
విందచరణారవింద మ
రందము గానఁ దెలిపితేను ♦ రాత్రిం బవలున్. ప్ర. 394

14 మ॥ అమరు లర్కిసులుం బ్రియాస[1]బలహో♦త్సార్థాభిమానంబుల
న్నముల్లై లబ్ధ[2]వికల్పులైరి సురలు ♦ న్సంశ్రియసంయుక్తులై
రమరారు ల్బహుదుఃఖముం గనిరి తా ♦ మత్యంతదోర్గర్వులై
కమలాక్షుస్మరణంబు వేఁడనిజను ♦ ల్గల్యాణసంయుక్తులే? అ. 326

15 క॥ దానవు లమృతముఁ ద్రావం
బూని పయోరాశిఁ ద్రిచ్చి ♦ పొగిలినమాడ్కిన్
శ్రీనాథపరాఙ్ముఖు లగు
హీనులు వొందంగఁజాల ♦ రిష్టార్థములన్. అ. 327

16 క॥ పురుషుఁడు దవిలి చతుర్విధ
పురుషార్థశ్రేయ మాత్మఁ ♦ బొందెద ననినన్
ధరఁ దత్ప్రాప్తికి హేతువు
హరిపదయుగళంబు దక్క ♦ నన్యము గలదే? చ. 245

---

1 జలసత్వార్థ  2 వికల్పులైరి యమరుల్

17 క॥ హరివార్త లెఱుఁగువారికి
హరిపదములు దలఁచువారి • కనవరతంబున్
హరికథలు వినెడువారికి
మరణాగతమోహసంభ్ర•మము లే దనఘా! ప్ర. 439

18 చ॥ వినుతగుణోత్తరుండు [1]సురు•విక్రముఁడైన హరి న్భజించి త
న్మననలసత్కథామృతము •మానుగఁ గ్రోలుటమాని దుష్కథ
ల్విని ముదమందుచుందురు వి•వేకహీనత నూరఁబంది యా
త్మనుమధురాజ్యభక్ష్యములు•మాని పురీషము మెక్కఁ [2]జాడ్పునన్.
తృ. 1022

19 క॥ సరసిరుహోదరుమంగళ
చరితామృత మాత్మఁ గ్రోలు • జనుఁ డితరకథా
గరళముఁ గ్రోలునె హరిసం
స్మరణము జీవులకు నఖిల•సౌఖ్యద మనఘా. తృ. 192

20 తే॥గీ॥ భూరివిజ్ఞానవిదు లగు • నారదాది
నిర్మలాత్ముల కయిన వ•ర్ణింపరాని
హరికథామృతపానంబు•నందు విసివి
యొల్ల ననుహాఁడె పో వెఱ్ఱి•గొల్లఁ డనఘ! తృ. 188

21 సీ॥ ఎవ్వనిగుణజాల • మెన్న జిహ్వాలు లేక
నళినగర్భాదు ల•నంతుఁ డందురఁ
గోరెడువిబుధేంద్ర•కోటి నొల్లక లక్ష్మి
ప్రార్థించె నెవ్వని•పాదరజము
బ్రహ్మ యెవ్వనిపాద•పద్మంబు గడిగిన
జలము ధన్యతఁ జేసె • జగమునెల్ల
భగవంతుఁ డనియెడి • భద్రశబ్దమునకు
నెవ్వ డర్థాకృతి • నేపుమిగిలె
ఆ॥ వె॥ నే మహాత్ము నాశ్ర•యించి శరీరాది
సంగకోటినెల్ల • సంహరించి

---

1 సురువిక్రముఁ డున్నగునట్టి విష్ణుకీర్తన రుచిరామృతంబు ప్రమదంబున
2 కేఁగు చాడ్పునన్

ప్రాభవమున మునులు ♦ పారమహంస్యంబు
నొంది తిరిగిరాక♦యుండు రెలమి. ప్ర. 451

22 క॥ అగు సర్వేశుఁ బరాత్పరు
జగదేకప్రభునిపాద♦జలజాతంబు
ల్దగిలి భజింతురు సతతము
నిగమోక్తి స్వభక్తియోగ♦నిపుణాత్మకులై. తృ. 221

23 క॥ చిత్రంబులు త్రైలోక్యప
విత్రంబులు భవలతాల♦విత్రంబులు స
న్మిత్రంబులు మునిజనవన
చైత్రంబులు విష్ణుదేవు♦చారిత్రంబుల్. స. 6

24 సీ॥ సంతతంబును గృష్ణ♦సంకీర్తనంబులు
వీనుల కింపుగా ♦ వినఁగవలయు
[1]హరినామకథనంబు ♦ హర్షంబుతోడుతఁ
బాటల నాటలఁ ♦ బనుపవలయు
నారాయణునిదివ్య♦నామాక్షరంబులు
హృద్వీథి సతతంబు ♦ నెన్నవలయుఁ
గంజాక్షులీలలు ♦ గాంతారముల నైన
భక్తియుక్తంబుగాఁ ♦ బాడవలయు
తే॥ గీ॥ వెఱ్ఱిమాడ్కి-ని లీలతో ♦ విశ్వమయుని
నొడువుచును లోకబాహ్యత ♦ నొందవలయు
నింతయును విష్ణుమయ మని ♦ యెఱుఁగవలయు
భేద మొనరింపవలవదు ♦ మేదినీశ! ఏ. 44

25 సీ॥ నారాయణునిదివ్య♦నామాక్షరములపైఁ
గరుఁగని మనములు ♦ గఠినశిలలు
మురవైరికథలకు ♦ ముదితాశ్రురోమాంచ
మిళితమై యుండని ♦ మేను మొద్దు

(1) హర్షంబుతోడుత హరినామకథనంబు

చక్రికి మ్రొక్కని ♦ జడుని యౌదల నున్న
కనకకిరీటంబు ♦ గట్టె మోపు
మాధవార్పితముగా ♦ మననిమానవుసిరి
వనదుర్గచంద్రికా ♦ వైభవంబు
ఆ॥ వె॥ కైటభారిభజన ♦ గలిగి యుండనివాఁడు
గాలిలోన నుండి ♦ కదలు శవము
కమలనాభుపదముఁ ♦ గననివానిబ్రతుకుఁ
బసిఁడి కాయలోని ♦ ప్రాణిబ్రతుకు. ద్వి. 51

26 సీ॥ ముక్తికాంతైకాంత ♦ మోహనకృత్యము
ల్కేలిమై హరినామ ♦ కీర్తనములు
సత్యలోకానంద ♦ సౌభాగ్యయుక్తము
ల్కేలిమై హరినామ ♦ కీర్తనములు
మహితనిర్వాణసా ♦ మ్రాజ్యాభిషిక్తము
ల్కేలిమై హరినామ ♦ కీర్తనములు
బహుకాలజనితత ♦ పఃఫలసారము
ల్కేలిమై హరినామ ♦ కీర్తనములు
తే॥ గీ॥ పుణ్యమూలంబు లనపాయ ♦ పోషకంబు
లభిమతార్థంబు లజ్ఞాన ♦ హరణకరము
లాగమాంతోపలబ్ధంబు ♦ లమృతసేవ
లార్తశుభములు హరినామ ♦ కీర్తనములు. ష. 119

27 సీ॥ విష్ణుకీర్తనములు ♦ విననికర్ణంబులు
గొండలబిలములు ♦ గువలయేశ
చక్రిపద్యంబులు ♦ చదువని జిహ్వలు
గప్పలజిహ్వలు ♦ కౌరవేంద్ర
శ్రీమనోనాథు నీ ♦ క్షింపని కన్నులు
కేకిపింఛాక్షులు ♦ కీర్తిదయిత
కమలాక్షుపూజకుఁ ♦ గాని హస్తంబులు
శవముహస్తంబులు ♦ సత్యవచన

ఆ॥ వె॥ హరిపదతులసీద♦ళామోదరతిలేని
ముక్కు పందిముక్కు ♦ మునిచరిత్ర
గరుడగమనుభజన♦గతిలేని పదములు
పాదపములపాద♦పటల మనఘ. ద్వి. 50

28 సీ॥ బ్రహ్మహత్యానేక♦పాపాటవుల కగ్ని
కీలలు హరినామ♦కీర్తనములు
గురుతల్పకల్మష♦క్రూరసర్పములకుఁ
గేకులు హరినామ♦కీర్తనములు
తపనీయచౌర్యసం♦తమసంబునకు సూర్య
కిరణము ల్హరినామ♦కీర్తనములు
మధుపానకిల్బిష♦మదనాగసమితికిఁ
గేసరు ల్హరినామ♦కీర్తనములు
తే॥ గీ॥ మహితయోగోగ్రనిత్యస♦మాధివిధుల
నలరుబ్రహ్మాదిసురలకు ♦ నందరాని
భూరినిర్వాణసామ్రాజ్య♦భోగభాగ్య
ఖేలనంబులు హరినామ♦కీర్తనములు. వ. 118

29 సీ॥ దూర్వాంకురంబుల ♦ దూర్వాంకురశ్యాము
జలజంబులను జారు♦జలజనయనుఁ
దులసీదళంబులఁ ♦ దులసికాదాముని
మాల్యంబులను [1] విని♦ర్మలచరిత్రుఁ
బత్రంబులను బక్షి♦పత్రునిఁ గడు వన్య
మూలంబులను నాది♦మూలు ఘనుని
నంచితభూర్జత్వ♦గాదినిర్మితవివి
ధాంబరంబులను బీ♦తాంబరధరుఁ
తే॥ గీ॥ దనరుభక్తిని మృచ్ఛిలా♦దారురచిత
రూపములయందుఁ గాని ని♦రూఢమైన
సలిలములయందుఁ గాని స్థ♦లములందుఁ
గాని పూజింపవలయు న♦క్కమలనాభు. చ. 255

---

(1) సునైర్మల్యచరితు

30 సీ॥ కమలాక్షు నర్చించు ♦ కరములు కరములు
శ్రీనాథు వర్ణించు ♦ జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు ♦ చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు ♦ శిరము శిరము
విష్ణు నాకర్ణించు ♦ వీనులు వీనులు
మధువైరిఁ దవిలిన ♦ మనము మనము
భగవంతు వలగొను ♦ పదములు పదములు
పురుషోత్తమునిమీఁది ♦ బుద్ధి బుద్ధి
తే॥ గీ॥ దేవదేవునిఁ జింతించు ♦ దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు ♦ చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి ♦ గురుఁడు గురుఁడు
తండ్రి! హరిఁ జేరుమనియెడి♦తండ్రి తండ్రి! స. 169

31 చ॥ హరి భజియించుహస్తములు ♦ హస్తము లచ్యుతుఁగోరి మ్రొక్కు త
చ్ఛిరము శిరంబు చక్రధరుఁ ♦ జేరిన చిత్తము చిత్త మిందిరా
వరుఁ గను దృష్టి దృష్టి ముర♦వైరి నుతించిన వాణి వాణి య
క్షరుకథ లాను కర్ణములు ♦ గర్ణములై విలసిల్లుఁబో భువిన్.
ద. 969

32 సీ॥ కంజాక్షునకుఁ గాని♦కాయంబు కాయమే
పవనగుంఫితచర్మ♦భస్త్రి గాక
వైకుంఠుఁ బొగడని ♦ వక్త్రంబు వక్త్రమే
ఢమఢమధ్వనితోడి ♦ ఢక్క గాక
హరిపూజనము లేని ♦ హస్తంబు హస్తమే
తరుశాఖనిర్మిత♦దర్వి గాక
కమలేశుఁ జూడని ♦ కన్నులు కన్నులే
తనుకుడ్యజాలరం♦ధ్రములు గాక
ఆ॥ వె॥ చక్రిచింత లేని ♦ జన్మంబు జన్మమే
తరలసలిలబుద్బు♦దంబు గాక
విష్ణుభక్తిలేని ♦ విబుధుండు విబుధుఁడే
పాదయుగముతోడి ♦ పశువు గాక. స. 17

33 సీ॥ అలరుజొంపములతో ♦ నభ్రంకషంబులై
బ్రతుకవే వనములఁ ♦ బాదపములు
ఖాదనమేహనా♦కాంక్షలఁ బశువులు
జీవింపవే గ్రామ♦సీమలందు
నియతమై యుచ్ఛ్వాస♦నిశ్వాసపవనము
ల్ప్రాపింపవే చర్మ♦భస్త్రికలను
గ్రామసూకరశున♦కశ్రేణు లింటింటఁ
దిరుగవే [1]దుర్భాగ్య♦దీనవృత్తి
తే॥ గీ॥ నుష్ట్రఖరములు మోయవే ♦ యురుభరములఁ
బుండరీకాక్షు నెఱుఁగని ♦ పురుషపశువు
లడవులందు నివాసము ♦ లందుఁ బ్రాణ
విషయభరయుక్తితో నుంట ♦ విఫలమధిప. ద్వి. 49

34 క॥ మొత్తుదురు గదల మంటల
కెత్తుదు రడ్డంబు దేహ ♦ మింతింతలుగా
నొత్తుదు రసిపత్రికలను
హత్తుదురు కృతాంతభటులు ♦ హరివిరహితులన్. ద్వి. 25

35 సీ॥ మందారమకరంద♦మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే ♦ మదనములకు
నిర్మలమందాకి♦నీవీచికలఁ దూఁగు
రాయంచ సనునె త♦రంగిణులకు
లలితరసాలప♦ల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే ♦ కుటజములకుఁ
బూర్ణేందు చంద్రికా♦స్ఫురితచకోరక
మరుగునే సాంద్రనీ♦హారములకు
తే॥ గీ॥ నంబుజోదరుదివ్యపా♦దారవింద
చింతనామృతపానవి♦శేషమత్త
చిత్త మేరీతి నితరులఁ ♦ జేరనేర్చు?
వినుతగుణశీల! ♦ మాటలు వేయునేల? స. 150

(1) దుర్భాగ్యధీనమగుచు

36 సీ॥ నీరదాగమమేఘ♦నిర్యత్పయఃపాన
చాతకం బేఁగునే♦ చౌటిపడెకుఁ
బరిపక్వమాకంద♦ఫలరసంబులు గ్రోలు
కీరము ల్బనునె దు♦త్తూరములకు
ఘనరవాకర్ణనో♦త్కలికమయూరము
ల్గోరునే కఠినరఘ♦ల్లీరవంబుఁ
గరికుంభపిశితస♦ద్గ్రాసమోదితసింహ
మరుగునే శునకమాం♦సాభిలాషఁ

తే॥ గీ॥ బ్రవిమలాకార భవదీయ♦పాదపద్మ
యుగసమాశ్రియనై పుణో♦ద్యోగచిత్త
మన్యుఁ జేరునె తన కుపా♦స్యంబు గాఁగ
భక్తమందార! దుర్భవ♦భయవిదూర! ద. 257

37 ఉ॥ కాన సరోజలోచను జ♦గత్ స్తవనీయకథాసుధారసం
బానినయట్టి[1]జిహ్వ యస♦దన్యకథాలవణోదకంబుల
న్బానము సేయఁజూచునె సు♦పర్వమహీజమరంద[2]పానలా
భానుభవంబునొందు[3]మధు♦పంబును బోవునె వేఁపచెట్లకుᳯ.
తృ. 443

38 క॥ విమలమతిఁ దలఁప నెవ్వని
బామనుడిమాత్రమున నిఖిల♦భూదేవీభా
రము వాయు నట్టి హరిపద
కమలమరందంబుఁ గ్రోలు ♦ ఘనుఁ డెవ్వాఁడో. తృ. 96

39 మ॥ ఘనలక్ష్మీయుతమై మహాశుభదమై ♦ కామాదివిధ్వంసియై
సనకాది స్తుతమై నిరంతరతప♦స్సంతప్తపున్నాగజీ
వనమై యొప్పెడు నీకథామృతము దా♦వం గల్గునే భూరిదా
ననిరూఢత్వము లేనివారలకు మా♦నారీమనోహారకా!
ద. 1047

(1) జిహ్వ యితరాను (2) పానశోభా (3) మధుపప్రభుఁ డేగునే

40 క॥ హరి భగవంతుఁ డనంతుఁడు
కరుణాంబుధి సృష్టికార్య♦కారణ హేతు
స్ఫురణుం డవ్విభుకంటెం
బరుఁ డన్యుఁడు లేఁడు తండ్రి! ♦ పరికింపంగన్. ద్వి. 105

41 ఉ॥ కారణకార్యహేతువగు ♦ కంజదళాక్షునికంటె నన్యు లె
వ్వారును లేరు తండ్రి భగ♦వంతు ననంతుని విశ్వభావనో
దారుని సద్గుణావళు లు♦దాత్తమతి న్గొనియాడకుండినన్
జేరవు చిత్తముల్ ప్రకృతిఁ ♦ జెందని నిర్గుణమైన బ్రహ్మమున్.
ద్వి. 213

42 చ॥ హరిపరమాత్ముఁ డీశుఁ డజుఁ♦ డాద్యుఁ డనంతుఁ డనంతమూర్తి సా
గరతనయాహృదీశుఁడు వి♦కారవిదూరుఁడు నిత్యమంగళా
కరుఁడు కృపాపయోనిధి య♦కల్మషచిత్తుఁడు సర్వశక్తి దా
మరసవిలోచనుండు బుధ♦మాన్యచరిత్రపవిత్రుఁ డిమ్ములన్.
తృ. 213

43 క॥ కావున సర్వాత్ముండు మ
హావిభవుఁడు విష్ణుఁ డీశుఁ ♦ డాకర్ణింప
న్సేవింప న్వర్ణింప
న్భావింప న్భావ్యుఁ [1]డభవ♦భాజికి నధిపా! ద్వి. 4

44 క॥ శశ్వత్ప్రశాంతు నభయుని
విశ్వాత్ముఁ బ్రబోధమాత్రు ♦ విభు సంశుద్ధున్
శాశ్వతు సదసత్పూరుషు
నీశ్వరుఁ జిత్తమున నిలుపు ♦ మెపుడు మునీంద్రా! ద్వి. 209

45 క॥ నిరతిశయోజ్జ్వల తేజ
స్స్ఫురణ న్దనరారు పరమ♦పురుషుని విష్ణుం
బురుషోత్తము వర్ణింపను
సరసిజభవ భవులకైన ♦ శక్యమె చెప్పుమా. తృ. 366

46 క॥ హరిమహిమముఁ దన్నాభీ
సరసిజసంజాతుఁడైన ♦ చతురాననుఁడు

1. డుభయభాజికి

న్వరికించి యెఱుఁగఁడనిన ని
తరమనుజులఁ జెప్పనేల ♦ తత్త్వజ్ఞనిధీ. తృ. 225

47 తే॥ గీ॥ శ్రుతులు దమలోన వివరించి ♦ చూచి పుండ
రీకలోచను నుత్తమ♦శ్లోకచరితు
నమరగణవంద్యమానపా♦దాబ్జయుగళు
వెదకి కనుఁగొనలే వండ్రు ♦ విమలమతులు. తృ. 226

48 క॥ ఆ దివిజాధీశుఁడు మహా
దాదులు దిక్పతులుఁ బంక♦జాసనుఁడు న్గౌ
రీదయితుఁడుఁ గనఁజాలని
శ్రీదేవుని పదయుగంబుఁ ♦ జింతింతు మదిన్. తృ 228

49 తే॥ గీ॥ పరమునికి వందనము సేతుఁ ♦ బరిఢవించి
మును నవితథానుభూతికి ♦ మొ్రక్కి కొందు
మెఱయ గుణములఁ దేలు ని♦మిత్తమాత్ర
బంధుఁడై నట్టివానికిఁ ♦ బ్రణుతి సేతు. ష. 213

50 ఉ॥ ఏపరమేశుచే జగము ♦ లీ సచరాచరకోటితో సము
ద్దీపితమయ్యె నేవిభుని ♦ దివ్యకళాంశజు లబ్జగర్భ గౌ
రీపతి ముఖ్యదేవముని♦బృందము లెవ్వఁ డనంతుఁ డచ్యుతుం
డా పురుషోత్తముండు గరు♦ణాంబుధి కృష్ణుఁడువో నరేశ్వరా!
తృ. 30

51 మ॥ బలుఁడుం గృష్ణుఁడు మర్త్యులే వసుమతీ♦భారంబు వారింప వా
రలరూపంబులఁ బుట్టినాఁడు హరి ని♦ర్వాణప్రభుం[1]డిప్డు దు
జ్జ్వలుఁడై ప్రాణవియోగకాలమునఁ ద♦త్స్వేశుఁజింతించువాఁ
డలఘుశ్రేయముఁబొందుబ్రహ్మమయుఁడై♦యర్థాభుఁడైనిత్యుఁడై.
ద. 1450

52 సీ॥ కన్నులు దెఱవని ♦ కడుచిన్నిపాపఁడై
దానవిఁ జనుబాలు ♦ ద్రావి చంపె

---

1 డెవ్వఁడుజ్జ్వలుఁడై

మూఁడవనెలనాఁడు ♦ ముద్దులబాలుఁడై
కోపించి శకటంబుఁ ♦ గూలఁదన్నె
నేడాది కుఱ్ఱఁడై ♦ యెగసి తృణావర్తు
మెడఁబట్టుకొని కూల్చి ♦ మృతునిఁజేసెఁ
దల్లి వెన్నలకునై ♦ తను ఱోలఁగట్టినఁ
గొమరుఁడై మద్దులఁ ♦ గూల నీడ్చె

తే॥ గీ॥ బసులఁగ్రేపులఁగాఁచుచు ♦ బకునిజీరె
వెలఁగతో వత్సదైత్యుని ♦ వ్రేసిచంపె
సబలుఁడై ఖరదైత్యుని ♦ సంహరించె
నితఁడు కేవలమనుజుఁడే ♦ యెంచిచూడ. ద. 932

53 క॥ తెంపరియై రామునిచేఁ
జంపించెఁ బ్రలంబు మ్రింగెఁ ♦ జటులదవాగ్ని
న్సొంపుచెడఁద్రొక్కెఁ గాళియుఁ
దుంపక కాళింది వెడలఁ ♦ ద్రోలెఁ లీలన్. ద. 933

54 చ॥ సతతము కృష్ణపాదజల♦జంబులయందు మనంబు నిల్పుసు
వ్రతులఁ దదీయశుద్ధ గుణ♦రాగులఁ గాలునియుగ్రపాశ సం
హతుల ధరించు తత్సుభట♦కౌఘములం గలలోనఁ గాన రే
గతులను దుష్టకర్మములు ♦ గైకొని వారలఁ జెందనేర్పునే.
ష. 58

55 ఉ॥ కూలినచోటఁ గొట్టుపడి ♦ కుందినచోట మహాజ్వరాదులం
బ్రేలినచోట సర్పముఖ♦పీడలనందినచోట నార్తులై
తూలినచోట విష్ణు భవ♦దూరునిఁ బేర్కొని రేని మీఁద న
క్కాలుని యాతనావితతిఁ ♦ గానరు పూనరు దుఃఖభావముల్.
ష. 123

56 క॥ దానవదైత్యభుజంగమ
మానవగంధర్వసురస♦మాజములోఁ ల
క్ష్మీనాథు చరణకమల
ధ్యానంబున నెవ్వఁడైన ♦ ధన్యతనొందున్. స. 242

57 క॥ భూషణములు సెవులకు బుధ
తోషణము లనేకజన్మ•దురితౌఘవిని
శ్శోషణములు మంగళతర
ఘోషణములు గరుడగమను•గుణభాషణముల్. ద. 1687

58 క॥ శ్రీపంబులు ఖండితసం
తాపంబులు కల్మషాంధ•తమసమహోద్య
ద్దీపంబులు పాషండదు
రాపంబులు విష్ణువంద•నాలాపంబుల్. ప్రి 445

59 క॥ పావనములు దురితలతా
లావనములు నిత్యమంగ•ళప్రాభవసం
జీవనములు లక్ష్మీసం
భావనములు వాసుదేవ•పదసేవనముల్. ప్రి. 446

60 క॥ శ్రీపతిపద మను నావను
బ్రాపించు భవాబ్ధి వత్స•పదముగ ధీరు
లూప్రించి దాఁటి చేరుదు
రాపత్పదరహితు లగుచు • నమృతపదంబుల్. ద. 594

61 క॥ కాన భవత్పదపద్మ
ధ్యానంబునఁ గాని శాస్త్ర•తత్త్వంబులచేఁ
గానరు శ్రుతిసంవేద్యము
నైన భవత్పదము చిన్మ•యాకార హరీ! ద. 1150

62 ఆ॥ వె॥ జలజనాభ సకల•జగదంతరాత్మ వై
నట్టిదేవ నీప•దారవింద
యుగళి సానురాగ•యుక్తమై నామదిఁ
గలుగునట్లు గాఁగఁ • దలఁపు మనఘ! ద. 260

63 సీ॥ మానితశ్యామాయ•మానశరీర దీ
ధితులు నల్దిక్కులఁ • దీటుకొనఁగఁ
గాంచనమేఖలా•కాంతులతోడఁ గా
శేయచేలద్యుతు • లైలిమి సేయ

లక్ష్మీసమాయుక్త♦లలితవక్షంబున
వై జయంతీప్రభ ♦ ల్వాన్నెనూప
హాటకరత్నకి♦రీటకోటిప్రభ
ల్బాలార్కరుచులతో ♦ మేలమాడ
తే॥ గీ॥ లలితనీలాభ్రరుచిఁ గుంత♦లములు దనరఁ
బ్రవిమలాత్మీయ దేహజ♦ప్రభ సరోజ
భవభవామరముఖ్యుల♦ప్రభలు మాప
నఖిలలోకైకగురుఁడు నా♦రాయణుండు. చ. 163

64 చ॥ సలలితశంఖచక్రజల♦జాతగదాశరచాపఖడ్గ ని
ర్మలరుచుల న్సువర్ణరుచి♦మన్మణికంకణముద్రికా ప్రభా
వలులను దేజరిల్లు భుజ♦వర్గ మనర్గళకాంతియుక్తమై
విలసితకర్ణికారపృథి♦వీరుహము న్స్ఫురణించు బిట్టుగన్. చ. 164

65 క॥ సరసోదారసమంచిత
దరహాసవిలోకనములు ♦ దగ లోకముల
న్బరితోషము నొందింపుచుఁ
బరమోత్సవ మొప్ప విశ్వ♦బంధుం డగుచున్. చ. 165

66 చ॥ మరియును రాజహంసరుచి♦మద్భ్రమణీకృత తాలవృంత [1]చా
మరములు వీవఁగా దివిజ♦మానిను లచ్ఛసుధామరీచి[2]వి
స్ఫురణసితాతపత్రరుచి♦పుంజము దిక్కులఁ బిక్కటిల్లఁగాఁ
గరివరదుండు వచ్చె సుభ♦గస్తుతివర్ణసుపర్ణయానుఁడై. చ. 166

67 చ॥ కమలదళాక్ష! నీవలనఁ ♦గల్గిన ధర్మము దావకావతా
రముల సురక్షితం బగుఁ ది♦రం బగు నీశ్వర నిర్వికారత
త్త్వమునఁ దనర్చు ని న్నరయఁ ♦ దత్ఫలరూపము తత్ప్రధాన గో
ప్యమునని పల్కుచుందురు కృ♦పామయలోచన! పాపమోచనా! తృ. 572

---

1 చామర లిరువంకలన్. 2 విస్ఫురిత.

68 మ॥ సతతజ్ఞానరమాయశోబలమహైశ్వర్యాదియుక్తుఁ జగ
త్పతి యజ్ఞేశు ననంతు నచ్యుతు దళత్పంకేరుహాక్షుఁ శ్రియః
పతి నాద్యంతవికారదూరుఁ గరుణాపాథోనిధిం సాత్వతాం
పతి వర్ధిష్ణు సహిష్ణు విష్ణు గుణవిభ్రాజిష్ణు రోచిష్ణునిన్. ద్వి. 238

69 సీ॥ అస్మత్ప్రియస్వామి నచ్యుతుఁ బరు సత్త్వ
గుణగరిష్ఠుని రజోగుణవిహీను
సురుచిరద్వారకాపురనమాశ్రియు ననా
శ్రియు నీలనీరదశ్యామవర్ణు
దరదరవిందసుందరపత్రనేత్రు ల
క్ష్మీస్థయుతుఁ బీతకౌశేయవాసు
విలసితవామాంకవిన్యస్తదక్షిణ
చరణారవిందు శశ్వత్ప్రకాశు
తే॥ గీ॥ ఘనచతుర్బాహు సుందరాకారు ధీరుఁ
జెన్నుగలభేతరావిపై వెన్ను మోపి
యున్న వీరాసనాసీను నన్నుఁ గన్న
తండ్రి నానందపరిపూర్ణు దనుజహరుని. తృ. 146

70 చ॥ దరహాసామృతపూరితాస్య నిజభక్తత్రాణపారాయణుం
దరుణాంభోరుహపత్రలోచనుని ¹బీతాచ్ఛాదనున్ లోకసుం
దరు మంజీరకిరీటకుండలముఖోద్యద్భూషు యోగీశ్వరే
శ్వరులక్ష్మీశ్రయుతవక్షుఁ జిన్మయుదయాసాంద్రున్ జతుర్బాహునిన్. ద్వి. 239

71 క॥ అనుపమగుణసంపూర్ణుని
ననఘుని సుస్థితుని గతుని నాసీను శయా
నుని భక్తహృద్గుహాశయ
నుని సర్వేశ్వరు ననంతు నుతసచ్చరితున్. తృ. 926

72 క॥ అస్తోకచరితు నమితస
మస్తసుధాహారు వేదమస్తకతలవి

---

(1) భీతావాసుఁ త్రైలోక్య సుందరు

న్యస్తపదాంబుజయుగళు న
పాస్తాశ్రితనిఖిలపాపుఁ ♦ బరము ననంతున్. ద. 628

73 సీ॥ నవపద్మలోచను ♦ భవబంధమోచను
భరితశుభాకారు ♦ దురితదూరుఁ
గంకణకేయూరుఁ ♦ గాంచనమంజీరు
వివిధశోభితభూషు ♦ విగతదోషుఁ
బన్నగాంతకవాహు ♦ భక్తమహోత్సాహు
నతచంద్రజూటు ను♦న్నతకిరీటు
హరినీలనిభకాయు ♦ వరపీతకౌశేయుఁ
గటిసూత్రధారు జ♦గద్విహారు
తే॥ గీ॥ హారవనమాలికామహి♦తోరువక్షు
శంఖచక్రగదాపద్మ♦శార్ఙ్గహస్తు
లలితశ్రీవత్సశోభిత♦లక్షణాంగు
సుభగచారిత్రు దేవకీ♦సుతునిఁ గాంచి. ద. 747

74 సీ॥ కంపాలతికతోడి♦జలదంబుకై వడి
మెఱుఁగుటొల్లియతోడి♦మేనివానిఁ
గమనీయమృదులాన్న♦కబళవేత్రవిషాణ
వేణుచిహ్నంబుల ♦ వెలయువాని
గుంజావినిర్మిత♦కుండలంబులవాని
శిఖిపింఛవేష్టిత♦శిరమువాని
వనపుష్పమాలికా♦వ్రాతకంఠమువాని
నళినకోమలచర♦ణములవానిఁ
ఆ॥ వె॥ గరుణ గడలుకొనిన ♦ కడకంటివాని గో
పాలబాలుభంగిఁ ♦ బరఁగువాని
నగుమొగంబువాని ♦ ననుఁ గన్నతండ్రిని
నిను భజింతు మ్రొక్కి ♦ నీరజాక్ష! ద. 549

75 ఉ॥ హరికి నందగోకులవి♦హారికిఁ జక్రసమీరదైత్యసం
హరికి భక్తదుఃఖపరి♦హారికి గోపనితంబినీమనో

హారికి దుష్టసంపదప•హారికి ఘోషకుటీపయోఘృతా
హారికి బాలకగ్రహము•హాసురదుర్వనితాపహారికిన్.

ప్ర. 29

76 ఉ॥ శీలికి నీతిశాలికి వ•శీకృతశూలికి బాణహస్తని
ర్మూలికి ఘోరసీరదవి•ముక్తశిలాహతగోపగోపికా
పాలికి వర్ణధర్మపరి•పాలికి నర్జునభూజయుగ్మసం
చాలికి మాలికిన్ విపుల•చక్రనిరుద్ధమరీచిమాలికిన్.

ప్ర. 30

77 ఉ॥ క్షుంతకుఁ గాళియోరగవి•శాలఫణావళినర్తనక్రియా
రంతకు నుల్లసన్మగధ•రాజ చతుర్విధఘోరవాహినీ
హంతకు నింద్రనందనని•యంతకు సర్వచరాచరావళీ
మంతకు నిర్జితేంద్రియస•మంచితభక్తజనానుగంతకున్.

ప్ర. 31

78 ఉ॥ న్యాయికి భూసురేంద్రమృత•నందనదాయికి రుక్మిణీమన
స్థాయికి భూతసమ్మదవి•ధాయికి సాధుజనానురాగసం
ధాయికిఁ బీతవస్త్రపరి•ధాయికిఁ బద్మభవాండభాండని
ర్మాయికి గోపికానివహ•మందిరయాయికి శేషశాయికిన్.

ప్ర. 32

79 క॥ ముందఱ నిల్చి ముకుంద స
నందనమునివినుత నంద•నందన పరమా
నంద శరదిందుచందన
కుందయశస్సాంద్ర కృష్ణ • గోవింద హరీ! ద. 1296

80 మ॥ జ్వరితార్తుం డగు రోగి కౌషధ మభీ•ష్టంబైనచందంబునన్
ధరలో నాతపతప్తదేహి గడు శీ•తంబైనతోయంబునుం
గరిమం గోరినరీతి నెంతయు నహం•కారాహిదష్టుండనై
పరఁగు న్నాకును నీవచోమృతము ద•ప్పన్ మందు వేఱున్నదే?

పం. 155

81 ఉ॥ కన్నులులేనివాఁడు మఱి • కాననివానికిఁ ద్రోవఁ జూపఁగాఁ
జన్న తెఱంగు మూఢున క•నన్మతిఁ దా గురుఁ డౌట సూర్యుఁడే

కన్నులుగాఁగ భూతములఁ♦ గాంచుచునుండురమేశ! మాకు ను
ద్యన్నయమూర్తివై గురుఁడ♦వై యల సద్గతిజాడఁ జూపవే!
అ. 729

82 క॥ మదిఁ దలపోయఁగ జలబు
ద్బుదములుఁ ధరఁ బుట్టి పోవు • పోలికగల యీ
త్రిదశాది దేహములలో
వదలక వర్తించు నాత్మ♦వర్గము లోలిన్. ద. 1224

83 ఆ॥ వె॥ ప్రళయవేళ నీవు • భరియింతు వంతకుఁ
గారణంబ వగుటఁ ♦ గమలనాభ!
భక్తపారిజాత! ♦ భవభూరితిమిరది
నేశ! దుష్టదైత్య♦నాశ! కృష్ణ! ద. 1225

84 క॥ తరణంబులు భవజలధికి
హరణంబులు దురితలతల ♦ కాగమముల కా
భరణంబు లార్తజనులకు
శరణంబులు [1]నీపదాబ్జ♦సేవానిరతుల్. ఏ. 15

85 క॥ నీపేరు వినిన నొడివినఁ
బాపంబులు [2]మాసిపోవుఁ ♦ బద్మాక్ష జగ
ద్దీపక నీదర్శనమున
నేపారవె భక్తజనుల • కిహపరసుఖముల్. ద. 662

86 క॥ తారాతుషారశీకర
భూరజముల్నైన లెక్క • బుధు లిడుదురు భూ
భారావతీర్ణకరుఁ డగు
నీరమ్యగుణంబు లెన్న♦నేర రగణ్యా! ద. 555

87 క॥ వాసవవందితభవ కమ
లాసన దివ్యప్రభావ•భావిని యెపుడున్
నీసమధికచారిత్రక
థాసురుచిరగాన మవిత♦థంబై చెల్లున్. ద. 258

---

[1] నీదు దివ్యచరణంబులిలన్ [2] దూరి

88 క॥ జిష్ణు నిశాటవిపాటన
వృష్ణికులాంభోజసూర్య • విప్రామరగో
వైష్ణవసాగరహిమకర
కృష్ణా ! పాషండధర్మ•గృహదావాగ్నీ ! ద. 580
89 ఉ॥ నీవిభవంబు లీజగము • నిండుట యుండుట నాశమొందుట
ల్నీవిమలాంశజాలములు • నెమ్మి జగంబు సృజించువార లో
దేవ! భవద్గుణాంబుధుల•తీరముఁ గానక యాశ బుద్ధితో
వావిరిఁ జర్చసేయుదురు • వారికి వారలు దొడ్డవారలై. మ. 473
90 మ॥ నినుఁ జింతింపుచుఁ బాడుచున్ బొగడుచు • నీదివ్యచారిత్రము
ల్వినుచుం జూతురుగాక లోకు లితరా•న్వేషంబులం జూతురే
ఘనదుర్జన్మపరంపరా [1]హరణద•క్షంబై మహాయోగివా
గ్వినుతం బైన భవత్పదాబ్జయుగము • న్విశ్వేశ! విశ్వంభరా! ప్ర. 107
91 క॥ నీనామస్తుతి శ్వపచుం
డైనను జిహ్వాగ్రమందు • ననుసంధింప
న్వానికి సరి భూసురుఁడు
న్గానేరఁడు చిత్ర మది జ•గంబుల నరయన్. తృ. 1037
92 క॥ పురుషోత్తమ నీపదసర
సిరుహాము మననామృతాభి•షేకస్ఫురణ
న్గర మొప్పిన నాచిత్త మి
తరవస్తువులందు వాంఛఁ • దగులునె యెందున్. తృ. 152
93 క॥ పురుషుం డాఢ్యుఁడు ప్రకృతికిఁ
బరుఁ డవ్యయుఁ డఖిలభూత•బహిరంతర్భా
సురుఁడును లోకనియంతుఁడు
బరమేశ్వరుఁ డైన నీకుఁ • బ్రణతు లగు హరీ! ప్ర. 186
94 క॥ నీపంపు సేయకుండఁగ
నా పద్మభవాదిసురుల • కైనను వశమే

1 దళన

శ్రీపతి! శరణాగతులం
జేపట్టి నిరోధ ముడుఁగఁ ♦ జేయుము కృష్ణా! ద. 651

95 ఆ॥ వె॥ కృష్ణ వాసుదేవ ♦ కేశవ పరమాత్మ
యప్రమేయ వరద ♦ హరి ముకుంద
నిన్నుఁ జూడఁగంటి ♦ నీకృపఁ గనుఁగొంటి
నఖిలసౌఖ్యపదవు ♦ లందఁగంటి. ద. 477

96 క॥ హవరూపివి హవనేతవు
హవభోక్తవు నిఖిలహవఫ♦లాధారుఁడవున్
హవరక్షకుండ వగు నీ
కవితతమునగ నుతు లొనర్తు ♦ మయ్యా ముకుందా! తృ. 427

97 సీ॥ ఇందీవరశ్యాము ♦ వందితసుత్రాముఁ
గరుణాలవాలు భా♦సురకపోలుఁ
గౌస్తుభాలంకారుఁ ♦ గామితమందారు
సురుచిరలావణ్యు ♦ సురశరణ్యు
హర్యక్షనిభమధ్యు ♦ నఖిలలోకారాధ్యు
ఘనచక్రహస్తు జ♦గత్ప్రశస్తు
ఖగకులాధిపయానుఁ ♦ గౌశేయపరిధానుఁ
బన్నగశయను న♦బ్జాతనయను
తే॥ గీ॥ మకరకుండలసద్భూషు ♦ మంజుభాషు
నిరుపమాకారు దుగ్ధసా♦గరవిహారు
భూరిగుణసాంద్రు యదుకులాం♦భోధిచంద్రు
విష్ణు రోచిష్ణు జిష్ణు స♦హిష్ణుఁ గృష్ణు. ద. 979

98 సీ॥ ఆశ్రితసత్ప్రసా♦దాభిముఖుండును
[1]స్నిగ్ధప్రసన్నాన♦నేక్షణుండు
సురుచిరవాసుండు ♦ సుభ్రూయుగుండును
సుకపోలతలుఁడును ♦ సుందరుండు
హరినీలసంశోభి♦తాంగుండుఁ దరుణుండు
నరుణావలోకనో♦ష్ఠాధరుండుఁ

1 నిద్ధ

గరుణాసముద్రుండుఁ • బురుషార్థనిధియును
బ్రిణతాశ్రియుండు శో•భనకరుండు
తే॥ గీ॥ లలిత శ్రీవత్సలక్షణ•లక్షితుండు
సర్వలోకశరణ్యుండు • సర్వసాక్షి
పురుషలక్షణయుక్తుండుఁ • బుణ్యశాలి
యసితమేఘనిభశ్యాముఁ • డవ్యయుండు. చ. 250

99 సీ॥ సజలనీలాంబుద•శ్యామాయమానాంగు
నాశ్రితావనముది•తాంతరంగు
సనకాదియోగిహృ•ద్వనజమరాళేంద్రు
ముఖపద్మరుచిజిత•పూర్ణచంద్రు
గమనీయనిఖిలజ•గద్గీతచారిత్రుఁ
బ్రితూర్యమసంఫుల్ల•పద్మనేత్రు
నిందిరాహృదయార•విందారుణోల్లాసు
శ్రీకరపీతకౌ•శేయవాసు
తే॥ గీ॥ హారకుండలకటకకే•యూరమకుట
కంకణాంగదమణిముద్రి•కావినూత్న
రత్ననూపురకాంచీవి•రాజమాను
భవమహార్ణవశోషు సద్•భక్తపోషు. ద. 1312

100 సీ॥ ఘనమేరుశృంగసం•గత[1] మైన మేఘంబు
నెఱి గరుడస్కంధ•నివసితుండు
గమనీయనిజదేహ•కాంతివిపాటితా
ఖిలాఖిలాశాంత•రాళతముఁడు
సుమహితాష్టాయుధ•సుమనోమునీశ్వర
సేవకపరిజన•సేవితుండు
మండితకాంచన•కుండలరుచిరోప
లాలితవదనక•పోలతలుఁడు
తే॥ గీ॥ చారునవరత్నదివ్యకో•టీరధరుఁడు
గౌస్తుభప్రవిలంబమం•గళగళుండు

1 సంగతలీల

లలితపీతాంబరప్రభా•లంకృతుండు
హారకేయూరవలయమం•జీరయుతుఁడు. చ. 902

101 క॥ లలితాయతాష్టభుజమం
డలమధ్యస్ఫురితరుచివి•డంబితలక్ష్మీ
లలనాకాంతిస్పర్ధా
కలితలసద్వైజయంతి•కాశోభితుఁడున్. చ. 903

102 సీ॥ హారకకిరీటకే•యూరకంకణఘన
భూషితుం డాశ్రిత•పోషణుండు
లాలితకాంచీకం•లాపశోభితకటి
మండలుం డంచిత•కుండలుండు
మహనీయ కౌస్తుభ•మణిఘృణిచారుగ్రీ
వేయకుం డానంద•దాయకుండు
సలలితఘనశంఖ•చక్రగదాపద్మ
హస్తుఁడు భువనప్ర•శస్తుఁ డజుఁడు
తే॥ గీ॥ గ్రమసౌరభవనమాలి•కాధరుండు
హతవిమోహుండు సవ్యపీ•తాంబరుండు
లలితకాంచననూపురా•లంకృతుండు
నిరతిశయసద్గుణుఁడు దర్శ•నీయతముఁడు. చ. 252

103 క॥ సరసమనోనయనసము
త్కరుఁడు సుహృత్పద్మకర్ణి•కానివసితవి
స్ఫురదురునఖమణిశోభిత
చరణసరోజాతుఁ డతుల•శాంతుఁడు ఘనుఁడున్. చ. 253

104 సీ॥ అవ్యయు ననఘు న•నంతశక్తినిఁ బరు
లైనట్టి బ్రహ్మరు•ద్రామరేంద్ర
వరుల కీశ్వరుఁ డైన•వాని సర్వాత్మకు
జ్ఞానస్వరూపు స•మానరహితు
వరదుని జగదుద్భ•వస్థితిసంహార
హేతుభూతిని హృషీ•కేశు నభవు

బ్రహ్మచిహ్నంబులై ♦ పరఁగు సుజ్ఞానశ
క్త్యాదుల నొప్పు బ్ర♦హ్మంబు నీవు
ఆ॥ వె॥ నజు షడూర్మిరహితు ♦ నిజయోగమాయావి
మోహితాఖిలాత్మ♦ముఖ్యచరితు
మహితతేజు నాది♦మధ్యాంతహీనునిఁ
జిన్మయాత్ము నిను భ♦జింతుఁ గృష్ణ! ద 429

105 సీ॥ దరదరవింద సుం♦దరపత్రరుచిరాక్షు
సలలిత శ్రీవత్స♦కలితవక్షు
నీలనీరదనీల♦నీలోత్పలశ్యాము
నలికులాకులమాలి♦కాభిరాముఁ
[1]కౌస్తుభకలితము♦క్తాహారయుతకంఠు
యోగిమానసపంజ♦జోపకంఠు
సతతప్రసన్నస♦స్మితవదనాంభోజు
దినకరకోటిసం♦దీపతేజు
తే॥ గీ॥ సలలితానర్ఘ్య రత్నకుం♦డలకిరీట
హారకంకణ కటక కే♦యూర ముద్రి
కాతులాకోటిభూషు భ♦క్తపరిపోషుఁ
గింకిణీయుత మేఖలా♦కీర్ణజఘను. తృ. 922

106 సీ॥. కంజాతకింజల్క♦[2]పుంజరంజితపీత
కౌశేయవాసు జ♦గన్నివాసు
శత్రుభీకరచక్ర♦శంఖగదాపద్మ
విహిత చతుర్బాహు ♦ విగతమోహు
నతభక్తలోక మ♦నోనేత్రవర్ధిష్ణు
లాలితసద్గుణా♦లంకరిష్ణు
వరకుమారకవయః♦పరిపాకు సుశ్లోకు
సుందరాకారు య♦శోవిహారు

---

(1) కౌస్తుభరుచిర (2) పుంజవద్రుచి

తే॥ గీ॥ సకలలోకనమస్కృత♦చరణకమలు
భక్తలోకపరిగ్రహ♦ప్రకటశీలు
దర్శనీయమనోరథ♦దాయిఁ గీర్త
నీయతీర్థయశో మహ♦నీయమూర్తి. తృ. 924

107 మ॥ నిను బ్రహ్మాదులెఱుంగలేరు జడతా♦నిష్ఠుండ లోకత్రయా
వనదుర్మానగరిష్ఠుఁడ న్విపులదు♦ర్వైదుష్యభూయిష్ఠుఁడ
న్వినయత్యాగ[1]కనిష్ఠుడ న్గుజనగ♦ర్విశ్రేష్ఠుఁడ న్దేవ నీ
ఘనలీలావిభవంబు పెంపుఁ దెలియం♦గా నెవ్వఁడ న్సర్వగా!
ద. 945

108 శా॥ శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! ♦ శృంగారరత్నాకరా!
లోకద్రోహినరేంద్రవంశదహనా! ♦ లోకేశ్వరా! దేవతా
నీకబ్రాహ్మణగోగణార్తిహరణా! ♦ నిర్వాణసంధాయకా!
నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలత ♦ ల్నిత్యానుకంపానిధీ!
ప్ర. 200

109 సీ॥ తరణిసుధాకర♦[2]కిరణోదరాంచిత
నరసీరుహోత్పల♦సద్విలాసుఁ
కంకణనూపుర♦గ్రైవేయముద్రికా
హారకుండలకిరీ♦టాభిరాముఁ
కమనీయ సాగర ♦ కన్యకాకౌస్తుభ
మణిభూషణోద్భాస♦మానవక్షు
సలలితదరహాస♦చంద్రికా ధవళిత
చారుదర్పణవిరా♦జత్కపోలు
తే॥ గీ॥ శంఖచక్రగదాపద్మ♦చారుహస్తు
నళికులాలకరుచిభాస్వ♦దళికఫలకుఁ
బీతకౌశేయవాసుఁ గృ♦పాతరంగి
తస్మితేక్షణుఁ బంకజో♦దరుని హరుని. తృ. 751

110 వ॥ మఱియు శబ్దబ్రహ్మశరీరవంతుండు, సదాత్మకుండు, జ్ఞానైకవేద్యుండు నైనతేయాంసవిన్యస్తచరణారవిందుండు నైన గోవిం

1 గరిష్ఠుఁడన్. 2 కిరణ సమంచిత

దునిం గనుంగొని సంజాతహర్షలహరిఁ బరవశుండు లబ్ధమనోరథుండు
నగుచు సాష్టాంగదండప్రణామంబు లాచరించి తదనంతరంబ.
తృ. 752

111 క॥ ముకుళితకరకమ లుండై
యకుటిల సద్భక్తిఁ బరవ♦శాత్మకుఁ డగుచు
న్వికచాంభోరుహలోచను
నకు నిట్లనియెం దదాన♦నముఁ గనుఁగొనుచున్. తృ. 753

112శా॥ దేవా! నీచరణప్రసాదకణల♦బ్ధింగాక లేకున్న నేం
డే వెంటన్ జను నీమహామహిమ నూ♦హింపంగ నెవ్వానికిన్
నీవారై చనువారిలో నొకఁడనై ♦ ని న్గొల్చు భాగ్యంబు నా
కీవే యిప్పటిజన్మమందయిన నొం♦డెం దైనను న్నీశ్వరా!
ద. 570

11‹ చ॥ కమలదళాక్ష దుఃఖలయ♦కారణమై తగు తావకీనరూ
పము ననివార్య దుర్భర వి♦పద్దశ దుఃఖము నొందు మాకు నీ
సుమహితసత్కృపాగరిమఁ ♦ జూపుటకంటె ననుగ్రహంబు లో
కమునఁ దలంప నొండొకటి ♦ గల్గునె భక్తఫలప్రదాయకా.
చ. 922

114 ఉ॥ ఏవిభు పాదపద్మరతు ♦ లెన్నఁడు నెవ్వరుఁ బొందలేని పెం
దోప్రవఁ జరింతు రట్టి బుధ♦తోషక నీ వరుదెంచుట న్బ్రమో
దామృతమయ్యెఁ జిత్తము కృ♦తార్థతనొందె మనోరథంబు నీ
సేవఁ బవిత్రభావమును ♦ జెందె శరీరము నేఁడు మాధవా!
ద, 968

115 క॥ నీనగవులు నీచూడ్కులు
నీనానావిహరణములు ♦ నీ ధ్యానంబు
ల్నీనర్మాలాపంబులు
మానసమున నాఁటి నేఁడు ♦ మగుడవు కృష్ణా. ద. 1048

116 ఆ॥ వె॥ అంధకారవైరి ♦ యుపరాద్రి కవ్వలఁ
జనిన నంధమైన ♦ జగముభంగి

నిన్నుఁ గానకున్న ♦ నీరజలోచన
యంధతమసమతుల ♦ మగుదుమయ్య. ప్ర· 254

117 ఆ॥వె॥ చరణసేవకులకు ♦ సంసారభయమును
బాపి శ్రీకరంబు ♦ పట్టు గలిగి
కామదాయి యైన ♦ కరసరోజంబు మా
మస్తకముల నునిచి ♦ మనుపు మీశ! ద· 1043

118 చ॥ నగుమొగము న్సుమధ్యమును ♦ నల్లనిదేహము లచ్చి కాటప
ట్టగు నురము న్మహాభుజము ♦ లంచితకుండలకర్ణము ల్మదే
భగతియు నీలవేణియుఁ గృ♦పారసదృష్టియుఁ గల్గు వెన్నుఁడి
మ్ముగఁ బొడసూపుఁ గాత కను♦మూసినయప్పుడు విచ్చినప్పుడున్.
న· 734

119 శా॥ శ్రీవత్సాంకితకౌస్తుభస్ఫురితల♦క్ష్మీచారువక్షస్స్థల
శ్రీవిభ్రాజితు నీలవర్ణు శుభరా♦జీవాక్షుఁ గంజాతభూ
దేవేంద్రాదిసమస్తదేవమకుటో♦ద్దీప్తోరురత్నప్రభా
వ్యావిద్ధాంఘ్రిసరోజు నచ్యుతుఁ గృపా♦వాసుం బ్రశంసించెదన్.
ష. 1

120 తే॥ గీ॥ అరయ బ్రహ్మాదు లెవ్వని ♦ ననునయించి
భక్తియుక్తుల మనమునఁ ♦ బ్రస్తుతింతు
రవని యెవ్వనితలమీఁద ♦ నావగింజఁ
బోలు నావేయుశిరముల♦ భోగిఁ గొల్తు. ష. 477

121 సీ॥ ఓలిమై నెవ్వని♦లీలావినోదము
ల్జన్మసంరక్షణా♦క్షయములకును
హేతువు లగుచుండు ♦ నెవ్వనిచూపుల
జనియించె సత్త్వర♦జస్తమంబు
లెవ్వనిరూపంబు ♦ లేకమై బహువిధం
బులను జగత్తులఁ ♦ బ్రోచుచుండు
నెవ్వనినామంబు ♦ లెఱుఁగక తలఁచిన
యంతన దురితంబు ♦ లడఁగుచుండు

తే॥ గీ॥ నట్టిసంకర్షణాఖ్యుండు ♦ నవ్యయుండు
నైన శేషుని వినుతిసే♦యంగఁ దరమె
తలఁప నెవ్వఁడు వాఙ్మనం♦బులకు నింక
మూఁడులోకంబులందును ♦ భూతతతికి. పం. 124

122 ఆ॥ వె॥ మఱియుఁ బెక్కుగతుల ♦ మాబోఁటివారలఁ
బ్రోవఁదలఁచి శేష♦మూర్తి సాత్త్వి
కస్వభావ మొందెఁ ♦ గడఁకతో నట్టి శే
షునకు మ్రొక్కుచుందు ♦ ననుదినంబు. పం. 125

123 మ॥ ప్రళయాంభోనిధిలోన మేన్మఱచి ని♦ద్రం జెందు వాణీశువో
ముల వేదంబులు గొన్న దైత్యుని మృతిం♦బొందించి సత్యవ్రతుం
డలరన్ బ్రహ్మముమాటఁ దానిలిపె స♦ర్వాధారుఁడై మీనమై
జలధిం గ్రుంకుచుఁ దేలుచున్నలఁగు రా♦జన్మూర్తికిన్ మ్రొక్కెదన్.
అ. 745

124 సీ॥ దేవ జితం జితం ♦ తే పరమేశ్వర
జితయజ్ఞభావన ♦ శ్రుతిశరీర
కారణసూకరా♦కారుండ వగు నీకు
నతిభక్తి మ్రొక్కెద♦మయ్య వరద
భవదీయరోమకూ♦పములందు లీనంబు
లయ్యెండు నంబుధు♦ లట్టి యధ్వ
రాత్మకమై తన♦రారునీరూపంబు
గానంగరాదు దు♦ష్కర్మపరుల
తే॥ గీ॥ కట్టి నీకుఁ బ్రణామంబు ♦ లాచరింతు
మఖిలజగదేకకీర్తి ద♦యానువర్తి
భవ్యచారిత్ర పంకజ♦పత్రనేత్ర
చిరశుభాకార యిందిరా♦చిత్తచోర! తృ. 423

125 మ॥ చతురామ్నాయవపుర్విశేషధర చం♦చత్సూకరాకార నీ
సితదంష్ట్రాగ్రవిలగ్నమైన ధర రా♦జిల్లెన్ స్థలాద్రీంద్రరా

జతశృంగోపరిలగ్న మేఘముగతిం ♦ జాలం దగె న్సజ్జనాం
చితహృత్పల్వల[1]లోలభూరమణ ల♦క్ష్మీనాథ దేవోత్తమా!
తృ. 431

126 చ॥ సలలితవేదశాస్త్రమయ♦సౌకరమూర్తిఁ దనర్చుచుఁ రసా
తలముననుండి వెల్వడు సు♦దారత మేను విదిర్పఁ దత్సటో
[2]చ్చలితము లైన బిందువుల ♦ సాధుతపోజనసత్యలోకవా
సుల మగుమేము దోఁగి పరి♦శుద్ధివహించితిమయ్య మాధవా!
తృ. 436

127 క॥ ఘోటకవదనుఁడవై మధు
కైటభులం దుంచి నిగమ♦గణములనెల్లం
బాటించి యజున కిచ్చిన
కూటస్థుఁడ వీశ్వరుఁడవు ♦ కోవిదవంద్యా! స. 361

128 క॥ రక్షింపుము రక్షింపు ము
పేక్షింపక యమితనిఖిల♦బృందారకఘో
రక్షణదాచరవిమనిట
లాక్ష భయాతురుల మమ్ము ♦ నరయు మనంతా! ద. 592

129 క॥ నీమహిమ లెఱిఁగి పొగడఁగ
నే మెంతటివార మఖిల♦నేతవు ద్విజగ
క్షేమంకరుఁడవు సుమతివి
తామసులము మమ్ముఁ గావఁ♦దగు హలపాణీ! ద. 590

130 క॥ ఏ మిపుడు సేయు సంస్తుతి
నీమహిమ నెఱింగి కాదు ♦ నిరతము పెద్దల్
దా మెఱిఁగి యుపదేశించిరొ
యామతమునఁ బ్రస్తుతింతు ♦ మయ్య మహాత్మా!
పం. 46

131 మ॥ మనుపద్మాసనధూర్జటిప్రముఖధీ♦మంతుల్ తపోజ్ఞానస
త్త్వనిరూఢిం దగువారు నీమహిమముం ♦ వర్ణింపఁ బారం బెఱుం

(1) కోలక్రోడ (2) చ్చలితశివాంబుబిందువులు సాధుజనస్తప

గనివా రయ్యును నోపి నంతవినుతుల్ ♦ గావింతు రట్లాట నే
మును నిన్నర్థినుతింతుమీశ వరదా♦ [1]బుద్ధ్యాదిమూలంబుగన్.
చ. 935

132 ఉ॥ వారిజనాభ భక్తజన♦వత్సల దుష్టమదాసురేంద్రసం
హార సరోరుహాసనపు♦రారిముఖామరవంద్యపాదపం
కేరుహ సర్వలోకపరి♦కీర్తితదివ్యమహాప్రభావ సం
సారవిదూర నందతను♦జాత రమాహృదయేశ మాధవా!
ద. 647

133 ఉ॥ నీవు యశోదబిడ్డఁడవె ♦ నీరజనేత్ర సమస్తజంతుచే
తోవిదితాత్మ వీశుఁడవు ♦ తొల్లి విరించి దలంచి లోకర
క్షావిధ మాచరింపుమని ♦ సన్నుతిచేయఁగ [2]సత్కులంబున
న్భూ[3]వలయంబుఁగావ నిటు ♦ పుట్టితిగాదె మనోహరాకృతిన్!
ద. 1042

134 క॥ కంజవిలోచన దానవ
భంజన యోగీంద్ర విమల♦భావన సద్బో
ధాంజనదృష్టినిదర్శన
రంజితశుభమూర్తి కృష్ణ ♦ [4]రామావరజా. ద. 643

135 తే॥ గీ॥ అవ్యయుండ వనంతుండ ♦ వచ్యుతుండ
వాదిమధ్యాంతశూన్యుండ ♦ వఖిలధృతివి
నిఖిలమందెల్ల వర్తింతు ♦ నీవు దగిలి
నిఖిల మెల్లను నీయంద ♦ నెగడుఁ గృష్ణ! ద. 442

136 క॥ నారాయణ దామోదర
నీరజదళనేత్ర చక్రి ♦ నిఖిలేశ గదా
ధారణ గోవింద నమ
స్కారము యదుపుత్ర నిత్య♦కల్యాణ హరీ! ద. 49

137 తే॥ గీ॥ కృష్ణ పరమాత్మ యదుకుల♦క్షీరవార్ధి
పూర్ణచంద్రమ దేవకీ♦పుత్ర సుజన

---

(1) బుద్ధ్యానుసారంబుగన్ (2) మత్కులంబు (3) వలయంబును గరుణ
(4) రాజీవాక్ష

వినుత నారాయణాచ్యుత ♦ వేదవేద్య
భక్తజనపోష పరితోష ♦ పరమపురుష ! ద. 1187

138 సీ॥ కేశవ సంతత♦క్లేశనాశనుఁడవు
[1]గురు సన్మనోవాగ♦గోచరుఁడవు
సిద్ధమనోరథ♦హేతు [2]భూత్యోదార
గుణనాముఁడవు సత్త్వ♦గుణుఁడ వఖిల
విశ్వోద్భవస్థితి♦విలయార్థధృత[3]నిత్య
విపులమాయాగుణ♦విగ్రహుఁడవు
మహితాఖిలేంద్రియ♦మార్గ నిరధిగత
మార్గుండ వతిశాంత♦మానసుఁడవు
తే॥ గీ॥ తవిలి సంసార[4]హారి చే ♦ తస్కుఁడవును
దేవదేవుఁడవును వాసు♦దేవుఁడవును
సర్వభూతనివాసివి ♦ సర్వసాక్షి
వైన నీకు నమస్కార♦మయ్య కృష్ణ ! చ. 918

139 ఆ॥ వె॥ వరద పద్మనాభ ♦ హరి కృష్ణ గోవింద
దాసదుఃఖనాశ ♦ వాసుదేవ
యవ్యయాప్రమేయ ♦ యనిశంబుఁ గావింతు
మిందిరేశ నీకు ♦ వందనములు. ద. 749

140 క॥ శ్రీపతియు యజ్ఞపతియుఁ బ్ర
జాపతియున్ బుద్ధిపతియు ♦ జగదధిపతియున్
భూపతియు యాదవశ్రే
ణీపతియుం గతియునైన ♦ నిపుణు భజింతున్. ద్వి. 65

141 చ॥ వనరుహపత్రలోచన భ♦వత్సఖుఁడైన సుధాంశుమాళితో
డి నిమిషమాత్రసంగతి గ♦డింది వ్రణంబును దుశ్చికిత్స్యమా

(1) కోరి మనోవాద (2) భూతాధార (3) ధారిత (4) హారణచేత
స్కుఁడవును.

ననుభవకష్టరోగమున • కర్మిలివై దృ్యఁడవైన నిన్ను నే
మనయముఁ జూడఁగంటిమి కృ•తార్థులమైతగమంటిమీశ్వరా!
చ. 933

145 క॥ పరిపూర్ణుఁడవై యుండియు
మఱువక మాపూజలెల్ల • మన్నింతువు నీ
చరణారవింద సేవయు
ధరఁ బెద్దలు వినిచినటులఁ • దగఁ జేసెదమా. పం. 45

143 ఆ॥ వె॥ ఇపుడు మేము నీకు • నిష్టంబు లగు పూజ
లాచరింపకున్న • నైన నధిక
మైన నీకృపాక•టాక్షవీక్షణములఁ
జక్కఁ జూచి తగఁ బ్రీ•సన్నుఁడగుచు. పం. 49

144 క॥ కోరినవారలకోర్కులు
నేరుపుతో నిచ్చి మనుప • నీకెయ్యె నన్యు
లెన్నరరు కరుణాకర నేఁ
గోరెద నీ విచ్చెదేనిఁ • గోరిక లభవా! స. 89

145 క॥ [1]నాకును సఖ్యము పుణ్య
శ్లోకులతోఁగాసి త త్త్వ•శూన్యులు సంసా
రైక[2]వి మోహులతోడం
గాకుండ నొనర్పుమయ్య • కంజదళాక్షా! ష. 402

146 క॥ నీపాదకమలసేవయు
నీపాదార్చకులతోడి•నెయ్యమును నితాం
తాపారభూతదయయును
దాపసమందార నాకు • దయసేయఁగదే. ద. 1273

147 శా॥ నీపద్యావళులాలకించు చెవుల • న్నిన్నాడు వాక్యంబుల
న్నీపేరం బనిసేయు హస్తయుగము • న్నీమూర్తిపైఁ జూపుల
న్నీపాదంబులపొంత మ్రొక్కు శిరము • న్నీ సేవపైఁ జిత్తము
న్నీపై బుద్ధులు మాకు నిమ్ము కరుణ • న్నీరేజపత్రేక్షణా !
ద. 409

(1) మాకీ (2)సమూహుల

148 క॥ బాలిశుల మగుచు మిక్కిలి
మే లెఱుఁగని మమ్ము నీదు ♦ మించిన దయచేఁ
బాలించి యిత్తు వెప్పుడు
చాలఁగ నిహపరములందు ♦ సకల సుఖంబుల్. పం. 48

149 క॥ వర మీయఁదలఁచి మమ్ముం
గరుణించితి కాక నిన్నుఁ ♦ గనుఁగొనుటకునై
యరసి నుతింపఁగ మాకుం
దర మగునే వరద! నీర♦దశ్యామాంగా! పం. 50

(సర్వలఘుసీసము)

150 నవవికచసరసిరుహ♦నయనయుగ నిజచరణ
గగనచరనది [1] నిఖిల♦నిగమవినుత
జలధిజనికుచకలశ♦లలితమృగమదరుచిర
పరిమళితనిజహృదయ ♦ ధరణిభరణ
దుహిణముఖసురనికర♦విహితనుతికలితగుణ
కటిఘటితరుచిరతర♦కనకవసన
భుజగరిపువరగమన ♦ రజతగిరిపతివినుత
సతతవ్రతజపనియమ♦సరణిచరిత
తిమి. కమఠ కిటి నృహరి ♦ [2] నమితబలినిహితపద
పరశుధర దశవదన♦కరవిదళన
మురమథన కలికలుష♦[3]ముదపహృతినిపుణ కరి
వరద మునిమనుజసుర♦గరుడవినుత! ఏ. 72

151 ఉ॥ తోయరుహోదరాయ భవ♦దుఃఖహరాయ నమో నమః పరే
శాయ సరోజకేసరపి♦శంగవినిర్మల[4]దివ్యభర్మవ
స్త్రాయ పయోజసన్నిభప♦దాయ సరోరుహమాలికాయ కృ
ష్ణాయ పరాపరాయ సుగు♦ణాయ సురారిహరాయ వేధసే.
చ. 920

---

(1) జనితనిగమ (2) ముదితబలి (3) సమదప హృతి (4) దివ్యనవ్య

152 ఉ॥ [1]భూరివివేకితావహ వి♦భూతిసమేత మహాత్మ దీనర
క్షారతి నొప్పు నీవు చిర♦కాలమున స్సుఖవృత్తి నీరు మా
వార లటంచు బుద్ధి నన♦వద్య దలంచినయల్పమాత్రి స
త్కారమె చాలునట్లగుట♦గా కిటు సన్నిధి వైతి వీశ్వరా!
చ. 923

153 తే॥ గీ॥ నిన్నుఁ జూడని కన్నులు ♦ నిష్ఫలములు
నిన్ను నొడువని జిహ్వ దా ♦ నీరసంబు
నిన్నుఁ గానని దినములు ♦ నింద్యము లగుఁ
గన్నులను జూచి మమ్మును ♦ గారవింపు. ఏ. 120

154 క॥ నీమదిఁ దోఁపని యర్థం
బీమేదినియందుఁ గలదె ♦ యీశ్వర భక్త
స్తోమసురభూజ త్రిజగత్
క్షేమంకర దీనరక్షఁ ♦ జేయు మురారీ! ద. 650

155 చ॥ గరుడునిమూపుపైఁ బదయు♦గంబు ఘటిల్లఁగ శంఖచక్రవ
ర్మరుచిరశార్ఙ్గఖడ్గశర♦రాజితపాశగదాది సాధనో
త్కరనికరంబు లాత్మకర♦కంజములన్ ధరియించు భూతిసం
భరితమహాష్టబాహుఁడు కృ♦పామతితో ననుఁ గాచుఁగావుతన్.
ష. 300

156 ఆ॥వె॥ [2]ప్రకటమకరవరుణ♦పాశంబులందుల
జలములందు నెందుఁ ♦ బొలయకుండఁ
గాచుఁగాక నన్ను ♦ ఘనుఁ డొక్కఁ డైనట్టి
మత్స్యమూర్తి విద్య♦మానకీర్తి. ష. 301

157 క॥ వటుఁడు సమాశ్రితమాయా
నటుఁడు బలిప్రబలశోభ♦నప్రతిఘటనో
ద్భటుఁడు త్రివిక్రమ దేవుఁడు
చటుల [3]స్థలమందు నన్ను ♦ సంరక్షించున్. ష. 302

1 భూరికిశోతరాపహవిభుత్వ 2 వరుస జలనిధికూపపాశంబులందు 3 స్థలివలన

158 చ॥ అడవుల సంకటస్థలుల ♦ నాజిముఖంబుల నగ్నికీలలం
దెడరులనెల్ల నాకు నుతి ♦ కెక్కఁగ దిక్కగుఁ గాక శ్రీనృసిం
హుఁడు [1] కనకాక్షరాక్షసవ♦ధోగ్రుఁడు విస్ఫురితాట్టహాసవ
క్త్రుఁడు ఘనదంష్ట్రపావకవి♦ధూతదిగంతరుఁ డప్రమేయుఁడై.
ప. 303

159 చ॥ అరయఁగ నెల్లలోకములు ♦ నంకిలి నొంద మహార్ణవంబులో
[2] నొరిగి నిమగ్న మైనధర ♦ నుద్ధతిఁ గొమ్మున నెత్తినట్టియా
కిరిపతి [3]యగ్నికల్పుఁ డురు♦ఖేలుఁడు నూర్జితమేదినీమనో
హరుఁడుకృపావిధేయుఁడున♦డాధ్వములన్ననుఁగాచుఁగావుతన్.
ప. 304

160 క॥ రాముఁడు రాజకులై కవి
రాముఁడు భృగుసత్కులాభి♦రాముఁడు [4] సుగుణ
స్తోముఁడు నను రక్షించును
శ్రీమహితోన్నతుఁడు నద్రి♦శిఖరములందున్. ప. 305

161 సీ॥ తాటకి మర్దించి ♦ తపసిజన్నముఁ గాచి
హరువిల్లు విఱిచి ధై♦ర్యమున మెఱసి
ప్రబలు లైనట్టి వి♦రాధకబంధోగ్ర
ఖరదూషణాదిరా♦క్షసులఁ దునిమి
వానరవిభు నేలి ♦ వాలిఁ గూలఁగనేసి
జలరాశిగర్వంబు ♦ చక్కఁ జేసి
సేతువు బంధించి ♦ చేరి రావణకుంభ
కర్ణాదివీరుల ♦ కడిమిఁ దుంచి
తే॥ గీ॥ యల విభీషణు లంకకు ♦ నధిపుఁ జేసి
భూమిసుతఁ గూడి సాకేత♦పురమునందు
రాజ్యసుఖములు గైకొన్న ♦ రామవిభుఁడు
వరుస ననుఁ బ్రోచుచుండుఁ బ్ర♦వాసగతుల.
ప. 306

(1) సురకళత్రయూథప (2) నురుతరమగ్న (3) యజ్ఞకర్మ (4) శాంతి

162 ఉ॥ రామ గుణాభిరామ దిన♦రాజకులాంబుధిసోమ తోయద
శ్యామ దశాననప్రబల♦సైన్యవిరామ సురారిగోత్రసు
త్రామ సుబాహుబాహుబల♦దర్పతమఃపటుతీవ్రధామ ని
ష్కామ కుభృల్లలామ గర♦కంఠసతీనుతనామ రాఘవా!
ద్వి, 288

163 క॥ అమరేంద్రసుతవిదారణ
కమలాప్తతనూజరాజ్య♦కారణ భవసం
తమసదినేశ్వర రాజో
త్తమ దైవతసార్వభౌమ ♦ దశరథరామా! ద్వి. 289

164 క॥ రామ సమంచితముక్తా
దామ యశఃకామ ఘనసు♦ధాధామ రుచి
స్తోమ జయసీమ జగదభి
రామ గుణోద్దామ నిఖిల♦రాజలలామా. ద. 589

165 క॥ సర్వము నీవ యెఱుంగుదు
సర్వవిలోకనుఁడ వీవ ♦ జగదధిపతివిఁక
సర్వాపరాధి నను నో
సర్వేశ యనుగ్రహించు ♦ చనియెద నింకన్. ద. 579

166 క॥ నీదిక్కు గానివారికి
నేదిక్కును వెదుక నుండ ♦ దిహపరములకు
నోమ్మదింపఁ దలఁచువారికి
నీదిక్కే దిక్కుసుమ్ము ♦ నీరజనాభా. ష. 340

167 ఉ॥ ఆఁకలిగొన్న క్రేపులు ర♦యంబున నీఁకలురానిపక్షులు
న్దీకొని తల్లికి న్మఱి వి♦దేశగతుండగు భర్త కంగజ
వ్యాకులచిత్తయైనజవ♦రాలును దత్తరమందుభంగి నో
శ్రీకర పంకజాక్ష నినుఁ ♦ జేరఁగ నామది గోరెడుంగదే!
ష. 401

168 మ॥ మును గల్పాంతమునందుఁ గుక్షి నఖిలం♦బుం దాఁచియేకాకివై
జనలోకోపరిలోకవాసులును యుః♦ష్మత్తత్త్వమార్గంబు చిం
తనముంజేయఁ బయోధియందునహిరా♦ట్తల్పంబునం బవ్వళిం
చిననీరూపము [1]నేడుసూపితివి ల♦క్ష్మీనాథ! దేవోత్తమా!
చ. 199

169 మత్త. కంటిఁ గంటి భవాబ్ధి దాటఁగఁ♦గంటి నాశ్రితరక్షకు
న్గంటి యోగిజనంబుడెందముఁ ♦ గంటి జుట్టముఁ గంటి ము
క్కంటికెంగనరాని యొక్కటిఁ ♦ గంటి దామరకంటిఁ జే
కొంటిముక్తినిధానముం దల♦కొంటి సౌఖ్యము లందఁగన్.
త్రి. 147

170 సీ॥ దండంబు యోగీంద్ర♦మండలనుతునకు
దండంబు శార్ఙ్గకో♦దండునకును
దండంబు మండిత♦కుండలద్వయునకు
దండంబు నిష్ఠుర♦భండనునకు
దండంబు మత్తవే♦దండరక్షకునకు
దండంబు రాక్షస♦ఖండనునకు
దండంబు పూర్ణేందు♦మండలముఖునకు
దండంబు తేజఃప్ర♦చండునకును
తే॥ గీ॥ దండ మద్భుతపుణ్యప్ర♦ధానునకును
దండ ముత్తమవై కుంఠ♦ధామునకును
దండ మాశ్రితరక్షణ♦తత్పరునకు
దండ మురుభోగినాయక♦తల్పునకును. మ. 336

171 ఆ॥ వె॥ వాసుదేవ కృష్ణ ♦ వరద స్వాతంత్ర్య వి
జ్ఞానమయ మహాత్మ ♦ సర్వపుణ్య
పురుష నిఖిలబీజ♦భూతాత్మక బ్రహ్మ
నీకు వందనంబు ♦ నిష్కళంక. ద. 943

(1) జూడఁగంటి మిదె రాజీవాక్ష విశ్వాత్మకా

172 ఆ॥ వె॥ పరమపురుష దుఃఖ♦భంజన పరమేశ
భక్తవరద కృష్ణ ♦ భవవిదూర
జలరుహాక్ష! నిన్ను ♦ శరణంబు వేడెద
మభయ మిచ్చి కావు ♦ మయ్య మమ్ము. ష.

స ం పూ ర్ణ ము.

